జనవరి - 1986
సంపుటి 2
సంచిక 1

# త్రివేణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు - కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-51 రామానాయుడుపేట
మచిలీపట్నం-521 001
ఫోన్ : 2818

చందా వివరాలు
విడిప్రతి : రు. 5-00
సంవత్సర చందా : రు. 33-00
జీవిత సభ్యత్వం : రు. 500-00

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SPANDANA PRINTERS
MACHILIPATNAM

## విషయ సూచిక

# సంపాదకీయం జాతీయ పార్టీలు - ప్రాంతీయ పార్టీలు

స్వాతంత్ర్యం వచ్చి 38 సం. అయినా కాంగ్రెసు (ఐ) కి జాతీయ ప్రత్యామ్నాయం ఏర్పడకపోవడం నిజంగా దురదృష్టకరం. ఆ లోటును అవిభక్త జనతాపార్టీ తీరుస్తుందని ఆశించాం. అయితే వృద్ధ నాయకుల స్వార్థ సంకుచిత ధోరణుల వలన ఆ ఆశ నిరాశగా మారింది. అంతేకాదు జనతా ప్రయోగం ఒక చేదు అనుభవాన్ని యిచ్చింది. జాతీయవాదులకు నిరుత్సాహాన్ని పంచింది. కాంగ్రెసు (ఐ) కి జాతీయ స్థాయిలో మరొక ప్రత్యామ్నాయం లేదనే భావం ప్రజలలో వ్యాపించింది. ఇది నిజంగా భారతదేశ ప్రజాస్వామ్యవ్యవస్థకే తీరని లోటు.

జాతీయ ప్రతిపక్షనాయకుల మధ్య అనైక్యత కాంగ్రెసు (ఐ) కి ఒక వరంగా లభించింది. బలం వున్నా లేక పోయినా, అన్ని రాష్ట్రములలో శాఖలు లేకపోయినా "మాది జాతీయపార్టీ, మాదే కాంగ్రెసు (ఐ) కు ప్రత్యామ్నాయం" అని ప్రగల్భాలు పలుకుతూ, స్థానిక ప్రజల సమస్యలను ఏమాత్రం పట్టించుకోకుండా, జాతీయ అంతర్జాతీయ విషయాల మీదనే కేంద్రీకరించుతూ, జాతీయ నాయకులుగా ఫోజు పెట్టి, నేల విడిచి సాము చేస్తున్న మహా నాయకులకు గత పార్లమెంటు ఎన్నికలలో ఓటర్లు చక్కటి గుణపాఠం నేర్పారు. నే పట్టిన కుందేటికి మూడే కాళ్ళు అన్న ధోరణిలో వీరు వ్యవహరించినందున, ఆ తరువాత జరిగిన శాసనసభ ఎన్నికలలో జాతీయపార్టీలకు ఘోర పరాజయం సంభవించింది!

కాంగ్రెసు (ఐ) పాలనతో విసిగిపోయిన ప్రజలు ఆనాడు జనతాపార్టీని గద్దె కెక్కించారు. అది మూడునాళ్ళ ముచ్చటే అయింది. ఆ తరువాత మరొక సమర్థవంతమైన ప్రత్యామ్నాయ పార్టీ ఏర్పడలేదు. ఈ తరుణంలో వివిధ రాష్ట్రములలో ప్రాంతీయ పార్టీలు ఆవిర్భవించాయి. ప్రతిపక్ష మనస్తత్వంగల ఓటరులు ప్రాంతీయపార్టీల మీద ఇష్టం లేకపోయినా గత్యంతరంలేని స్థితిలో ప్రాంతీయ పార్టీలకు కొన్ని రాష్ట్రములలో అధికారం వప్పగించారు. కాంగ్రెసు మీదనున్న అయిష్టతను ప్రాంతీయ పార్టీలు బాగా సొమ్ము చేసుకున్నాయి. జాతీయ పార్టీల చేతకానితనాన్ని ప్రాంతీయ పార్టీలు చక్కగా ఉపయోగించుకున్నాయి. అధికారాన్ని సంపాదించాయి.

"ప్రాంతీయ పార్టీలే ఇక దేశానికి శరణ్యం. ఇది ప్రాంతీయ పార్టీల శకం" అని విజయోత్సాహంలో ప్రాంతీయ పార్టీల నాయకులు ప్రకటనలిస్తున్నారు. "ప్రాంతీయ పార్టీలు దేశానికి ప్రమాదం, ప్రాంతీయ పార్టీలు కాంగ్రెసు (ఐ)కు ఎప్పటికీ ప్రత్యామ్నాయం కాలేవు" అని అధికారాన్ని పొందని జాతీయ నాయకులు అంటున్నారు. ఈ రెండు వాదనలలో కొంత వాస్తవం లేకపోలేదు. జాతీయ పార్టీల అసమర్థత వలననే కొన్ని రాష్ట్రములలో ప్రాంతీయ పార్టీలు అధికారంలోనికి వచ్చాయి. జాతీయ స్థాయిలో ప్రత్యామ్నాయం ఏర్పడటం చాలా మంచిదే. అప్పటిదాకా కనీసం రాష్ట్రముల స్థాయిలో కాంగ్రెసు (ఐ) కు ప్రత్యామ్నాయంగా ప్రాంతీయ పార్టీలు ఏర్పడటం పట్ల వ్యతిరేకతను వెలిబుచ్చడం మాత్రం మంచిది కాదు. "అమ్మ పెట్టదు అడుక్కోనివ్వదు" అన్నట్లుగా వున్నది జాతీయ పార్టీల వాదన.

ఏది ఏమైనా ప్రాంతీయ మనస్తత్వం పెరగడం దేశానికి క్షేమం కాదు. ప్రజలు విజ్ఞతను, దూరదృష్టిని ప్రదర్శించాలి. జాతీయ నాయకులు అహంకారాన్ని అహంభావాన్ని విడనాడాలి. రాష్ట్రముల సమస్యల యెడల ఎక్కువ శ్రద్ధ వహించాలి. అప్పుడే జాతీయ ప్రత్యామ్నాయం ఏర్పడుతుంది. అది కలగూర గంప పార్టీ కారాదు. ఒకే పార్టీగా క్రమశిక్షణగల పక్షంగా జాతీయ ప్రత్యామ్నాయం ఏర్పడటం దేశానికి క్షేమం. అది ఎప్పుడు సంభవిస్తుందో ? .... ★

శ్లో॥ కాశీ క్షేత్రం శరీరం త్రిభువన జననీ వ్యాపినీ జ్ఞాన గంగా
భక్తిః శ్రద్ధా గయేయం నిజగురుచరణ ధ్యానయోగః ప్రయాగః
విశ్వేశోఽయం తురీయః సకలజన మనస్సాక్షి భూతోఽంతరాత్మా
దేహే సర్వం మదీయే యది వసతి పునస్తీర్థ మన్యత్కిమస్తి ?

సామాన్యంగా భక్తజనులు భక్తిప్రపత్తులతో తీర్థక్షేత్రాలకు వెళ్ళటం పరిపాటి. అనేక గంగాది పుణ్య నదుల్లో స్నానాలు చేయటం కాశీలాంటి పుణ్య క్షేత్రాలు చేరి దైవ దర్శనం చేసుకోటం ఒక ధర్మంగా భావించి పుణ్య సంపాదనం చేసుకొంటారు. ఈ సంప్రదాయం మంచిది కాదని అనలేంకదా ?

# అమృతవాణి

మాచిభట్ల చంద్రశేఖరశర్మ

సామాన్య దృష్టితో చూస్తే తీర్థ క్షేత్ర సందర్శనం వల్ల మనిషికి మంచి ప్రయోజనం కలగటం నిజం తీర్థ యాత్రలు చేసిన వాళ్ళల్లో దయా దాక్షిణ్యాలు, సౌమ్య భావం కలుగుతాయి. కష్ట సుఖాలు తెలుస్తాయి. రకరకాల మనుష్యులతో సంబంధ మేర్పడుతుంది. విభిన్న జీవన సాంఘిక విధానం అర్థమౌతుంది. తోటి మనుష్యుల మీద సమతా మమతలు ఏర్పడతాయి. అలాగే విభిన్న ప్రాంత పర్యటనం జరగటంతో ఒక విశాల భావం కలిగి లోకజ్ఞానం కలుగుతుంది.

అయితే ఆధ్యాత్మిక దృష్టితో జీవనయాత్ర సాగించే వ్యక్తికి యిలాంటి విషయాలంతగా మనసుకు పట్టవు. అలాంటివారు శారీరకంగా తీర్థయాత్రలకై శ్రమపడ నక్కర్లేదు. వాళ్ళకు మనస్సే సర్వ సాక్షి. అంతకు ముందే ఉదాత్త భావాలుకల వాళ్ళ హృదయం దైవ తత్త్వాన్ని ప్రతిబింబింప జేసుకోగలిగి వుంటుంది. ఆ స్థితికి చేరుకున్న వ్యక్తికి అన్నీ తన మనస్సులోనే వుంటాయి.

పంచభూతాలవల్ల యేర్పడిన యీ శరీరమే కాశీ క్షేత్రం అవుతుంది. మరి కాశీలో గంగానది వుంది కదా! మరీ శరీరంలో ఏముంది అంటే జ్ఞానమనే గంగ యీ శరీరం లోనే ప్రవహిస్తోంది. ఇది సర్వ వ్యాపిని. అంటే దేశ కాలాలతో సంబంధం లేకుండా సర్వత్ర ప్రవహించేది యీ జ్ఞాన గంగ.

ఈ శరీరంలో వున్న జీవుడికి గల భక్తి శ్రద్ధలే గయ. కాశీ వెళ్ళినవాళ్ళు గయకు, ప్రయాగకు వెళ్ళకుండా రారు. ఆ ప్రయాగ కూడా యిక్కడే వుంది. అదే గురుదేవుని చరణ కమల ధ్యానం. అంటే మనస్సెప్పుడూ జ్ఞానాన్ని ప్రసాదించిన గురువు యొక్క పాద పద్మాలయందే నిలచి వుండట మన్నమాట. ఆ యోగమే ప్రయాగ.

కాశీ క్షేత్రంలో వేంచేసియున్న మహాదేవుడు విశ్వేశ్వరుడైన విశ్వనాథస్వామి. ఇక యీ శరీర క్షేత్రంలో నిత్య సన్నిహితంగా వేంచేసియున్న అంతరాత్మే ఆ విశ్వనాథుడు. ఈ అంతరాత్మ సర్వజనులకు మనస్సాక్షిగా సర్వదా వుండిన పరమాత్మ.

ఈ విధంగా సమస్తము ఈ దేహంలోనే విలసిల్లుతుంటే వేరే తీర్థ క్షేత్రాల ప్రసక్తి మన కెందుకు ? అని ఒక మహోదాత్త భావన మన కందించారు జగద్గురు శంకరులు.

అన్నింటికీ మనస్సే కారణం కనుక మన మనస్సును శుద్ధం చేసుకుంటే దానిలో దైవ శక్తులన్నీ ప్రతి ఫలిస్తాయి. చిత్తశుద్ధి లేనప్పుడు ఏం చేసినా ప్రయోజనం శూన్యం. కనుకనే "చిత్త శుద్ధి లేని శివపూజ లేలయా ?" అని అన్నాడు వేమన. ★

## 'శ్రీవాణి' ప్రథమ వార్షికోత్సవ ఆహ్వాన సంఘం



కూర్చున్నవారు : ఎడమ నుంచి కుడికి-సర్వశ్రీ శిర్విశెట్టి సత్యనారాయణ, డా. ధన్వంతరీ ఆచార్య, సి.యన్. రంగస్వామి, పుసునూరి జగన్నాథరావు, డా. దాలిపర్తి సుబ్బారావు, జాగాల వెంకటేశ్వరరావు, చలమలశెట్టి నాంచారయ్య, దేసు వెంకట సుబ్బారావు.

నిలుచున్నవారు : ఎడమ నుంచి కుడికి-సర్వశ్రీ యార్లగడ్డ రాధాకృష్ణమూర్తి, దివాకర్ల వెంకటేశ్వర్లు, కూరాళ్ళ రామచంద్రరావు, యల్.యస్.శాస్త్రి, పాలపర్తి సీతారామారావు, తుమ్మలపల్లి సదాశివరావు, కొమరగిరి కృష్ణమోహనరావు, దారా వెంకటరత్నం ( రాజా ), గుడివాడ రామచంద్రరావు, దింటకుర్తి అచ్యుతరావు, కూరాళ్ళ కామేశ్వరరావు.

# "శ్రీవాణి" జీవిత సభ్యులు



శ్రీ సుంకర రామాంజనేయులునాయుడు
బందరు



శ్రీ పనమా పూర్ణచంద్రరావు
గుంటూరు



శ్రీ జె. ఏ. ఆర్. గుప్త
విజయవాడ



శ్రీ యం. వి. శాస్త్రి, ఆడిటర్
మచిలీపట్నం



శ్రీ యం. వి. రాఘవయ్య, అడ్వకేటు
మచిలీపట్నం



దేవగానుగుల సుబ్బారావు
మచిలీపట్నం



శ్రీ పల్లపోతు సర్వేశ్వరరావు
మచిలీపట్నం



డా॥ వల్లభజోశ్యుల రాధాకృష్ణమూర్తి
మచిలీపట్నం



డా॥ గద్దె సత్యనారాయణప్రసాద్
ఏలూరు

# "శ్రీవాణి" జీవిత సభ్యులు



శ్రీ శిర్విశెట్టి సత్యనారాయణ
మచిలీపట్నం



శ్రీ అరవ వెంకటరమణరావు
మచిలీపట్నం



శ్రీ పొట్టి సత్యనారాయణ, అధ్యక్షులు,
బియ్యం వర్తక సంఘం, విజయవాడ



శ్రీ కూనపరెడ్డి శ్రీనివాసరావు
మచిలీపట్నం



శ్రీ యం. వి. సుబ్బారావు



శ్రీ పిల్లి ఆదిశేషావతారం, అడ్వకేట్

మకర సంక్రాంతి
శుభసందర్భముగా
పాఠకులకు, ప్రకటనకర్తలకు,
రచయితలకు, ఏజంట్లకు,
అందరికీ మా శుభాకాంక్షలు.

*

ప్రథమవార్షికోత్సవ సంచికను
జయప్రదంగా వెలువరించేందుకు
సహకరించిన –
ఎందరో మహానుభావులు
అందరికీ కృతజ్ఞతాభివందనాలు.

– సంపాదకుడు

# సంక్రాంతి - క్రాంతి

మన భారతీయ సంస్కృతిలో అనేకములైన పర్వములు ( పండుగలు ) వున్నాయి. చైత్రమాసము నుండి ఫాల్గునము వరకు అన్ని మాసములలోను మనకు పండుగలు కన్పిస్తాయి. ప్రతి పండుగలోను మన ప్రాచీన సంస్కృతి, పురాతనమైన ఐతిహాసిక వైభవము, నాటి ఆచార వ్యవహారాలు, ఆధ్యాత్మిక జీవన పరమార్థాలు మనకు సూచింపబడుతూ వుంటాయి. అలాగే పాడ్యమి నుండి పూర్ణిమ వరకు వచ్చే తిధులు చాంద్రమానం ప్రకారం మాసాంతమున వచ్చే అమావాస్య తిధి, అన్నీ పండుగ దినాలే.

సంవత్సరారంభంలో మొదటి మాసంలో మొదటి పక్షంలో మొదటి తిధి అయిన చైత్ర శుద్ధ పాడ్యమి, సంవత్సరాది పండుగగ మన సంస్కృతిలో అనాదిగ ప్రసిద్ధి చెందింది. ఆ పర్వమును ' యుగాది ' అంటారు. మన వాడుకలో ' ఉగాది ' అయింది. యుగ మనగా సంధి—పాత క్రొత్తల సంవత్సరాల సంధి కనుక, యుగమున కాది కనుక ' యుగాది ' అని పేరు వచ్చింది. సంస్కృత భాషలోని ' యుగ ' శబ్దము తెలుగులో ' ఉగ ' శబ్దంగా మారుటచే ' ఉగాది ' గా వ్యవహరిస్తున్నాము. ఆ యుగాది ప్రకృతిలోని ప్రతి ప్రాణికి నూతనోత్సాహాన్ని కలిగిస్తూ వినూత్న సౌందర్యంతో విశిష్ట జీవిత పరమార్థాన్ని వ్యక్తం చేస్తూ వుంటుంది. సంవత్సరంలోని క్రొత్తదనంతోపాటు తమ జీవితాల్లో కూడ క్రొత్తదనం చూపించుకుంటూ ఉగాదినాడు అభ్యంగ స్నానాలు, పంచాంగ పూజ, షడ్రుచులతో కలసిన వేప పువ్వును తినడం, పంచాంగ శ్రవణం ద్వారా భవిష్యత్తులోని మంచి చెడులను లాభ నష్టాలను తెలుసుకొనడం, నూత్న వస్త్ర ధారణం వంటి ఆచారాలను నేటికి చాలమంది భారతీయులు పాటిస్తూ వుంటారు.

ఈ పంచాంగ శ్రవణంలో సంక్రాంతిని గురించి, సంక్రమణ పురుషుని గురించి ఆయన స్వరూప, స్వభావముల వల్ల కలిగే శుభా శుభములను గురించి సంప్రదాయ విధులు ప్రత్యేక శ్రద్ధ కలిగి వుంటారు.

మల్లాప్రగడ శ్రీరంగారావు

ఆరు ఋతువులతో కూడిన సంవత్సరంలోని ప్రకృతి వలె ఆరు రుచులను అనుభవిస్తున్న మానవుడు నానాత్వంలోని ఏకత్వాన్ని, కాలానుగుణంగా వచ్చే మార్పులను భావిస్తూ అనుభవిస్తూ ఆ సంవత్సర జీవితాన్ని ( బేరీజు ) పరిశీలన చేసుకుంటాడు. ఈ పరిశీలనలో సంక్రాంతికి గల ప్రత్యేకత, విశిష్టత, పవిత్రతలను కూడ భావించి, ఆ సంక్రాంతి క్రాంతి తన కెల్లప్పుడు కలగాలని అభిలషిస్తూ వుంటాడు. ఇలా అన్ని పండుగలలోను చారిత్రిక సాంఘిక ఇతిహాసాలకు సంబంధించిన ఒక్కొక్క పరమార్థం మనకు స్ఫురణకు వస్తూ వుంటాయి. ఉగాదినాడు వచ్చే పాడ్యమి మొదలు, యమద్వితీయ, అక్షయ తృతీయ, వినాయక చతుర్థి, ఋషి పంచమి, సుబ్రహ్మణ్య షష్ఠి రథసప్తమి, కృష్ణాష్టమి, శ్రీరామనవమి, విజయదశమి ఈ విధంగా ప్రతి తిధి మనకు పర్వకాలంగానే మన శాస్త్రం హెచ్చరిస్తోంది. అలాగే ఒక్కొక్క నెలలో ఒక్కొక్క దేవతా సంబంధమైన పర్వకాలాలు కూడ మనకు గోచరిస్తూ వుంటాయి. చైత్ర శుద్ధ నవమి, వైశాఖ శుద్ధ పంచమి, జ్యేష్ఠ పూర్ణిమ, ఆషాఢ ఏకాదశి ( తొలి ఏకాదశి ) శ్రావణ బహుళాష్టమి భాద్రపద చతుర్థి, ఆశ్వయుజంలో దేవీ నవరాత్రి మహోత్సవాలు, కార్తీకంలో రుద్రాభిషేకం, ఆకాశ దీపం, జ్వాలాతోరణం, మార్గశిరంలో గీతా జయంతి, పుష్యమాసంలో సంక్రాంతి,

మాఘంలో మహా శివరాత్రి, ఫాల్గునంలో ఉత్తర ఫల్గునీ నక్షత్రయుక్త పూర్ణిమనాటి శ్రీలక్ష్మీదేవి ఆవిర్భావం, మన ఆధ్యాత్మిక, సాంఘిక ప్రభావాలను ప్రసరింపచేసే దివరత్నాలు.

ఇట్టి అనంత కాలచక్రంలో గల సంవత్సర పరిధిలోని 12 రేఖలే 12 నెలలు. ఒక్కొక్క నెల కొక్కొక్క రాశి. ఒక్కొక్క రాశిలో గ్రహరాజైన సూర్యుడు ప్రవేశిస్తూ వుంటాడు. అందుకే సూర్యుని ద్వాదశాదిత్యులుగా మన శాస్త్రం పేర్కొన్నది. సూర్యుడు ఒక్కడే అయినా 12 నెలల్లో 12 రాశుల్లో ప్రవేశిస్తున్నందున భిన్న భిన్న నామాలతో వ్యవహరింపబడుతూ వుంటాడు. ఒక రాశి నుండి మరొక రాశి లోనికి సూర్యుడు ప్రవేశించుటనే సంక్రమణమని సంక్రాంతి అని అంటారు.

సమ్యక్ క్రమణం - సంక్రమణం - సూర్యుని సంచరణ క్రమమే సంక్రమణ మన్నమాట. "సూర్యస్య క్రమణం సమ్యక్ రాశీనాం క్రమణేనవై । తద్ధి సంక్రమణం ప్రోక్తం బుధైః జ్యోతిషశాస్త్రగైః" అను జ్యోతిష సూక్తి ననుసరించి రాశుల క్రమంగా సూర్యుని ప్రవేశమునే సంక్రమణ మంటారు. మేష సంక్రమణం, వృషభ సంక్రమణం మొదలైన ద్వాదశిరాశుల సూర్య ప్రవేశానికి 12 నెలల్లోను 12 సంక్రమణ పర్వకాలాలున్నాయి. ఈ 12 సంక్రమణాల్లోను దక్షిణాయన ఉత్తరాయన ప్రవేశములకు సంబంధించిన కర్కాటక సంక్రమణ, మకర సంక్రమణములు మాత్రమే మనకు ఆచార్య వ్యవహారాల్లో జ్ఞాపకానికి వస్తున్నాయి.

భూమధ్య రేఖకు దక్షిణమున సూర్యుడు సంచరించే కాలానికి ( శ్రావణమాసం మొదలు పుష్యమాసం వరకు) దక్షిణాయనమని, భూమధ్యరేఖకు ఉత్తరమున సూర్యుడు సంచరించే కాలానికి ( మాఘమాసం మొదలు ఆషాఢం వరకు ) ఉత్తరాయనమని వ్యవహారం. భూమధ్యరేఖకు

దక్షిణోత్తరములందలి సూర్యుని గమనాన్ని ప్రధానంగా భావించి ప్రతి ఆరు నెలలకు వచ్చే యీ సూర్య గమన భేదమును గుర్తించి దక్షిణాయన ప్రారంభంలో సూర్యుడు కర్కాటక రాశిలోను, ఉత్తరాయన ప్రారంభంలో సూర్యుడు మకర రాశిలోను ప్రవేశించుటచే ఈ రెండు సంక్రమణాలే ప్రధానంగా గుర్తించడం జరిగి వుంటుంది. ఈ రెంటిలో కూడా మకర సంక్రమణ కాలాన్నే మనం 'సంక్రాంతి' పర్వదినంగా భావిస్తున్నాం.

ఆంగ్ల సంవత్సర పద్ధతిలో ప్రతి సంవత్సరం జులై 16 న కర్కాటక సంక్రమణం, జనవరి 14 న మకర సంక్రమణం వస్తూ వుంటాయి - తెలుగు సంవత్సర మాసాలలో ఆషాఢంలో కర్కాటక సంక్రమణం - పుష్యమిలో మకర సంక్రమణం వస్తూ వుంటాయి. ఆంగ్ల వత్సరంలోను, తెలుగు సంవత్సరంలోను యీ పై నియమం తప్పనిసరిగా వుంటూనే వున్నది.

మకర సంక్రమణ పర్వకాలాన్నే సంక్రాంతి పండుగగా దేశమంతా మహోత్సాహంతో జరుపుకుంటుంది.

ఐతిహాసికంగా సూర్యుడు ఉత్తరాయణ గమనం ప్రారంభించే పవిత్రమైన పర్వం గనుక భారతీయులకిది చాల పవిత్రమైనది. ఆనాడు తమతమ పితృ దేవతలకు తర్పణాదులొనర్చి కూష్మాండ దానము లొనర్చి యధాశక్తి అన్న సంతర్పణ చేస్తారు. ఉత్తరాయన కాలము తేజోమార్గం - ఈ కాలంలో మరణించిన వారికి ఉత్తమ లోకాలు వస్తాయని శాస్త్ర వాక్యం - ఇట్టి పర్వకాలములో దేవతలను, పితృ దేవతలను, అతిథులను ఆరాధించి ఆదరించిన వారికి శుభ పరంపరలు, ఆయురారోగ్య భాగ్యములు కలుగుటయే గాక, వారి పితృదేవతలకు కూడా ఉత్తమ గతులను కలిగింపచేసిన వారవుతారు. మేష సంక్రమణానికి ముందు ( సూర్యుడు రాశిలో ప్రవేశించుటకు ముందు ) 10 ఘడియల కాలము - తరువాత 10 ఘడియల కాలములకు విషువమని పేరు. వృషభ సంక్రమణానికి విష్ణుపదమని, మిథున సంక్రమణానికి షడశీతి అని, కర్కాటక సంక్రమణానికి అయనమని, సింహ సంక్రమణానికి విష్ణు పదమని, కన్యా సంక్రమణానికి షడశీతి అని, తులా సంక్రమణానికి విషువమని, వృశ్చికమునందు విష్ణుపదమని, ధనుస్సు నందు షడశీతి అని, మకరమందు అయనము, కుంభమందు విష్ణుపదము, మీనమందు షడశీతి అని వ్యవహారము. ఈ సంక్రమణ పుణ్యకాలంలో ఉత్తరోత్తరమధికమని సంప్రదాయజ్ఞుల వాక్యం.

విష్ణుపద, షడశీతి, విషువ, అయన అను వాటిలో అయన సంక్రమణము ఉత్తమమని శాస్త్రం. అందులోను, దక్షిణాయనం కంటె ఉత్తరాయనం సర్వోత్తమం. ఆ కారణం చేత మకర సంక్రాంతి ప్రత్యేక పవిత్రత భావింపబడుతున్నది.

'తమసోమా జ్యోతిర్గమయ' చీకటిలో నుండి నన్ను వెలుగు లోనికి తీసుకొని పొమ్ము అను అర్థం గల వేద వాక్యమునకు యీ మకర సంక్రమణ సమయమే నాంది.- ధూమయానమైన దక్షిణాయనం నుండి ఉత్తరాయనం లోనికి నన్ను తీసికొని పొమ్ము అనుటలో (భా = ఆత్మ ప్రకాశమందు రతి = ఆసక్తిగల) భారతీయుల సహజ

With best compliments from

Grams : 'BEZMOTORS'

Phones : 52270 (Office)
76295 (Resi.)

# BEZWADA MOTOR STORES

**Bundar Road, Patamata**

**VIJAYAWADA – 520 006**

★

**AUTHORISED DEALERS FOR**

PREMIER PADMINI CARS
PREMIER COMMERCIAL VEHICLES
MASSEY FERGUSON TRACTORS &
IMPLEMENTS : PERKINS DIESEL
ENGINES AMCO BATTERIES

**AND**

ALL SPARE PARTS, ACCESSORIES
TYRES AND TUBES

లక్ష్యము వ్యక్తం అవుతుంది. ఆధ్యాత్మిక సాధనకిది యొక మలుపు.

చారిత్రకంగా భావిస్తే సంక్రాంతికి ముందు రోజున వచ్చే భోగి పండుగనాడు చేసే బలిపూజ వామనావతారం లోని బలిచక్రవర్తి కథను స్ఫురింపచేస్తుంది. వదాన్య చక్రవర్తి అనిపించుకున్న బలి చక్రవర్తి దేవతా సామ్రాజ్యాన్ని ఆక్రమించి దేవతలకు నిలువ నీడలేని పరిస్థితిని కల్పించినపుడు వామనుడు మూడడుగుల భూమిని దానమడిగి, బలిచే సమ్మతింపచేసి, త్రివిక్రముడై భూమ్యాకాశాలను రెండడుగులమేర ఆక్రమించి 3 వ అడుగు భూమికి చోటు చూపించలేని బలిచక్రవర్తిని పాతాళమునకు పంపిన దీ భోగి రోజునే. దాన గుణము కలవాడే అయినా దేవతలకు బాధ కలిగించే దానాతిశయము బలిచక్రవర్తిని బలిచేసి పాతాళమునకు పంపివేసింది. భగవంతుడైన వామన మూర్తికి ఆత్మదానము చేసిన పుణ్య ప్రభావంచే చిరంజీవియై బలిచక్రవర్తి సప్త చిరంజీవులలో ఒకడుగా శాశ్వత కీర్తిని సంపాదించుకున్న చరిత్ర యీ భోగిన్నాడు సంస్మరణీయము. బొమ్మల కొలువు పేరుతో రకరకాల బొమ్మలను అందంగా వేదికలపై అలంకరించి పూజించి బలి పూజగా భావించి తమ బాధలు తొలగిపోయినవని ఆనందించే వేడుకలోని ఆంతర్యం కూడ యిదే.

సాంఘికంగా కోడి పందెములు, గొబ్బిళ్ళ పూజ సమాప్తి, కొత్త అల్లుళ్ళు మామగారిళ్ళకు వచ్చి నూత్న వస్త్ర ధారణతో, మృష్టాన్న భోజనాలతో ప్రశాంతమైన పరితృప్త జీవనం గడపడం, భూమాత పంటల బరువుతో కళకళలాడుతూ కన్నుల పండువుగ ప్రకృతిని పులకరింప చేయడం అటు ప్రకృతిలోను ఇటు ప్రకృతి యందలి ప్రాణికోటిలోను మనకు సంక్రాంతి క్రాంతిని సందర్శింప చేస్తూ వుంటాయి. పుడమితల్లి తన బిడ్డలకు కావలసిన ఆహార పదార్థాలను పుష్కలంగా అందించి శారీరకమైన పుష్టిని, ఉత్తరాయన సూర్యగమనం ద్వారా మానసికమైన తుష్టిని కలిగించేది యీ సంక్రాంతి క్రాంతియే. అబాల గోపాలము అన్ని వర్గాలవారు వారి వారి సంప్రదాయ



సామర్థ్యముల ననుసరించి దేవ, పితృ, ఋషి, మనుష్య, భూత యజ్ఞముల ద్వారా ( ఆ యా స్వరూపాలకు పదార్థముల నిచ్చి ఆదరంతో ఆరాధించుట ద్వారా ) ప్రకృతిమాతను గౌరవించి ఆమె అనుగ్రహంతో ఆనంద సందోహములను అందరికి పంచిపెట్టే పవిత్రమైన సంక్రాంతి క్రాంతి భారతీయుల పవిత్ర చరిత్రకు ప్రత్యక్ష నిదర్శనము. మానవుల ఆశాజ్యోతిని జీవనజ్యోతిని మరింత ప్రకాశింపచేసే సూర్యభగవానుడు కేవలము గ్రహరాజు మాత్రమే గాక సకల ప్రాణికోటి ఉజ్జీవమునకు ఉత్సాహమునకు కారణభూతుడై నర, పశు, పక్షి, మృగ సంచయానికి క్రాంతిని కలిగించి సంక్రాంతి శోభను సముజ్వలింప చేయగలడని చేస్తాడని భారతీయుల విశ్వాసం.

అందుకే యీ మకర సంక్రాంతి ప్రాణికోటికి క్రాంతియై విక్రాంతియై విరాజిల్లుచున్నది—"ఆనోభద్రాః క్రతవోయన్తు విశ్వతః ". ★

# సాధకుడా! లెమ్ము! నడుము కట్టుము, సమాజసేవలో ప్రవేశించుము

- సత్య సాయి బాబా

సాధకుడా! లెమ్ము! నడుము కట్టుము. సమాజసేవలో ప్రవేశించుము. కేవలం "సోఽహం సోఽహం" అని ముక్కు మూసుకొని జపం చేసినందువలన వచ్చే ప్రయోజనం ఏమీ వుండదు. ప్రతి సాధకుడు త్యాగం అనే సుగుణమును అలవరచుకోవాలి. సోమరితనాన్ని దరికి చేరనీయరాదు. జీవిత తత్త్వాన్ని అర్థం చేసుకొనేటటువంటి సాధనా వృత్తిలో ప్రవేశించుము. సేవ చేయని జీవితం చీకటి మందిరం. ఈ చీకటి మందిరం ఒక దయ్యాల కొంప. కనుక సేవ అనే దివ్యజ్యోతిని హృదయంలో వెలిగించాలి. అప్పుడే విశాలమైన హృదయంలో దివ్యత్వమనే భావం చోటు చేసుకుంటుంది – అని బాబాగారు 60వ జన్మదినోత్సవ సందర్భమున పుట్టపర్తిలో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగ సభలో చేసిన ఉపన్యాసంలో పేర్కొనినారు.

## సమాజసేవ

మానవునికి సేవ ప్రధానమైనది. అందులో సమాజ సేవ చాలా ఉత్తమమైనది, పవిత్రమైనది. ఫలాపేక్ష లేకుండా సేవను చేయాలి. కేవలం మాటలతో కాలం వృధా చేయరాదు. భగవంతుడు సర్వజ్ఞుడు, సర్వ వ్యాపకుడు, సర్వశక్తివంతుడు అని మాటలు ఉచ్చరించి నందువలన వచ్చే ప్రయోజనం ఏమాత్రం లేదు. ఎవరికి వారు ప్రశ్నించుకోవాలి? ఎంతమంది చెప్పిన దానిని ఆచరణలో పెడుతున్నారు? ఆచరణలో పెట్టకుండా కేవలం ఆనందాన్ని వెలిబుచ్చిన ఫలితమేమి? చెప్పు మాటలకు చేయు క్రియలకు సన్నిహిత సంబంధంవుండాలి.

## కర్మయోగము

కర్మయోగం జీవితమునకు ప్రధానమైన పునాది వంటిది. కర్మను, నిష్కామ కర్మ ద్వారా ప్రవేశపెట్టి, నిస్వార్థ సేవలో జీవితాన్ని అంకితం చేసుకోవాలి. కర్మ నిమిత్తం, కర్మల నాచరించడం కర్మయోగ సిద్ధాంతం. కర్మ 'యువారికి ఆరోగ్యం ప్రధానంగా వుండాలి. చెట్లను

> DUTY WITHOUT LOVE IS DEPLORABLE
>
> LOVE WITHOUT DUTY IS DIVINE
>
> DUTY WITH LOVE IS DESIRABLE

పెంచడం, దిక్కులేనివారికి సహకారం చేయడం, రోగ పీడితులకు సేవ చేయడం, అన్నార్తులకు ఆహారం అందించడం సేవ యొక్క ప్రధాన లక్షణాలు. ఈ పను లను చాలామంది చులకనగా భావిస్తారు. ఇది చాలా పొరపాటు. దీనిలోని దివ్యత్వాన్ని చూడలేనివారే చులకనగా చూస్తారు. శ్రీకృష్ణుడంతటివాడు మానవత్వపు విలువలను ప్రకటించదలచి పశు పక్ష్యాదులకు కూడా సేవచేసి చూపించాడు. గుఱ్ఱములకు, గోవులకు సేవ చేస్తాడు. కత్తిపట్టి యుద్ధం చేయలేదు. సారథ్యాన్ని మాత్రం వర్తించాడు. ఇది నిస్వార్థసేవకు ఆదర్శమని ప్రపంచానికి నిరూపించాడు.

## నిష్కామ కర్మ

**అంతేకాదు లోకములో** నున్న సమస్త భోగ పదార్థములు కేవలం ఏ ఒక్కరి నిమిత్తం ఏర్పడినట్టిది కాదనే నగ్నసత్యాన్ని గుర్తించడం అత్యవసరం. వర్షములు కురుస్తున్నాయి. నదులు ప్రవహిస్తున్నాయి. పంటలు పండుతున్నాయి. సూర్యుడు ఉదయం నుంచి సాయంత్రం వరకు ప్రకాశమును లోకమునకు అందించుచున్నాడు. చంద్రుడు ప్రపంచానికి చల్లదనమును ప్రసాదించుచున్నాడు. ఇవన్నీ ఏ ఒక్కరి నిమిత్తం ఏర్పడినవి కావు. వీటిని ప్రతి వ్యక్తి అనుభవించడానికి అవకాశం, అధికారం వున్నది. ఇదే నిజమైన నిష్కామ కర్మ యోగతత్త్వం.

## మానవత్వం

సేవ జీవితమునకు ఆనందం, రుచిని కలిగించే లవణం వంటిది. విశ్వప్రేమ జీవితమునకు పుష్టిని అందించే ఆహారం వంటిది. దాతృత్వము జీవితమునకు సుగంధం నందించేటటువంటిది. మంచి ధ్యానం మనయొక్క ప్రాణం వంటిది. కనుక జీవితమునకు 'రుచి' మొదటిది. రెండవది 'పుష్టి' (బలం). మూడవది 'సుగంధం' నాల్గవది 'ప్రాణం'. ఈ నాల్గిటి ఏకత్వమే 'మానవత్వం'. మానవత్వంలో రుచి ఏమిటి? సద్గుణములే మానవత్వానికి చక్కని రుచి. సదాచారమే మానవునికి చక్కని బలం. సదాచారమే లేకుండిన బలహీనుడై, దుర్బలుడుగా మారిపోతాడు. సుగుణములలోని పవిత్ర భావములు మానవునికి సుగంధములు. కనుక మానవుడు త్యాగంతో, సహన భావంతో జీవించడమే జీవితమునకు చక్కని సుగంధం. మన ప్రాణం ఏమిటి? ప్రాణమనగా కేవలం పైకి కనిపించే చైతన్య శక్తే కాదు. సద్గుణములు, సదాచారములు, త్యాగ సహనములు లేకుండిన ఇది ప్రాణంలేని జీవితమే అవుతుంది. కనుక మానవునికి ప్రధానమైనవి 1. సద్భావం. 2. సదాచారం. 3. సత్కర్మాచరణ. 4. త్యాగం, ఉదారభావం అత్యవసరములు.

మేము సాయి భక్తులం
సత్య సాయి శిష్యులం
మాది భక్తిమార్గము
మనసు సాయి నిలయము

మేము సత్య సాధకులం
సత్యసాయి భక్తులం
మాది సత్యమార్గము
మనసు సాయి నిలయము

మేము ప్రేమ పాత్రులం
ప్రేమ సాయి శిష్యులం
మాది ప్రేమ మార్గము
మనసు సాయి నిలయము

మేము ధర్మ బద్ధులం
ధర్మ సాయి భక్తులం
మాది ధర్మ మార్గము
మనసు సాయి నిలయము

మేము శాంతి కోరెదం
మాతృదేశ భక్తులం
మాది శాంతి మార్గము
మనసు సాయి నిలయము.

## సాయి ఆదేశం

కనుక సాయి కోరుకొనేది సోదర మానవుని ప్రేమించి, సమాజసేవ చేసి, మానవత్వమనే పదమునకు సరైన సార్థకత్వాన్ని సంపాదించుకోవాలి. స్వార్థాన్ని త్యాగం చేయండి. పరార్థంలో ప్రవేశించండి. పవిత్రతను పెంచుకోండి. కడపటి శ్వాస వదిలేంతవరకు సేవలో నిమగ్నం కావాలి. సేవలో ప్రవేశించండి. గ్రామాలకు వెళ్ళండి. పామరులను ఆదుకోండి. ఇదే నా ఈనాటి సందేశం, ఆదేశం.

- కొమరగిరి కృష్ణమోహనరావు

రెండు మూడేళ్ళ క్రితం ప్రముఖ వారపత్రికలో ప్రచురింపబడ్డ అరుణశ్రీగారి మొదటి కథ చదివినప్పుడే అతనిపై అభిమానం కల్గింది కిరణ్ కు.

ఆ కథలో ప్రస్తుత సమాజంలో వున్న వరకట్న దురాచారాన్ని నిరసిస్తూ, ఆడపిల్లలు, ఆడపిల్లల తల్లిదండ్రులు కట్న పిశాచి విషకోరల్లో ఎలా నలిగిపోతున్నారో బ్రహ్మాండంగా రాసాడు రచయిత.

యువకులు వరకట్నానికి బానిసలై పశువుల్లా అమ్ముడుపోతున్నారని, వరకట్నం తీసుకునే పురుషులను పెళ్ళాడటం స్త్రీలు అవమానంగా భావించాలని సందేశమిస్తూ ముగించాడు.

# రచయితగారూ! నమస్తే




కొలువ మల్లయ్య

ఆ కథ చదివినప్పట్నుంచీ అరుణశ్రీగారి కథల కోసం అన్ని దిన, వార, మాస పత్రికలు చూస్తున్నాడు కిరణ్. కొద్ది రోజుల తర్వాత ఓ మాస పత్రికలో మరో కథ అచ్చయింది. ఆ కథలో కట్న కానుకల కొరకు అత్తమామలు, ఆడుబిడ్డలు, భర్త ఓ యువతిని నానా రకాలుగా హింసించడం కళ్ళకు కట్టేలా చిత్రించాడు. ఆ యువతి ఆత్మహత్య చేసుకోవాలని మొదట నిర్ణయించుకొని తర్వాత అందర్నెదిరించి స్వతంత్రంగా బ్రతకడానికి నిర్ణయించుకున్నట్టుగా ముగింపిచ్చాడు. ఆ కథ చదివిన తర్వాత రచయితపై కిరణ్ అభిమానం ద్విగుణీకృతమైంది.

మరో వారపత్రికలో స్త్రీ హక్కులగూర్చి, స్త్రీ బానిస సంకెళ్ళను త్రెంచుకొని బయటకు రావల్సిన ఆవశ్యకత గురించి చాలా బాగా రాసాడు. ఆ కథ చదివి రచయితకు స్త్రీ జాతిపైవున్న అభిమానానికి జోహార్లర్పించాడు కిరణ్. మరో కథ క్లబ్బుల్లో పేకాట గూర్చి, తాగుడు గూర్చి రాసాడు. నవ నాగరికులుగా, పెద్దమనుషులుగా పరిగణింపబడుతున్న పెద్దలు క్లబ్బుల్లో చేసే తతంగాన్నిగూర్చి హృద్యంగా లిఖించాడు. సమయాన్ని వాళ్ళెలా వృధా చేస్తున్నారో తెలిపాడు. ఆ కథ చదివిన తర్వాత కిరణ్ కు అతడు అభిమాన రచయిత గాక ఆరాధనరచయితయ్యాడు. అప్పట్నుంచే అతన్నోసారి కలుసుకొని మాట్లాడితే బాగుండు ననుకుంటున్నాడు. కానీ వీలు పడలేదు. తర్వాత మరెన్నో కథలు చదివాడు. అన్నిట్లోనూ ఏదో ఆదర్శం, సంస్కరణ, సమాజం బాగుపడా

## మహర్షి

వచనాలు
వ్యాకరణానికే కాదు
వ్యక్తికీ అవసరమే
మిత వచనం
హిత వచనం
సత్య వచనం
సదా ప్రయోగించే మనిషి
సాక్షాత్తు మహర్షి.

— సూర్యదేవర రవికుమార్

లన్న తపన, వ్యక్తుల శీలం బాగుపడాలన్న ఆరాటం కనిపించేవి. అతని రచనలు చదువుతున్న కొద్దీ కిరణ్‌కు ఆరాధనా భావం పెరుగుతూనే వుంది. అతడు కొన్ని కథల పోటీల్లో ప్రైజులు కూడా పొందాడు. తన ఆరాధ్య రచయిత క్రమక్రమంగా ప్రముఖ రచయితల్లో ఒకడవు తున్నందుకు కిరణ్‌కు గర్వంగా వుంది. తన స్నేహితు లతో అతని రచనల గూర్చి గొప్పగా చెబుతూ ఆనందించే వాడు. పత్రికకు రాసి అతని అడ్రస్ తెలుసుకొని ఓసారి కలిసి మాట్లాడాలని నిర్ణయించుకున్నాడు కిరణ్. కాని ఎన్ని రోజులైనా వీలుపడలేదు.

పది రోజుల క్రితం.... పత్రికలో అరుణశ్రీగారి మరో కథ ప్రింటయింది. తీసుకున్న విషయంతోపాటు పాత్రోచిత భాష, శైలి, శిల్పం యెల్లిగారానికి బంగారంలా అతుక్కుపోయాయి. పాఠకుల హృదయాలను కదిలించే విధంగా మలిచాడా కథను. ఆ కథ చదివిన కిరణ్ కళ్ళ ముందు మురికివాడ జీవితాలు సాక్షాత్కరిస్తున్నాయి. వాళ్ళ దీనమైన బ్రతుకులు సినిమా రీళ్ళలా అగుపడు తున్నాయి. “సుపర్బ్, ఎక్సలెంట్. నీకివే నా జోహార్లు అరుణశ్రీగారూ!” తనలోతానే అనుకున్నాడు కిరణ్. త్వరలోనే తన అభిమాన ఆరాధ్య రచయితను కలుసుకొనాలనుకున్నాడు. అదృష్టం కలిసొచ్చి కరీం నగర్‌కు ఆఫీసు పనిపై ఎల్లుండి పోవాలని ఆఫీసర్‌గారు చెప్పారు. ఎగిరి గంతేసాడు కిరణ్. కరీంనగర్ ఎన్నో సార్లు పోయినా అతన్ని కలుసుకోవడం వీలుపడలేదు. ఈసారి తప్పకుండా కలుసుకోవడానికే దృఢ నిర్ణయం చేసుకున్నాడు. అవసరమైతే ఓరోజు అక్కడన్నే వుండా లనుకున్నాడు. ఎల్లుండి కొరకెదురు చూస్తున్నాడు. “అతనితో ఎలా మాట్లాడాలి, ఏం మాట్లాడాలి?” అని మాటలు రిహార్సల్ చేసుకుంటున్నాడు. కరీంనగర్ పోయేరోజు రాగానే అతనికి ఆనందంగా వుంది, ఉద్వి గ్నంగానూ వుంది. తాను ఆరాధించే రచయిత ఎదుట పడితే తన నోరు పెకులుతుందో లేదో, ఏదైనా తప్పులు మాట్లాడుతానేమోనని భయపడ్డాడు. తాను తప్పులు మాట్లాడినా జీవితాలను కాచి వడబోసి తన రచనల్లో ప్రతి బింబిస్తున్న అరుణశ్రీగారు తననర్థం చేసుకోగలడని తనకు తానే సమాధానం చెప్పుకున్నాడు.

ఉదయం కరీంనగర్ వెళ్ళి సాయంత్రం వరకు పను లన్నీ ముగించుకున్నాడు.... సాయంత్రం ఐదు గంటల ప్రాంతంలో డైరీ తీసి అడ్రస్ చూసాడు. 13-7-85 విజయరఘునందన్‌నగర్ జ్ఞాపకం పెట్టుకున్నాడు. విజయ రఘునందన్‌నగర్‌లో ఇంటి నంబరుకై వెదకసాగాడు. ఓ ఇంటిముందాగి 13-7-85 ఇంటి నంబరు చూసాడు. గేటుపై స్పష్టంగా రాయబడివుంది. గేటును పట్టుకొని నిల్చున్నాడు. ఇంట్లో ఎవరిదో మగకంఠం వినబడుతోంది. ఓ స్త్రీ సన్నగా ఏడుస్తోంది. “ఆరేండ్లయింది పెండ్లయి.... పెండ్లిలో ఇస్తానన్న పదివేలింకెప్పుడిచ్చేది? .... ఇంత గతిలేని సంబంధమని తెలిసుంటే నిన్ను చేసుకునేవాన్ని కాను.... ఛూ! నీయమ్మ....” ఇక మాటలను వినలేక పోయాడు కిరణ్. ఇది తాను వెదుకుతూ వచ్చిన ఇల్లు కాదనుకున్నాడు ఇంటి నంబరు పొరపాటుగా చూసా నేమోనని భుజానికి వేలాడుతున్న సంచిలో నుండి డైరీ తీసి నంబరు చూసాడు.... అదే నంబరు.... గేటు తీసుకొని

లోపలికెళ్ళి గోడకు వేలాడదీసి వున్న బోర్డు చూసాడు. "అరుణశ్రీ - రచయిత" పెద్దక్షరాలతో కొట్టొచ్చినట్టు గుపడుతోంది. ఈ ఇల్లు అరుణశ్రీగారిదే.... అయితే ఆ మాటలు....అతనివి కావు, కాకూడదు. దేశంలోని ఎన్నో సాంఘిక దురాచారాలను ఖండిస్తూ రచనలు చేస్తున్న తన అభిమాన రచయిత అలా మాట్లాడుతాడా? అవి అతని మాటలు కావు. ఇంట్లో మరెవరైనా ఉండి యుండవచ్చు.... అనుకుంటూ బెల్ నొక్కాడు. లుంగీ బనీను ధరించివున్న ఓ మూడు పదులు దగ్గరున్న యువకుడు తలుపు తీసి ఎదురుగా నిల్చున్నాడు.

"నమస్కారమండీ! అరుణశ్రీగారిల్లి దేనా" అన్నాడు కిరణ్.

"ఇదే రండి రండి" అని ప్రక్కకు జరిగి కుర్చీ చూపించాడు యువకుడు. కిరణ్ కుర్చీలో కూర్చున్నాడు. ఆ యువకుడతని కెదురుగా సోఫాలో కూర్చున్నాడు.... ఆ గది నోసారి చూసి కిరణ్.

"అరుణశ్రీగారంటే...." అంటున్నాడు.

"నేనేనండి. మీరెక్కన్నుంచొచ్చారు?" అన్నాడా యువకుడు.

"నా పేరు కిరణ్.... ఆఫీసు పనిమీద గోదావరిఖని నుంచొచ్చానండి.... ఎన్నో రోజుల్నుంచి మిమ్మల్ని కలుసుకోవాలనుకుంటున్నాను కాని వీలువళ్ళేదు."

"మీరేం చేస్తుంటారు గోదావరి ఖనిలో...."

"సింగరేణి కాలరీస్‌లో రైటర్‌గా పనిచేస్తున్నాను" అన్నాడు కిరణ్. తాను విన్న మాటలు అరుణశ్రీగారివో కావో తెలుసుకోవాలన్న ఆదుర్దా కిరణ్ కుంది.... తానడుగ దలచుకున్న ప్రశ్నలు మరచి....

"ఇల్లు పెద్దగానే వున్నట్టుంది.... ఇంట్లో ఎంతమందుంటున్నారండి...." అన్నాడు.

"నేను, మా ఆవిడ, మా చెల్లెలు" చెప్పాడు అ

అతని మాటలతో సగం చచ్చాడు కిరణ్. అంటే ఆ మాటలన్నీ తన ఆరాధ్య రచయిత నోటి నుండి వచ్చినవేనా?.... ఏ వరకట్న పిశాచాన్ని చీల్చిచెండాడుతూ అద్భుతమైన కథలు రాసాడో ఆ వరకట్నం కొరకు భార్యను బండబూతులు తిట్టడమా....? కిరణ్ ముఖంలో రంగులు మారాయి.

"ఏంటండి.... మాట్లాడుతూనే ఆలోచిస్తున్నారు...." మళ్ళీ అన్నాడు అరుణశ్రీ.

"ఏం లేదు ఏం లేదు" అని దాటవేసాడు కిరణ్.

"ఇప్పుడే వస్తాను" అని లోపలికెళ్ళాడు అ

తానడుగాలనుకున్న ప్రశ్నలు కాక ఏం అడగాలో నిర్ణయించుకున్నాడు కిరణ్. అరుణశ్రీ గూర్చి కొంత తెలిసిన తర్వాత అతన్నేమడగడానికూడా భయం కలుగడంలేదు కిరణ్‌కు. భార్యను పరిచయం చేస్తాడు కాబోలు ననుకొని ఎదురు చూస్తున్నాడు. షర్టు తొడుక్కొని బయటకొస్తూ లోపలి గది పరదాను సందు లేకుండా సర్దాడు అరుణశ్రీ.... పరదా దిక్కు చూస్తూ.

"ఇప్పుడు చెప్పండి.... నా కథలేం చదివారు" అన్నాడు.

"వరకట్నాల గూర్చి, స్త్రీల గూర్చి, పేదరికం గూర్చి మీరు రాసిన కథలన్నీ చదివాను.... మీ కృషి ప్రశంసనీయం" అన్నాడు కిరణ్.

"థాంక్స్....అందులో మీకే కథ బాగా నచ్చింది?"

"మీ కథల్లో ఒకటి నచ్చింది మరొకటి నచ్చలేదని ఎలా చెప్పగలను?.... దేనికదే ఓ కళాఖండం."

చిరునవ్వు నవ్వి "వన్ మినిట్" అంటూ లోపలికెళ్ళాడు అరుణశ్రీ. రెండు కప్పులతో టీ తీసుకొచ్చాడు ....అతని భార్యను పరిచయం చేస్తాడనుకున్న కిరణ్‌కు ఆశాభంగమే అయింది.

స్త్రీ స్వేచ్ఛ గూర్చి, స్త్రీ సమస్యల గూర్చి కలకాలం నిలిచే కథలల్లిన అరుణశ్రీగారు తన భార్యను

ఇతరులకు పరిచయం చేయడానికూడా సిద్ధంగా లేరా...? కిరణ్‌లో చిన్న సందేహం.

" మీరింత మంచి కథలెలా రాయగల్గుతున్నారు ? " అన్నాడు టీ చప్పరిస్తూ.

" సమాజాన్ని, జీవితాన్ని నిశితంగా పరిశీలించి చూడటం నేర్చుకోవాలి రచయిత.... నిరంతరం గ్రంథ పఠనం చేయాలి ... ఏది చూసినా విమర్శనా దృష్టితో చూడాలి.... రచనను కొనసాగించాలి.... " చెప్పాడు అరుణశ్రీ.

" సాహిత్యం వల్ల ఏదైనా సామాజిక ప్రయోజనాన్నాశిస్తున్నారా మీరు ? .... "

" పుస్తకాలు చదివెవరు మారుతారండి ....అయిడియాలొస్తున్నాయి.... రాసే నేర్పుంది.... రాస్తున్నాను.... పేరుకు పేరొస్తుంది.... డబ్బూ వస్తుంది.... " టీ కప్పు టీపాయిపై పెడుతూ తేలికగా అన్నాడు అరుణశ్రీ.

అతని మాటల వల్ల కిరణ్ హృదయం గాయపడింది.

" తాను అత్యధికంగా అభిమానించిన రచయిత నోటి నుండి రావలసిన మాటలేనా .... ఇవి .... ? " తనలో తానే అనుకున్నాడు.

" రచయిత సమాజానికి తన రచనల ద్వారా ఏదైతే చెబుతున్నాడో అందులో కొంతయినా ఆచరణలో పెట్టాలని ఓ వాదనుంది. ఈ విషయంలో మీ అభిప్రాయం " అడిగాడు కిరణ్.

" చెప్పాను కదండీ ! అవి కథలు .... కథల్లో ఎన్నో చెప్పొచ్చు. వాటినే ఆచరించాలంటే ఎలా ? నాకు మాత్రం ఆ పట్టింపులు లేవు - వితంతు వివాహాల గూర్చి కథల్లో సమర్థించాను .... వితంతు వివాహం చేస్తే మా కులంలో బంధువులు వెలి వేస్తారు. అందువల్ల నా చెల్లెలు వితంతువైనా పునర్వివాహం చేయలేక పోతున్నాను " చాలా మామూలుగా అన్నాడు అరుణశ్రీ.

తాను చదివిన అరుణశ్రీకి, చూస్తున్న అరుణశ్రీకి హస్తిమశకాంతరాన్ని చూస్తున్నాడు కిరణ్. అతడి మాటలు దిగ్భ్రాంతి కలిగిస్తున్నాయి. తాను ఊహించుకున్న ఉన్నతుడు రచయితలో కనబడటం లేదు. రచనలకు వ్యక్తిత్వానికి ఇంత తేడా వుంటుందా ? నమ్మలేక పోతున్నాడు .... ఎన్నో అడగాలనుకున్నాడు .... కాని ఏమీ అడగాలనిపించడంలేదు కిరణ్‌కు.

" నేనొస్తానండి " అని లేవబోయాడు.

" ఆగండి, నేను క్లబ్బుకెళ్తాను, బస్సు స్టాండకే వుంటుంది, మాట్లాడుకుంటూ పోదాం " అని ఖాళీ కప్పులు పట్టుకొని లోపలి కెళ్ళాడు. కొంచెం సేపట్లో డ్రెస్ చేసుకొని బయట కొచ్చి....

" పదండి " అన్నాడు అరుణశ్రీ.

" స్కూటర్లో పెట్రోలు లేదు .... నడిచే పోదాం " అని గేటు తీసాడు .... అరుణశ్రీ ప్రక్కగా నడుస్తున్నాడు కిరణ్.

" కుంటోన్ని బాంచెను నిన్నట్నుంచి బువ్వ లేదు. ఒక్క పది పైసలెయ్యండ్రి దొర " దీనంగా అరుస్తూ ఎదురొచ్చాడో బిచ్చగాడు.

లోతుకు పోయిన కళ్ళతో, ఈస్పుకు పోయిన దవడలతో, పీచులా వున్న తెల్ల వెంట్రుకలతో ఎముకల గూడులా వున్న ఆ కుంటి బిచ్చగాన్ని చూసి ముఖం చిట్లించాడు అరుణశ్రీ.

" పో వెధవా పో " అని గదమాయించి " వీళ్ళో న్యూసెన్సండి " అన్నాడు కిరణ్‌తో.

ఆ బిచ్చగాన్ని పరీశీలనగా చూసిన కిరణ్ జ్ఞాపకాల దొంతరలో ఏదో తళుక్కున మెరిసింది....అతన్నెక్కడో చూసినట్టు జ్ఞాపకం.... బాగా జ్ఞాపకం చేసుకున్నాడు.... ఎక్కడ? ఎక్కడ? మననం చేసుకున్నాడు.... తాను చూశ్చేదు.... కాని చదివాడు ఎక్కడ?.... పత్రికలో.... ఎవరు రాసింది?.... అరుణశ్రీగారే.... ఆ కథకు బహుమతి కూడా వచ్చింది.... అవును ఆ కథలోని పాత్ర ఇతనిదే.... అదేమాటడిగాడు అరుణశ్రీని.

" అవును.... ఆ కథలోని పాత్ర వీండే.... సరదాగా ఓరోజు క్లబ్బు కెళ్తుంటే తోవలో పీడగుపడ్డాడు. వీన్ని పాత్రగా తీసుకొని కథ రాస్తే .... ఓ ఆలోచన తళుక్కున మెరిసింది. అప్పుడే పత్రికలో కథల పోటీ వుంది. వీని మాటలను, ఆకారాన్ని, నడకను, అలవాట్లను నిశితంగా పరిశీలించాను. జీవితం గూర్చి తెలుసుకున్నాను. కథ రాసేసాను, ప్రైజొచ్చింది " అసలు విషయం చెప్పాడు అరుణశ్రీ.

" అలాగా " అని రాని నవ్వు నవ్వాడు కిరణ్.

" ఇలాంటి మనుషులు రచయితలకు కథలు రాసుకోడానికి మాత్రమే అవసరమా....? వీళ్ళపై ఆ రాసే వాళ్ళకు కనీస సానుభూతైనా ఉండక్కర్లేదా? ఎదురొచ్చి నప్పుడు ఓ పావల పైసలైనా ఇవ్వక్కర్లేదా? వాళ్ళ కథలు రాసి బహుమతులు పొందొచ్చు.... కాని ఎదురైతే కసురుకోవాలి " ఒక్క క్షణంలో కిరణ్‌లో ఎన్నో ఆలోచనలు.

అరుణశ్రీతో నడుస్తూ....

" మీకో ప్లాటిచ్చినందుకైనా ఓ పావలా పడెయ్యొచ్చు గదండీ!.... నేనిలా అంటున్నానని ఏమనుకోవద్దు " అన్నాడు.

" ఇవ్వొద్దని కాదుగాని ఒకసారిస్తే పదేపదే అడుగుతారండి. ఇలాంటి వాళ్ళను మనమేముద్ధరిస్తామండి బాబు " ఆశ్చర్యార్థకం ప్రకటించాడు అరుణశ్రీ.

" ఉద్ధరించలేం .... కాని ఉద్ధరిస్తున్నట్టు కథలు రాయొచ్చు. కనీస సానుభూతైనా చూపలేం.... కాని

## పక్షవాతం

ఈ శతాబ్ది నాగరకత అంతా
సైకిళ్ళలో దూరి, ఇనుప పట్టాల మీద జారి,
గిరగిరగిర తిరుగుతూ, పిచ్చిగా పాడుతూ,
అల్యూమినియమ్ రెక్కల్లో తేలియాడుతూ
పెట్రోలు త్రాగి, డీసిల్‌తో తూగి
పొల్యూషన్ విషమేఘాలు సృష్టిస్తూ
అణ్వస్త్రాల జవనాశ్వాల మీద స్వారీ
చేస్తూంటే
నక్షత్ర యుద్ధాల పక్షవాతం వచ్చి
చాపచుట్టుగా పడిపోయింది... !
పంచభూతాల 'హోల్‌కాస్' బూడిదలో
ప్రాణం విడిపోయింది...

— డా. తంగిరాల వెంకటసుబ్బారావు

## ఈ విశాల దేశంలో...

దేగలకు
రూకలు మిక్కుటం !
పావురాలకు
నూకలే దుర్లభం !

కె. కిశోరుబాబు
కె. అశోకుబాబు

వాళ్ళంటే ఎంతో ప్రేమున్నట్టు పెద్ద పెద్ద కథలల్ల వచ్చు. అల్లి డబ్బు సంపాదించొచ్చు.... " తనలో తానే అనుకున్నాడు కిరణ్. ఇక ఏం మాట్లాడినా ఆ రచయితపై ఏ మూలనో మిగిలివున్న కాస్త అభిమానం కూడా పోతుందని మౌనంగా అతన్తో మరికొంత దూరం నడిచాడు. అరుణశ్రీ క్లబ్బు దిక్కు, కిరణ్ బస్సుస్టాండు దిక్కు నడిచారు. తన అభిమాన రచయిత అసలు స్వరూపాన్ని గూర్చి ఆలోచిస్తూ బస్సుస్టాండు చేరుకున్నాడు కిరణ్.

బస్సు కొరకెదురు చూస్తూ బెంచీపై కూర్చున్నాడు.

కొంచెం సేపట్లో "హల్లో కిరణ్" అంటూ డిగ్రీలో అతని క్లాస్మేట్ రాంబాబు దగ్గరి కొచ్చాడు. కిరణ్ లేచి అతన్తో కరచాలనం చేసాడు. కుశల పశ్నలడుక్కున్నారు. తాను చేస్తున్న ఉద్యోగం గూర్చి చెప్పాడు కిరణ్.

" నువ్వేం చేస్తున్నావు ? " అడిగాడు రాంబాబును.

" ఇక్కడనే ఆర్. టి. సి. లో క్లర్కుగా పన్చేస్తున్నాను. విజయరఘునందన్‌నగర్‌లో వుంటున్నాను. నువ్వెందుకొచ్చినట్టిక్కడికి ? " అడిగాడు రాంబాబు.
" ఆఫీసుపని గురించి వూరొచ్చాను .. అరుణశ్రీగారితో మాట్లాడొస్తున్నాను.... అతన్నీకు తెలుసనుకుంటాను " అన్నాడు కిరణ్.

" వారి గురించి తెలియందెవరికి ? మళ్ళీ నేనుండేది ఆ వాడుకేనాయె.... కథలు మా రాస్తాడు గొప్ప గొప్పగా. కాని చెప్పేవి శ్రీరంగనీతులు చొచ్చేవి .... అని చెప్పే దోటి చేసేదోటి.... రోజూ అర్ధరాత్రి వరకు క్లబ్బులో తాగుడు పేకాటతో గడిపి ఇంటికొస్తాడు .... భార్య నోరు తెరిస్తే తిట్టడం .... ఇదీ వారు లోకానికిచ్చే సందేశం. ఇలాంటి రచయితల వల్లనే వాళ్ళంటే అభిమానం పోతుంది. నేనూ మొదట అతని అభిమానినే. అతన్ని గూర్చి తెలుసుకున్న తర్వాత ఉన్న కాస్త అభిమానం పోయింది " అన్నాడు రాంబాబు.

మాట్లాడుకుంటూ టీ తాగారిద్దరూ. ఇంతలో గోదావరిఖని బస్సొచ్చి ప్లాటుఫాంపై ఆగింది. స్నేహితునికి వీడ్కోలు చెప్పి బస్సెక్కాడు కిరణ్ .... ఇల్లు చేరుకునేంత వరకు ఆలోచిస్తూనేఉన్నాడు.

" సమాజాన్ని శాసించే రచయితలే....సమాజంలోని కుళ్ళును బయట పెట్టాల్సిన రచయితలే .... లక్షలాది పాఠకులను ప్రభావితం చేసే రచయితలే .... ఇలా ప్రవర్తిస్తే ఎలా ? రచయితలు రాయడం కేవలం డబ్బుకొరకేనా ? నీతులు పరులకు చెప్పడానికేనా ? రచయితలంతా అరుణశ్రీ లాగే వుంటారా ? కాని ఇంత నిర్మొహమాటంగా, నిసిగ్గుగా తాను చెప్పేదానికీ, చేసేదానికీ పొంతన లేదని చెప్పడం అతని మేధావితనానికి తార్కాణమా ? అందరు రచయిత లలా వుండకపోవచ్చు ....కాని అరుణశ్రీ లాంటి వారివల్ల సమాజానికొరిగేదేంటి ? రచయితలారా ! మీకు నమస్తే. రచన దారి రచనదిగా, ఆచరణదారి ఆచరణగా ఎంచకండి .... రెంటి మధ్య దూరాన్ని సాధ్యమైనంతవరకు తగ్గించండి .... రకరకాలుగా ఆలోచిస్తున్నాడు కిరణ్.

" తాను అరుణశ్రీగారిని కలుసుకోకుండా వుంటేనే బాగుండేది. అతనిపై అతని రచనలపై, వున్న ఆరాధనా భావం అలాగే వుండేది "

అనుకుంటూ ఇల్లు చేరుకున్నాడు.

# నేరేడు — యస్. యన్. దుర్గారావు

నేరేడు పెద్ద వృక్ష జాతి లోనిది. మ్రాను మిక్కిలి జిగి కలిగి యుండును. ఆకులు పెళుసు కలిగి కోలగా నుండును. కాయలు ఆకు పచ్చని వర్ణము. పండ్లు నలుపు . లోపల రసము కొంచెము ఎరుపు వర్ణము కలిసి యుండును. పండ్లు లోని గింజలు గట్టిగా నుండును. దీని గుంజు మిక్కిలి మృదువుగా నుండును.

నేరేడులో అనేక జాతులు కలవు. మహాజంబు, అల్ల నేరేడు, కాకి నేరేడు, నేల నేరేడు మొ॥వి. ఆకుల లోను, పండ్ల లోను చిన్న చిన్న భేదములు తప్ప రూపములో నేరేడు జాతి యంతయూ సమానమే. వరుసగా వీటి గుణ గణాలను ముందుగా పరిశీలించుదాం.

మహాజంబు : పెద్ద మ్రాను కలది, సువాసనగల ఆకులు కలది, నల్లని పెద్దవైన పండ్లు కలది. మధుర కషాయ రసము గలది. ఉష్ణ వీర్యము కలది. కంఠ జాడ్యమును పోగొట్టి స్వరమును వృద్ధి చేయును. శ్వాస, కఫకాసలను, అతిసారమును శమింపచేయును.

అల్లనేరేడు : ఇది మిక్కిలి పెద్ద పండు. సాలగ్రామముల వలె కొంచెము కోలగా నుండును. మిక్కిలి మధురముగా నుండును. అరుచి పోగొట్టును, చలువ చేయును, మేహ, పైత్య, కఫ, వికారములను పోగొట్టును, గ్రహణి కట్టును; మలబంధము కల్గించును.

కాకి నేరేడు : నదీ ప్రాంతము లందెక్కువగా పెరుగును. దీని పండ్లు కాకులకు హితవైనవి. వగరు, పులుపు రుచి కలిగి యుండును. గురు గుణమును, తాపము, అతిసారమును పోగొట్టును. వీర్య పుష్టిని, బలమును కలిగించును.

నేల నేరేడు : చిన్న పండ్లు కలది. ఇవి చిలుకలకు తుమ్మెదలకు ప్రియమైనవి. ఇది వగరు, తీపి రుచుల మిశ్రమము. శ్లేష్మ పిత్తాదులను హరించును. హృదయమునకు మంచిది. కంఠ దోషములను హరించును. వీర్యమును, పుష్టిని కలిగించును. వీటి గింజలు వగరు రుచి. గింజలు మధు మేహమును తగ్గించుటలో మిక్కిలి దోహదకారి.

నేరేడు : పులుపు, తీపి, వగరు రుచులు కలది. కఫ, వాతములను హరించును. కంఠమునకు, హృదయమునకు ఒగరు పూత కలిగించును. కంఠస్వరమును పాడు చేయును. రుచి కల్గించును. క్రిములను హరించును. రక్త పిత్తమును హరించును.

వైద్యములో దీని సర్వాంగములు దాదాపు ఉపయుక్తములైనవే.

## వైద్యవాణి

నేరేడు ఆకులను నీడను ఎండించి చూర్ణము చేసి, కవిరి చూర్ణము కూడా చేర్చి పళ్ళు తోముచున్న దంత బాధలు తగ్గును. నేరేడు పండ్ల రసము నందు పంచదార చేర్చి పానకముగా కాచి, దానిని సేవించుచుండిన కంఠ బాధలు, పొడి దగ్గులు, రక్త క్షీణత మొ॥వి తగ్గును. నేరేడు పండ్ల రసముతో లోహ భస్మమును 10 పుటములు వేసిన, అది నేరేడు పండు రంగుగా తయారగును. అది అమితమైన రక్త వృద్ధి చేయును; నేరేడు పండ్ల రసము మూత్ర కోశమును శోధించును; నేరేడు, మామిడి చిగుళ్ళయొక్క కషాయమును తేనె కలిపి సేవించినక పైత్య వాంతులు శమించును: నేరేడు చెక్క రసము, మేక పాలు సమానముగా కలిపి సేవించిన రక్తాతిసారము కట్టును. చంటి పిల్లల గ్రహణులు కట్టును; నేరేడు

( తరువాయి 29వ పేజీలో )

# కవి దర్శనం

ఆచార్య తిరుమల

ధరణీ సురుఁడు ప్రశాంతుఁడు
గురుభక్తుఁడు శుచియు కల్పకుఁడు పూర్వకవీ
శ్వర వాక్ప్రయోగ దక్షుఁడు
కరుణామతి యెవ్వఁడతఁడె కవియన బరగున్ !!

అన్నాడు లక్షణ కారుడు అప్పకవి. ఈ పద్యం ప్రకారం కవి ధరణీసురుడై వుండాలన్న నిబంధన అలా వుంచి చూస్తే మిగిలిన లక్షణాలన్నీ కవికి వుండాల్సినవే అన్నది నిర్వివాదాంశ విషయమే అవుతుంది. ఇంత లక్షణంగా వున్న కవి ఎవరా ? అని అన్వేషణ చేయవలసిన అవసరం కూడా వుంది.

పూర్వకాలం నుండి నేటికి అన్ని రంగాల్లో లాగే సాహిత్య రంగంలో కూడా చాలా మార్పులొచ్చాయి. భాషకు, భావానికి అన్య భాషా సంపర్కం వల్ల విస్తృతి కూడా పెరిగింది. దృక్పథాల్లోనూ, సిద్ధాంతాల్లోనూ, ఆశల్లోనూ, ఆదర్శాల్లోనూ చూపున కాననంత వ్యత్యాసం వుంది.

జగద్ధిత బుద్ధితో కరుణామతి అయిన కవి వేరు, కసితో నిందలు చేసే కవి వేరు. అలాగే, పూర్వ కవీశ్వర వాక్ప్రయోగ దక్షత కూడా. అభ్యాసం లేక ప్రతిభ వుండీ కూడా రాణించలేని వారు అధునిక కవుల్లో చాలా మంది కనిపిస్తారు. ఆ లోపాన్ని విమర్శ ద్వారా పూడ్చుకో చూస్తారే కానీ గుణాత్మకంగా శోధనం చేసుకోరు. కవికి లోక విమర్శే కాదు, ప్రభుత్వ విమర్శే కాదు, ఆత్మ విమర్శ కూడా ఎంతో ముఖ్యం. నింద చేయగలిగి నంతటి నిర్భీతి వుండటం మంచిదే. కానీ అది పాండిత్యం మీద నుండి, లోకజ్ఞత మీద నుండి, దేశీయత మీద నుండి రావాలి. లేకపోతే అది అహంకారమవుతుంది. తప్పులు దిద్దటం కవిత్వం కాదు. కవిత్వం సౌరభమారుతం లా వుండాలన్నాడు తిక్కన. అంటే, సర్వ జనాహ్లాదకరంగా వుండాలన్నది తిక్కన ఆకాంక్ష.

కవిత్వాన్ని ఎవరు పడితే వారు, ఎవరికి పడితే వారి కోసం రాస్తున్నా – సరసులు, సహృదయులు, పరిణత ప్రజ్ఞావంతులు మెచ్చుకున్నదే పదేపదే చెప్పుకునేలా నిలుస్తుంది. అందుకోసం కవితాగతమైన ఆత్మశక్తిని శబ్దోపాసనతో కవి సాధించాలి. కవికి ఏ దారిద్ర్యమైనా వుండవచ్చును గానీ శబ్ద దారిద్ర్యం మాత్రం ఉండకూడదు. పది మాటలు పట్టుమని రానివాడు కవేమిటి ? ఈ శబ్ద దరిద్రులే కవిత్వంలో అస్పష్టతని, అయోమయాన్ని సృష్టించి, సరసుల్ని విరసులుగా చేస్తున్నారు. కవిజాతికి కళంకం తెస్తున్నారు. ఇలాంటి వారి వల్లనే కవిత్వానికి గల గంభీరత పోయి, చుల్కనై, వర్ధమాన కవులు అల్పసంతోషులై పోతున్నారు. ప్రాచీన సాహిత్య పరిచయం లేక, శాస్త్ర విషయాలు తెలియక, పరమార్థం అంతకన్నా తెలియక కీర్తికోసం తాపత్రయ పడటం తప్ప అన్య చింతన, ధ్యేయం లేకుండా పోతున్నారు. అలాగే. ఒక ప్రత్యేకత కోసం అన్వేషణ కూడా లేదు. రస పట్టుల విషయం సరే సరి. కవికి రస స్థితిని గురించి హృదయ స్పందన గురించి ఎవరు చెప్పాలి? అది ప్రాకృతిక అంతర్గత ప్రేరణ. ఆ ప్రేరణే లేకపోతే కవే కాదు ఏ కళాకారుడూ లేడు. రసానుగుణ శబ్ద నిర్మాణం చేయలేనివాడు పరిణత పాఠకలోకాన్ని ఎలా మెప్పించగలడు ? అందుకే "నిరంకుశాః కవయః" అన్న నోటితోనే పూర్వులు "రస సిద్ధాః కవీశ్వరాః" అని కూడా ప్రకటించారు. అంతటి రస సిద్ధిని సాధించిన వారే కవులవుతారు. క్రాంత దర్శనంతో మహా కవులవుతారు. మహా కవి వాక్కు దేశ కాలాలకు అతీతంగా భాసిస్తుంది. అందులో విశ్వమంతా ఇమిడిపోయి వుంటుంది. అందుకే మహా కవులకు మరణం లేదంటారు. అంటే, ఆ వాక్కులు ఎప్పుడూ

అంత ప్రామాణికంగా, సార్వ జనీనంగా, సార్వ కాలిక సత్యాల్లా వుంటాయని అర్థం. అంతటి స్థితిని అల్పులు, సంకుచిత స్వభావులు ఎప్పుడూ సాధించలేరు. అయితే, పాక్షిక సత్యం వేరు, పరమార్థ తత్వం వేరు. స్థితిని బట్టి గతిని నిర్ణయించాలి.

అందుకే, కవిత్వం వినోద ప్రక్రియలా కాకుండా జీవిత ధ్యేయం గా వుండాలి. పూర్వీకుల పరిధికన్నా ఆధునికుల ఆలోచనా పరిధి ఎప్పుడూ విస్తృత మవుతూనే ఉంటుంది. కారణం, జీవితం, జగత్తు కూడా పరిణామశీల సంబంధులు కనుక. కాబట్టి నిత్య సత్యాలతో బాటు ఆధునికులు, వైజ్ఞానిక విషయాలు, చరిత్ర, సంప్రదాయాలు, తత్త్వ ప్రతిపాదనలు, ఛందో రీతులు, వర్తమాన స్థితిగతులు - ఒకటేమిటి ? అన్నీ తెలుసుకోవాలి. జ్ఞాన పిపాస గలవాడే లోకాన్ని శాసించగలడు. ఆదర్శం ఎప్పుడూ ఉన్నతంగానే ఉండాలి కదా ! "భావో హి భవస్య కారణమ్ " !

★

## నే రే డు

( 27వ పేజీ తరువాయి )

చెక్క కషాయంలో పంచదార చేర్చి ఉదయ సాయంత్రములు త్రాగుచున్న తెల్ల కుసుమములు కట్టును; నేరేడు చెక్క, రొద్దుగ చెక్క, కాయ ఫలము వీనిపట్ల చూర్ణము వ్రణములపై చల్లిన అవి తప్పక మానును; వేయించిన నేరేడు గింజల చూర్ణము కషాయము పెట్టి, దానిలో పాలు, తాటి కలకండ చేర్చి కాఫీ పానీయము వలె త్రాగుచున్న అతి మూత్ర మధుమేహములు తప్పక తగ్గును; భూమి త్రవ్వి, ఒక నేరేడు వేరు ఖండించి, ఆ వేరులో ఒక కుండను జొనిపి దానిపైన ఆకులు, చాప మొ॥వి కప్పవలెను ఆ కుండలోకి వేరు నుండి నీరూరును. అదియే నేరేడు కల్లు. దీనిని జాగ్రత్త పెట్టి ఆయా రోగాను యోగ్యములగు మందులను ఆ నీటితో ఇచ్చిన సాధారణముగా గ్రహణి, అతిసారము, శ్వేత ప్రదరము, శుక్ల నష్టము మొదలగు వ్యాధులన్నియు నమసి పోవును.

★

# జాతీయ సమైక్యత

పూవులలో తావి అట్లు
వెన్నెలలో తెల్లదన మట్లు
మల్లెలలోని పరిమళ మట్లు
మందారాలలో మకరంద మట్లు
మకరందంలో మాధుర్య మట్లు

తలలోని నాలుకల్లా
కంటికి రెప్పల్లా
ఒకరి నొకరు
కలిసి మెలసి, కూడియాడి

భారతీయులంతా భాయీ భాయీ అంటూ
భుజం భుజం రాసుకొంటూ

మంచిని పెంచి
మమతకు మారాకు దొడిగి
మానవతను మన్నిస్తే
భారత భువి
అవుతుంది దివి !

ఆ నాడే భారతదేశ సమైక్యం
మన అందరిలోనూ భావైక్యం !
అదే మన నిజమైన భారతం
అందుకు యత్నిద్దాం అనవరతం ! !

డా॥ ఎస్. గంగప్ప

# శ్రీరామకథ - కాళిదాసు

భగవాన్ శ్రీ వాల్మీకి మహర్షి రామాయణం అమృత కలశమే. ఆయన వాక్సుధ అనన్య సాధ్యం. ఆ కావ్యానికి గల విశిష్ట స్థానం విశ్వసాహితీ వేత్తల నుండి మామూలు సాహిత్య పరిచయం గల వారల వరకు ఎల్ల రెరిగిన విషయమే. నిరక్షరాస్యులైన కొందరు భారతీయులకు కూడా ఆ కావ్యమందలి ఆదర్శ జీవిత విధానము ఎరిగిన వారే !

ఆ మహర్షి వాక్కు కేవలం కోకిల కూజితమే కాదు— " కూజంతం రామరామేతి మధురం మధురాక్షరం .... " ఆ ధ్వని సింహ గర్జనం కూడా—" వాల్మీకేర్ముని సింహస్య కవితావన చారిణః, శృణ్వన్ రామకథా నాదం కో నయాతి పరాంగతిమ్ " —

మో నా

ఆ రామాయణ కథా కథన గాంభీర్యానికి, కవితా సౌందర్యానికి, సందేశానికి, ఆదర్శ జీవన విధానానికి ప్రభావితులై ఎందరో ప్రసిద్ధ కవులు రామాయణాన్ని వ్రాశారు. వ్రాస్తున్నారు - కావ్యాలుగా, నాటకాలుగా, గేయాలుగా, ద్విపదలుగా, పాటలుగా, వచనాలుగా ఇంకా అనేక ప్రక్రియలలో రామకథ వెలువడుతూనే యున్నది. ఆదికవి వాక్ప్రభావ మట్టిది.

వాల్మీకి హృదయమును అర్థం చేసుకొని రామ కథను విరచించిన కొద్దిమంది కవులలో కాళిదాసు ఒకడు. వాల్మీకి రామాయణ కథ తరువాత స్థానము రామకథలలో కాళిదాసుని రామ కథదే యని భావించెడి విమర్శకులును లేక పోలేదు.

కవి కుల గురువు కాళిదాసు వాల్మీకి శిష్యుడనినను అత్యుక్తి కాదు. " ఉపమా కాళిదాసస్య " అనే ప్రసిద్ధికి— వాల్మీకి రామాయణంలోని ఉపమలే కాళిదాస కవితా సౌందర్యమునకు ప్రేరకములైనవి. అట్లని కాళిదాసు వాల్మీకిని గ్రుడ్డిగా అనుకరించెనని భావించుట సమంజసము కాదు. ఆ మహనీయుని ప్రతిభయే నవనవోన్మేష శాలినియై ఆయన కవితను సుసంపన్నము చేసినది.

రఘువంశ మహా కావ్యంలో కాళిదాసు రామ కథను రమణీయ వాక్కులతో విరచించినాడు. 19 సర్గలు గల ఆ కావ్యంలో 10వ. సర్గ మొదలు, 15వ. సర్గ పూర్తిగా గల 6 సర్గలు రామాయణమే. " పృథివీం శాసతీస్తస్య పాకశాసన తేజసః " అను శ్లోకము మొదలు (దశరధుని రాజ్య పాలన) " నిర్వర్త్యైవం దశముఖ శిరచ్ఛేద కార్యం సురాణామ్ " అను పదిహేనవ సర్గ ఆఖరు శ్లోకము వరకు రామాయణమే !

సూర్యవంశ రాజుల 29 మంది వృత్తాంతములు గల ఆ కావ్యములో ఒక్క శ్రీరామ చరిత్రకే 6 సర్గలు కేటాయించినాడు - 24,000 శ్లోకముల వరకు విరచింపబడిన వాల్మీకి రామాయణమును 549 శ్లోకములలో మధురాతి మధురముగా వ్యక్త మొనర్చినాడు.

ఇటు బాలకాండ కథను, అటు ఉత్తరకాండ కథను కూడా వదలలేదు. బాల, ఉత్తరకాండలు వాల్మీకి కృతము కాదను వారలున్నారు. కాదనుటకు వారు చూపించు కారణములలో - ఉపాఖ్యానములు, Interpolations పై రెండు కాండములలోనే ఉండుట - తక్కిన ఐదు కాండములలో లేకుండుట అను అంశమొకటి. కాళిదాసు మాత్రము ఆ రెండు కాండలను వాల్మీకి కృతముగానే భావించి ఆ కాండల కథను కూడా శ్లోక బద్ధము చేసినాడు.

రామ కథా రచనలో కాళిదాసు ఉదాత్త కవితా సౌందర్యమును చూపించినాడు.

దశరథుడు తన జ్యేష్ఠ పుత్రునకు "రామ" అని నామకరణము చేయుట జగత్తునకు ప్రథమ మంగళ మనినాడు—

"నామధేయం గురుశ్చక్రే జగతః ప్రథమ మంగళమ్"

శ్రీ మహా విష్ణు వక్షస్థలమందలి కౌస్తుభమణి లక్ష్మీ విభ్రమదర్పణమట – కౌస్తుభము "అపాలసారం" కూడా (The essence of water)

"ప్రభాను లిప్త శ్రీవత్సం, లక్ష్మీ విభ్రమ దర్పణమ్
కౌస్తుభాఖ్యమపాం సారం" ....

భరతుడు కైకేయి సుతుడుగా జన్మించుట – సంపదలకు వినయం ఎంత లోభాహేతువగునో అట్లు ఒప్పెను.

"జనయిత్రీ మలం చక్రేయం ప్రశ్రయ ఇవ శ్రియమ్"

వాల్మీకములో కౌశికుడు రామలక్ష్మణులను యాగసంరక్షణార్థము పంపుమని దశరథుని కోరినపుడు దశరథుడు భయపడినట్లు వర్ణితమైనది.

"అహంవేద్మి మహాత్మానాం రామం సత్య పరాక్రమమ్
వసిష్ఠోపి మహాతేజో యే చాన్యే తపసిస్థితాః"—

అని కౌశికుడు రాముని శక్తి దశరథునికి తెలియదని బాల కాండలో చెప్పినాడు.

ఈ సందర్భంలో రఘువంశంలో —

కృచ్ఛ్ర లబ్ధ మపి లబ్ధ వర్ణ భాక్తం దిదేశమునయే
సలక్ష్మణమ్
అప్యసుప్రణయినాం రఘోః కులే న వ్యహన్యత
కదాచిదర్థితా

అర్థుల విషయంలో రఘువంశీయులు ప్రాణములైనను ఇచ్చెదరు. కానీ వారిని వ్యర్థులను చేయరు. దశరథుని గొప్పతనము వ్యక్తమైనది. మన్మథాశ్రమమును చేరిన శ్రీరాముని "విగ్రహేణ మదనస్య సోஉభవత్ ప్రతినిధీర్న కర్మణా" – మదన సుందరునిగా వర్ణించి "ప్రతినిధీర్న కర్మణా" అనడంలో ఉదాత్తతను స్ఫురింప చేసినాడు.

రామ బాణ తాడితయై ప్రాణము విడువబోవు తాటకను అభిసారికగా చిత్రించినాడు! శృంగార రస నిధి కదా ఆయన కవిత!

"రామ మన్మథ శరేణ తాడితా దుస్సహేన హృదయే
నిశాచరీ
గంధ వద్రుధిర చంద నోక్షితా జీవితేశ వసతిం
జగామసా"

రామ మన్మథుని శరము హృదయమున నాటుకొనగా కుంకుమరాగ చందనముతో (రక్తము) పూయబడినట్లయి ప్రాణేశ్వరుని (యముని) సంకేత ప్రదేశమునకు వెళ్లినది

అహల్య పొరపాటున వాల్మీకమునకన్నను సంక్షిప్తముగా అర్థ శ్లోకములో ముగించినాడు!

"ఏషు దీర్ఘ తపసః పరిగ్రహో వాసవ క్షణ కళత్రతాం యయౌ" క్షణకాలమే ఇంద్రుని కళత్రమైనదనుటలో క్షణికోద్రేకము స్ఫురిస్తున్నది. Momentary impulse మనకు పూజనీయులైనవారు Momentary impulse తో ఏదో పొరబడిన దానిని విస్తృతముగ వర్ణించుట సమంజసము కాదని కాబోలు కాళిదాసు భావన.

భర్తృ శాపముచే అహల్య శిలయైనది – రామ పాద ధూళి సోకగా మరల పూర్వ రూపమును పొందినది – అను విషయము కాళిదాసుని కాలమునాటికే ప్రచారములో, సాహిత్యములో దృఢమైనట్లున్నది.

వాల్మీకి రామాయణములో గౌతముడు అహల్యను శిలగా మారునట్లు శపించలేదు. పైపెచ్చు రామ పాద రజముచే పూర్వాకృతి పొందునట్లు అనుగ్రహ విషయమున లేదు —

"తథా శప్త్వాచవై శక్రం భార్యామపిచ శప్తవాన్, ఇహ వర్ష సహస్రాణి బహూని నివసిష్యసి ॥ వాత భక్షా నిరాహారా తప్యన్తీ భస్మశాయినీ, అదృశ్యా సర్వభూతానా మాశ్రమేஉస్మిన్నివసిష్యసి ॥ యదా త్వేతద్వనం ఘోరం రామో దశరథాత్మజః, ఆగమిష్యతి దుర్ధర్షస్తదా పూతా భవిష్యసి ॥ .... మత్సకాశం ముదాయుక్తా స్వం వపుర్ధారయిష్యసి ॥ (బాలకాండ)

నిరాహారిగా, వాయుభక్షణ చేస్తూ, భస్మశాయినియై, సర్వ భూతములకు కనిపించక యుండినట్లు శపించబడిన అహల్య శ్రీరాముడు ఆ వనమును ప్రవేశించినంతనే

## సభా మర్యాద

ఒక ప్రసిద్ధ వైణికుడిది చాలా మెత్తటి మనస్సు. ఒకసారి ఆయన కచ్చేరీ చెయ్యటానికి వెళ్ళాడు. ముందు సీటులో ఒక వున్నత ఉద్యోగి భార్య గాఢ నిద్రపోతూ కనుపించింది. కచ్చేరీ అయిపోగానే జనం ఒక పెట్టున హర్షధ్వానాలు చేశారు. వున్నత ఉద్యోగి భార్య వులిక్కిపడి లేచింది.

వైణికుడు ఆమెతో జనంవైపు చూపుతూ నమ్రతగా అన్నాడు "అది నా తప్పు కాదండీ వాళ్ళ తప్పు—నేను చిన్నగానే వాయించాను."

- చింతపల్లి అన్నపూర్ణ

పూర్వ రూప సౌందర్యముల భాసించినట్లు చెప్పబడినది. గౌతముని శాపానుగ్రహములో కూడా ఆ భావమునే తెల్పు చున్నవి.

కాళిదాసు : " ప్రత్య పద్యత చిరాయ యత్పునశ్చారు
గౌతమ వధూః శిలామయీ
స్వవపుః సకిల కిల్బిషచ్ఛిదాం రామ పాద
రజసామనుగ్రహః "

రామపాద ధూళిచే ఆమె శాపవిముక్త యైనదని చెప్పనాడు.

రామ పరశురామ సమాగమ ఘట్టంలో రాముని వినయ సుందరుడుగా చూపినాడు. పరశురాముని నుండి వైష్ణవ ధనుస్సును గ్రహించిన ఆ యశ తపోలోకములను దహించిన రాముడు —

" రాఘవోఽపిచరణౌ తపో నిధే క్షమ్యతామితి వదన్య మస్పృశత్ " పరశురాముని చరణములకు క్షమించ వలసినదిగా మ్రొక్కెను.

రావణ వధానంతరము సీతను పరిగ్రహించు సందర్భంలో రాముడు సీతను పరుషంగా మాట్లాడినట్లున్నది. కాళిదాసు ఆ వివరాలు వర్ణించక —

" రఘుపతి రపి జాతవేదో విశుద్ధాం ప్రగృహ్య ప్రియాం " అని ముక్తసరిగా అగ్ని పూతయైన సీతను రామచంద్రుడు స్వీకరించినట్లు చెప్పినాడు. ఈ కథలో కీలకమైన మంథర పాత్రను సృష్టించలేదు. గుహుని పాత్రయు లేదు.

13వ సర్గ ఇంచుమించు ప్రకృతి వర్ణన, కవితా సౌందర్యమునకు పరాకాష్ఠ. ఈ సర్గలో పుష్పకమున ప్రయాణము చేయుచు రాముడు తన ప్రక్కన ఉన్న సీతకు మార్గ మధ్య దృశ్యములు వర్ణించును. మచ్చుకు ఒక శ్లోకము —

" సైషాస్థలీ యత్రవిచన్వతా త్వాం భ్రష్టం మయా
నూపురమేకముర్వ్యాం
అదృశ్యత త్వచ్చరణారవింద విశ్లేష దుఃఖాదివ బద్ధ
మౌనమ్ "

సీతా వియోగకాలము రాముడు సీతను వెదకుచూ అడవిలో ఒక చోట పడియున్న ఆమె కాలి అందెను చూచిన స్థితి

సీతా ! నీ చరణము నుండి విడివడి దుఃఖ భారమున మౌనంగా పడియున్న అందెను ఇచ్చట చూచితిని - విమానము నుండి ఆ ప్రదేశమును చూపుచూ వివరించినాడు. హేతూత్ప్రేక్షాలంకారమునకు రమ్యమైన ఉదాహరణ. కాలికి ఉన్నపుడే అందె మ్రోగుతుంది. విడిగా ఎప్పుడూ నిశ్శబ్దమే ! పై శ్లోకంలో ' భ్రష్ట ' శబ్ద ప్రయోగంలో ఎంతో ఔచిత్యమునునది. ఇటువంటి రమణీయ కవితలు. ఇంకా ఎన్నెన్నో ఉన్నవి.

అసలు రఘువంశ మహా కావ్యమే కవిత వెన్నెలగా ప్రవహించిన అనురవాహిని. శబ్దార్థములను అంత లలిత లలితముగా ప్రయోగించిన కవులు అరుదు. మూల కథకు భంగం కలుగ నీయక తన అద్భుత ప్రజ్ఞచే రామ కథను సౌందర్య సరసిగా దిద్ది తీర్చినాడు కాళిదాసు. అంతటి ఉదాత్త కవితను సృష్టించిన ఆయన ధన్యుడు. దానిని చదివి ఆనందించు మనము కూడా ధన్యులమే !

# ★ వ్యాసం, కథ, కవిత ★

చదవటం చేతయిన వారంతా పాఠకులు కాదు ప్రత్యేకార్థంలో, వ్రాయటం చేతయిన వారంతా రచయితలు కారు.

ఉభయకుశలోపరి ఉత్తరాలను, అడ్వర్‌టైజ్‌మెంట్లను మాత్రమే చదవగలిగినవారు సాహితీ రచనలను, ఇంకా ఇతర విషయ సంబంధమైన రచనలను చదవజాలరు. అందుకే వారు పాఠకులు కారు.

ఉభయకుశలోపరి ఉత్తరాలను, కావలసిన సామగ్రి పట్టికలను మాత్రమే వ్రాయ గలిగిన వారు సాహితీ రచనలను, మరే ఇతర విషయాలకు చెందిన రచనలను వ్రాయలేరు. అందుకే వారు రచయితలు కారు.

వ్రాయటం ఒక కళ అయినట్లే చదవటం కూడా ఒక కళయే.

కొందరు చదువుతారే కాని చదివేదాన్ని అర్థం చేసుకోజాలరు; మరికొందరు అర్థం చేసుకొంటారే కాని భావార్థాన్ని గ్రహించ లేరు; ఇంకొందరు పాఠకులు రచయితలోని మౌలిక భావంతో సంబంధం లేకుండా తమ స్వీయ భావాలనే కల్పించుకొంటారు.

రచయితలు కొందరు రచిస్తారే కాని దానిలో పదాల ప్రాబల్యం ఉన్నంతగా అర్థప్రాధాన్యం ఉండదు. మరి కొందరి రచనల్లో అర్థ ప్రాధాన్యత ఉన్నా, భావ సౌరభం వుండదు. ఇంకొందరి వాటిలో భావ సౌరభం వున్నా కూడ రచనాశిల్పం వుండదు.

వాటన్నిటిపైనా ఆధారపడి వుంటుంది వారు ఎంతవరకు మంచి పాఠకులా, ఎంతవరకు మంచి రచయితలా అనే సత్యం.

రచనంటే ఒకే వస్తువు కాదు ; ఎన్నో విధాల రచనలున్నాయి. వాటిని స్థూలంగా రెండుగా విభజించవచ్చు సాహితీ రచనలనీ, ఇతర రచనలనీ.

సాహితీ రచనలు రచించటం కొందరు రచయితల పని అయితే ఇతర రచనలను చేయటం మరికొందరి పని.

పాఠకులూ అంతే ; కొందరికి సాహితీ రచనలు చదవటంలో అభిరుచి వుంటే మరికొందరికి ఇతర రచనలు చదవటంలో అభిరుచి.

సాహితీ రచనలను స్థూలంగా మూడుగా విభజించవచ్చు, వ్యాసం, కథ, కవిత అని. వ్యాసం అనేది రెండు రచనలకూ చెంది వుంటుంది, సాహితీ రచనకూ ఇతర రచనకూ కూడ. సాహితీ పరమైన వ్యాసం వ్రాయవచ్చు, ఇతర విషయ సంబంధమైన వ్యాసం కూడా వ్రాయవచ్చు.

డా॥ సంపదేవ్

కథ విషయం, కవిత విషయం వేరు. అవి కేవలం సాహితీ రచనలు మాత్రమే అవుతాయి. ఈ సాహితీ శాఖనే ఆంగ్లంలో అంటారు Belles-Lettres అని. మౌలికంగా ఇది ఆంగ్ల శబ్దం కాదు, ఫ్రెంచ్‌లో నుండి ఆంగ్లంలోకి వచ్చింది.

పాఠకుల అభిరుచి కూడ ఈ మూడు విధాల రచనల్లో భిన్న భిన్నంగా వుంటుంది. వ్యాసం అంటే కొందరకు ఇష్టమైతే, కథ అంటే మరికొందరకు, కవిత అంటే ఇంకొందరకు.

ఈ మూడు విధాల రచనల్లో కథను ( నవలను కూడా కలిపి ) చదివే పాఠకుల సంఖ్య చాలా ఎక్కువ ఉంటుంది. వారి తరువాతి సంఖ్య కవిత చదివే పాఠకులది. ఇక ఆఖరిది వ్యాసాన్ని చదివే వారిది.

వ్యాసాన్ని చదివి అర్థం చేసుకోటం కొంత శ్రమతో కూడిన పని. అందుకు ఆలోచనా శక్తి ప్రధానం.

అందులో భోగట్టా ప్రధానంగా వుండి రచనా శిల్పం రెండవదిగా వుంటుంది.

ఇక కవితా విషయం వేరు. దీనిలో భోగట్టా భాగం చాలా తక్కువగా వుండి రచనా శిల్పం చాలా ఎక్కువగా వుంటుంది.

కథా విషయం ఒక ప్రత్యేకమైంది. దీనిలో వ్యాసంలోని భోగట్టా, కవితలోని రచనా శిల్పం కూడ సమానంగా వుంటాయి. ఇది కల్పన అయినప్పటికీ బోలెడంత వాస్తవ భోగట్టా కూడ వుంటుంది. దానికి తోడు రచనా శిల్పం కూడ ఎంతగానో వుంటుంది.

వ్యాసాన్నీ, కవితనూ సవ్యంగా అర్థం చేసుకోలేని పాఠకులు కూడ కథా సాహిత్యాన్ని అర్థంచేసుకోగలరు.

వ్యాసం తెలియనిదాన్ని తెలియజెపితే, కవిత తెలిసిన దాన్నీ తెలియనిదాన్నీ కూడ ఒక రసాత్మక రీతిలో అభివ్యక్తపరిస్తే కథ తెలిసినదాన్ని మరో రూపంలో, మరో రంగులో ప్రత్యక్ష పరుస్తుంది. వ్యాసం అనేది అభిధ, కథ అనేది లక్షణ, కవిత అనేది వ్యంజన, సాహితీ పరిభాషలో.

'అభిధ' అనేది వాస్తవ శబ్దార్థాన్ని చూపుతుంది. "ఆ గదిలో అంతా చీకటే" అన్నప్పుడు అది అభిధ అవుతుంది, ఆ గదిలో ఉన్నది నిజమైన చీకటే కనుక. ఇక్కడ చీకటి పేరూ చీకటి అనే వస్తువూ ఒకటే.

ఒక మంచి కాని మనిషిని చూసి "అతనిలో అంతా చీకటే" అన్నపుడు గదిలోని 'చీకటి' అర్థం కాదు అతనిలోని, 'చీకటి' అర్థం. ఇక్కడ చీకటి అంటే అజ్ఞానం అవుతుంది, చెడ్డతనం అవుతుంది, అంతే కాని కంటికి కనిపించే నల్లని చీకటి కాదు. ఇది 'లక్షణ'.

ఇక మూడవది 'వ్యంజన'. దీని అర్థం పూర్తి మర్మంగా ఉంటుంది. ఒక అతిథితో "నేడు మా ఇంట ఎన్నో ఇబ్బందులు ఏర్పడ్డాయి, అయినా మీరు వుండండి" అని చెప్పటం. దీని మర్మార్థం ఆ అతిథిని వెళ్ళిపొమ్మని చెప్పటం వాచ్యార్థం వుండమని చెపుతుంది, కాని మర్మార్థం వెళ్ళమని సూచిస్తుంది పరోక్షంగా. దీన్నే 'వ్యంజన' లేక 'ధ్వని' అంటారు.

అభిధ పూర్తిగా వాస్తవాన్ని తెలిపితే, లక్షణ సగం వాస్తవాన్ని తెలిపితే వ్యంజన అసలు వాస్తవాన్నే తెలపదు.

ఈ మూడూ కూడ కనుకనే వ్యాసానికీ, కథకూ కవితకూ చెందుతాయి. కథనూ నవలనూ కల్పనా సాహిత్యం అంటారు కాని వాస్తవానికి, కథకంటే కవితయే ఎక్కువ కల్పనా సాహిత్యం.

వ్యాసాలు అనేక రకాలు. సాహితీ సమీక్షలు, చారిత్రక వ్యాసాలు, వ్యక్తులను గురించిన వ్యాసాలు, వైజ్ఞానిక వ్యాసాలు, పర్యటనల వ్యాసాలు, ప్రకృతి వర్ణనల వ్యాసాలు, దార్శనిక వ్యాసాలు, ఈ విధంగా ఎన్నో విధాల వ్యాసాలుంటాయి ; చివరకు, వ్యాసాలను గురించిన వ్యాసాలు కూడ వుంటాయి.

వ్యాసాలన్నీ కూడ కేవలం భోగట్టాను సంబంధించి మాత్రమే వుండవు ; వ్యాసాలన్నీ కూడ కేవలం సమీక్షాత్మకంగా మాత్రమే వుండవు. సృజనాత్మకంగా సుందరమైనవిగా, వర్ణనాత్మకంగా, రసమయంగా కూడ వుంటాయి. వ్యాసానికి అందని విషయ వస్తువు వుండదు. ఉదాహరణకు, వ్యాసాలను గురించి నవల రచించదు, కథ రచించదు, నాటకం రచించదు, కవిత రచించదు. కాని నవలను గురించి, కథను గురించి, నాటకాన్ని గురించి, కవితను గురించి వ్యాసం రచిస్తుంది. అందుకే అనేది వ్యాసాని కందంది లేదని.

వ్యాసాలు ఎక్కువగా ఎండుగా, నీరసంగా వుంటుంటాయి. విషయానికి సంబంధించి కొంత, రచనా శిల్ప లోపం మూలంగా కొంత ఆ విధంగా వుంటుంటాయి. కాని నిపుణ వ్యాస రచయిత చేతిలో వ్యాసం కూడ సుమధురంగా తయారవుతుంది.

కథా రచనా, కవితా రచనా సృజనాత్మకంగా మాత్రమే వుంటాయి, కాని వ్యాసం సృజనాత్మకంగాను వుంటుంది, సమీక్షాత్మకంగాను వుంటుంది.

తెలుగులో మినీ కథలూ, మినీ కవితయూ వస్తున్నాయి కాని మినీ వ్యాసాలు వస్తున్నట్లు లేదు. మినీ కవితను రచించటం సులభం, మినీ కథను రచించటం అంతకంటే తక్కువ సులభం, ఇక మినీ వ్యాసం రచించటం కష్టం.

ఒక భావాన్ని అభివ్యక్తపరచటానికి చాలా తక్కువ మాటలు సరిపోతాయి. కనుక మినీ కవిత కష్టం లేకుండానే రూపొందుతుంది.

ఒక ఘట్టాన్ని గురించి చెప్పాలంటే మినీ కథలో మినీ కవితకు పట్టినన్ని మాటల కంటే ఎక్కువ పడతాయి.

ఒక విషయాన్ని గురించి మినీ వ్యాసంలో వివరించా లంటే మినీ కథలో కంటే ఎక్కువ మాటలు పడతాయి. మాటల సంఖ్య ఎక్కువైన కొద్దీ " మినీ " అనే దానికి భంగం కలుగుతుంది. అందుకే అనేది మినీ కవిత కంటే, మినీ కథ కంటే మినీ వ్యాసం కష్టం అని.

వ్యాస రచనా పరిధి చాలా విస్తృతమైంది కావటంతో వ్యాస రచన కొన్ని పరిస్థితుల్లో సులభంగాను గోచరిస్తుంది, మరికొన్ని పరిస్థితుల్లో కష్టంగానూ గోచరిస్తుంది. మొత్తం మీద సాహిత్య ప్రక్రియల్లో వ్యాసం కొంత జటిలమైందే.

కథా రచన నేడు ప్రపంచ సాహిత్యంలోనే ఒక విశిష్ట స్థానాన్ని ఆక్రమించి వున్నది. కథ అంటే నవలతో కూడా అనే. కథకూ నవలకూ ప్రధాన భేదం పరిమాణంలోది కాదు. పెద్దదైనంత మాత్రంచేత నవల కాదు, చిన్నదైనంత మాత్రాన కథ ( కథానిక ) కాదు. రెంటికీ విషయంలోనే భేదం వున్నది. కథ అనేది అప్పటికప్పుడు జరిగే ఒకటి రెండు సన్నివేశాలతో సంబంధం కలిగి వుంటే నవలలోని వస్తువుకు నిండు జీవితాలతోనే సంబంధం వుంటుంది; ఎన్నెన్నో విషయాలు అందులో ప్రవేశిస్తాయి. ఎందరో వ్యక్తులు అందులో ప్రత్యక్షమవుతారు. అందుకే నవలను రచించి రక్తికట్టించటం సులభం, కథను రచించి రక్తి కట్టించటం కంటే.

పూర్వం కథలు వ్రాయబడే కంటే నోటితోనే, ఎక్కువ చెప్పబడేవి. కథా రచనను స్థూలంగా రెండుగా విభజించ వచ్చు : మనోరంజకం, నీతి బోధకం అని. ఈ రెండూ కూడ ఒకే కథతో మిళితమై వుండేవి కొన్ని.

కేవలం మనోరంజకాలుగా కాక కొంత నీతి బోధకంగా వుండే వాటినే నేడు సామాజిక స్పృహ వున్న సాహిత్యం అంటున్నారు. కథా రచనలో సామాజిక స్పృహకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడుతూంది నేడు.

కథలో సామాజిక స్పృహను చిత్రించటంలో రెండు పద్ధతులు ఉపయోగించబడతాయి — వాస్తవ వాదం, ఆదర్శ వాదం. మొదటిది సమాజానికి అద్దం లాంటిది, రెండవది దీపం లాంటిది.

వాస్తవ వాదంలో చూపబడుతుంది సమాజంలో జరుగుతున్న చెడు, అన్యాయం, పీడన మొదలైనవి. ఆదర్శవాదంలో చూపబడుతుంది సామాజిక శ్రేయం అంటే ఏ విధంగా వుండాలో అని. వాస్తవ వాదంలోవి తొలిగించాలసినవి, ఆదర్శవాదంలోవి చేర్చాలసినవి.

వాస్తవ వాదంలో యజమానికీ కార్మికులకూ మధ్య వుండే వ్యతిరేకతలు చిత్రించబడతాయి ; ఆదర్శ వాదంలో వారుభయుల మధ్య ప్రకాశించే ఐక్యతా, స్నేహ సద్భావాలా అభివ్యక్త పరచబడతాయి. ఒకటి సామాజిక పరిస్థితి ఎట్లా వున్నదో చూపుతుంది, రెండవది ఎట్లా వుండాలో చూపుతుంది.

కథా శిల్పం వివిధాలుగా రూపొందుతుంటుంది. ఒక పద్ధతిలో అయితే రచయిత ఎవర్నో గురించో చెప్తున్నట్లుంటుంది. మరొక పద్ధతిలో అయితే కథానాయకుడో, నాయకియో తాను స్వయంగా చెప్తున్నట్లుంటుంది.

ఈ పద్ధతి కాక ఒక నూతన పద్ధతి చైతన్య స్రవంతి అనేది కొంతకాలం క్రిందట నవలా రచనలో ప్రవేశించింది. దీన్నే Stream of Consciousness అన్నారు. ఇది నవలలోని పాత్రల బహిరంగాచరణను, బహిరంగా వెలువడే మాటలను వ్యక్తం చేసేదిగా వుండగ అంతరంగ భావాలను, మానసిక సంఘర్షణలను మౌనంగా అభివ్యక్త పరచేది అయి వుంటుంది.

## ఉద్యోగ ధర్మం

తెల్లోడి జమానా నుంచీ - ఈ
బెల్లు యిలాగే, యిక్కడే
వ్రేలాడదీయబడి వున్నట్లుంది !
వేళలు గుర్తుచేస్తూ
వచ్చి, పోవడానికి -
పంతుళ్ళకూ
పిల్లలకూ.
దీన్ని కొట్టి కొట్టి
ఎన్ని " చేతులు " అలిసాయో !
ఇది మాత్రం
వళ్ళంతా తూట్లు పడ్డా
వళ్ళు దాచుకోని నమ్మిన బంటులా
ఉండిపోయిందా స్థంబానికి వ్రేలాడుతూ
" ఉద్యోగ ధర్మం " నిర్వర్తించుతూ.

— కమల్

ఇటువంటి నవలలను మనో వైజ్ఞానిక నవలలు అంటారు. మనో విజ్ఞానంలో పుట్టిన ఈ చైతన్య స్రవంతికి జన్మదాత విలియం జేమ్స్. మనో విజ్ఞానం లోని దీన్ని తీసుకొని నవలా రచనలో ఒక విశిష్ట ప్రక్రియగా ప్రయోగించినవారు ప్రధానంగా జేమ్స్ జాయిస్, వర్జీనియా ఉల్ఫ్. ఇందుకు దోహదం చేశాయి సుప్రసిద్ధ మనో విశ్లేషకులైన ఫ్రాయిడ్, యుంగ్, ఆడ్లర్‌ల మనో విశ్లేషక సిద్ధాంతాలు.

ఈ చైతన్య స్రవంతి నవలల్లోని మరొక విశేషం ఏమంటే, వందల పుటలలో రచించబడ్డ నవలలోని కాలం కొన్ని గంటలు మాత్రమే. మామూలు నవలలోని కథలాగా సంవత్సరాలు, నెలలు పట్టదు కథలోని కాల పరిమితి. కథంతా కొన్ని గంటల్లో గడచినట్లు చూపెడు తుంది కొన్ని నెలల కాలంలో రచయిత రచించిన నవల. కొందరు రచయితల విషయంలో కొన్ని నవలలను రచించటం ఒక్కొకటి సంవత్సరాలకు కూడ రచన పూర్తి కాకపోవచ్చు. అయినా ఆ నవలలోని కథా కాలం మాత్రం కొన్ని గంటల్లోనే జరుగుతుంది. ఈ చైతన్య స్రవంతి పక్కి కూడ ఇపుడెవరిచేత వాడబడటం లేదు.

తెలుగులో పూర్తిగా ఈ ప్రక్రియకు సంబంధించిన నవలలు లేవేమో అన్నంత తక్కువ వున్నాయి. బుచ్చిబాబు రచించిన " చివరకు మిగిలేది ", వడ్డెర చండీదాసు నవల " హిమజ్వాల " మొదలైనవి కేవలం చైతన్య స్రవంతి మార్గానికి చెందిన నవలలు కాకపోయినా, దాని ఛాయలు అక్కడక్కడ గోచరిస్తాయి వాటిలో.

ఈ ప్రక్రియ కేవలం సర్రియలిజం కాదు కాని, సర్రియలిజం వలెనే ఇది కూడ కొంతవరకు అసహజ మనో విజ్ఞాన శాఖకు చెంది వుంటుంది. పాత్రలలోని ఆలోచనలకు, అనుభూతులకు పొంతన లేనట్లే వారి మాటలకు కూడ పొంతన వుండదు. స్థలం, కాలం ఈ రెంటినీ దాటినట్లుంటాయి ఈ పాత్రల మానస వృత్తులూ మాటలూ కూడ. వీరిలో హేతువాదానికి చోటు లేదు. తమలో లేచే వ్యతిరేక భావాల సంఘర్షణలో పాత్రలు నలిగిపోతుంటాయి.

కథా సాహిత్యం ( నవలలతో కూడుకొనే ) ఇంకా ఎన్నో నూతన శాఖలకు, ప్రక్రియలకు చెంది వుంది. ప్రక్రియలు కాక వస్తు వైవిధ్యంలో కూడ ఎంతో పెరిగింది. చారిత్రక కథలు, ప్రణయ గాథలు, పౌరాణిక కథలు, సామాజికాలు, సాంస్కృతికాలు, కౌటుంబిక కథలు, వైయక్తిక గాథలు, రాజకీయ, ఆర్థిక కథలు, విప్లవాత్మక కథలు, డిటెక్టివ్ కథలు, మనో వైజ్ఞానిక కథలు మొదలైన ఎన్ని విధాల కథలో నేడు విశ్వ సాహిత్యాన్నంతా ఆవరించి వున్నాయి.

నేడు సాహిత్యం అనగానే కథా సాహిత్యమే తడుతుంది. గొప్ప గొప్ప బహుమతులను సాహితీ రంగంలో పొందిన వారు కూడ ప్రధానంగా నవలాకారులే. నేడు విస్తృత వ్యాప్తిలో వున్నది ఈ సాహిత్యమే.

ఇక కవితా రచన మానవునికి మాటలు వచ్చిన నాటి నుండి ప్రారంభమయి మొదటిలో పాటగా తరువాత పద్యంగా, నేడు వచన కవితగా పరిణామం చెందుతూ వచ్చింది.

అంటే కవిత మొదట పాడేందుకు ఏర్పడితే, తరువాత చదివేందుకు రచించబడితే నేడు ఆలోచించేందుకు వ్రాయబడుతూంది.

గద్య రచన కంటే పద్య రచనయే ముందుది. నేటి యుగం గద్య యుగం, సందేహంలేదు. అయినా, గద్య పెరుగుతున్నంత విరివిగా కాకపోయినా, పద్య రచన, ఏదో ఒక రూపంలో, ఛందోబద్ధంగానో, ముక్త ఛందంగానో, లేక కేవలం వచన కవితగానో వర్ధిల్లుతోనే వుంది. ప్రౌఢ కవితా రచన కొంత సన్నగిల్లినా, నవ కవుల, యువ కవుల కంఠాలు సుమధురంగా మ్రోగుతూనే వున్నాయి.

ప్రాచీనకాలం నుంచీ ఛందోరీతులు మారుతూ వచ్చాయి; వచ్చి వచ్చి నేడు అసలు ఛందోరీతి అనేదే లేకుండా పోయింది. ఛందం మాత్రమే కవిత కాదు కనుక నేడు ఛందోబద్ధం కాని కవితలు కూడ తమ స్వీయ కాంతిని వెదజల్లుతున్నాయి. ఛందోబద్ధం కాని కవితలు కేవలం ఇంగ్లీషు కవితా ప్రభావంవల్ల నేటి భారతీయ భాషల్లో ప్రవేశించినా కూడ మనకు ప్రాచీనంగా కూడ సంస్కృతంలోను, మిగతా దేశ భాషల్లోను ముక్త ఛంద కవితలు వాడుకలో వున్నాయి.

ఆధునిక తెలుగు కవితను మూడుగా విభజించవచ్చు, భావ కవిత్వం, భౌతిక కవిత్వం, చైతన్య కవిత్వం అని. ఒకదానికి కృష్ణశాస్త్రిగారు ప్రతినిధి, రెండవదానికి శ్రీశ్రీ, మూడవదానికి బాలగంగాధర తిలక్. కృష్ణశాస్త్రిది కేవలం భావ జగత్తుకు మాత్రమే చెందితే, శ్రీశ్రీది కేవలం భౌతిక జగత్తుకు మాత్రమే చెందితే, బాలగంగాధర తిలక్‌ది ఉభయ రీతుల సమన్వయం. బాలగంగాధర్ తిలక్ కవిత అందుకే ఆరని చైతన్య దీపికగా ప్రజ్వలిస్తూంది ! ఈ ముగ్గురు కవులూ ఇప్పుడు జీవించి లేరు.

కళా జగత్తులో మొదటిగా ఏ నూతనత్వం ప్రవేశించినా ఫ్రాన్స్‌లోనే ప్రవేశించినట్లు కవిత్వంలో ప్రవేశించిన ముక్త ఛందం కూడా ఫ్రెంచ్ కవిత్వంలోనే ప్రవేశించింది. తరువాత ఇంగ్లీషు కవిత్వంలో ముక్త ఛందోరీతిని ప్రవేశ పెట్టిన మహనీయుడు వాల్ట్ విట్‌మన్ అనే అమెరికన్ కవి.

కవిత్వంలోని రచనా ప్రక్రియలతో పాటు వస్తువు కూడ మారుతూ వచ్చింది. ఒకప్పుడు ఉదాత్తమైన వస్తువుకు మాత్రమే విలువ ఇచ్చేవారు కవితా రచనలో. గొప్ప గొప్ప వ్యక్తులకో, పురాణ పురుషులకో, విశిష్టమైన చారిత్రిక ఘట్టాలకో, ఉన్నతస్థాయికి చెందిన శృంగార వర్ణనలకో, ఇంకా ఎన్నో ఉదాత్తం అనబడే విషయాలకో కవిత్వంలో ఎక్కువ స్థానం ఉంటుండేది. క్రమేణ అటువంటి అసామాన్య విషయాలకు కాక అతి సామాన్య విషయాలకు కవితా రచనలో స్థానం దొరక సాగింది. ఈ ప్రపంచంలో ఎంత అప్రముఖ వస్తువూ కూడ కవితా రచనకు పనికి రాకుండా పోదు అనే వాదం కవితా జగత్తులో చొచ్చి ఉంది.

నేడు వ్యాప్తిలో ఉన్న తెలుగు వచన కవితల్లో ప్రధానంగా రెండు వర్గాలు ప్రత్యక్షమవుతాయి. ఒక వర్గం వారు బాహ్య వస్తువులకు, వ్యక్తులకు, సంఘటనలకు కాక తమ స్వీయ ఆలోచనలకే కవితా రూపం ఇస్తుంటే మరొక వర్గం వారు సామాజిక స్పృహకు ప్రాధాన్యం ఇచ్చి బాహ్య జీవితానికి సంబంధించిన విషయాలకు కవితా రూపాన్ని ప్రసాదిస్తున్నారు.

వీరుభయుల కవితారచన కూడ సాహితీ రంగానికి సమానంగా అవసరమే, మనిషి భావ జీవీ, భౌతిక జీవీ కనుక.

వ్యాసం, కథ, కవిత తమతమ కాంతుల ద్వారా లోక కల్యాణానికి తోడ్పడితే అవి ఎంతో ధన్య సృజనలు !

## ఆమె రోడ్డు పక్క చిన్న రాయి మీద కూర్చుని ఉంది.

ముఖం కనపడకుండా ముస్లిమ్ లాగ ముసుగు వేసుకుంది. అందుచేత ఆమె అమ్మాయో, ఆవిడో తెలియడంలేదు. ఆమె చేతిలో చిన్న తోలుసంచి లాంటిదుంది.

రామచంద్రమూర్తీ దయానిధీ... త్వరత్వరగా అడుగులు వేయడానికి ప్రయత్నిస్తున్నారు కానీ... ఏ మూలనుంచి ఎవరు వొస్తారో ఏం జరుగుతుందో అన్న భయంతో వాళ్ళ అడుగులు సంకోచంగానూ, మెల్లగానూ పడుతున్నాయి. గేటు నుంచి మెయిన్ బిల్డింగ్ వరకూ కల రోడ్డు మీద అటు పక్కకీ, యిటు పక్కకీ చూస్తూ నడుస్తున్నారు. గేటు నుంచి పాతిక గజాలు వచ్చారు.




"వాతావరణం ప్రశాంతంగా ఉంది." అన్నాడు దయానిధి - యివాళ ఏ పిచ్చివాళ్ళూ తమని నిరోధించరేమో అన్న ఆశాభావం వ్యక్తం చేస్తున్నట్లు.

"తుఫాను ముందరా అలాగే ఉంటుందట." అప్రయత్నంగా నోరు జారాడు రామచంద్రమూర్తి.

"కానున్నది కాక మానదు. రోటిలో తల దూర్చి రోకటి పోటుకి వెరువనేల ? పిచ్చాసుపత్రిలో తలుపులు సరిగా వేయరు కాబోలు గదులకి. అందుకే రోజూ ఎవరో తప్పించుకు వచ్చెయ్యడం .... స్టాఫ్ వాళ్ళని వెదుక్కుంటూ రావడం."

"ఇది - జైలు కాదుగా బంధించడానికి ? మానసికారోగ్యం కోసం వచ్చే మనుషులని ఖైదీల లాగ బంధించడం సత్ఫలితాల నివ్వదని కాబోలు పేషంట్ల స్వేచ్ఛను హరించరు మరీ అవసరమయితే తప్ప."

"అదుగో -" అన్నాడు దయానిధి ఆగిపోయి.

అతనటు చూశాడు. "ఏమిటి ?"

"సరిగా చూడు.... గులాబిమొక్క దగ్గర .... రోడ్డు పక్క .... రాతి మీద .... ఎవరో కూర్చున్నారు ...."

"ఆఁ .... కనపడింది. కాని .... భయం లేదు. ఆమె అమ్మాయిలా లేదు. పైగా .... స్థిరంగా .... కూర్చుంది. కనుక .... మనం సందేహించవలసిన పనుండదు." అంటూ ఆగకుండా నడవసాగాడు.

ఇద్దరూ ఆమెకు చాలా దగ్గరగా వొచ్చారు.

ఆమె -తల ఎత్తి చూసింది.

ఇంక వాళ్ళు దాటి పోబోతున్నారామెను.

"ఏమండీ !"

ఆగారు.

ఆమె లేచి - మెల్లగా .... అడుగులు వేయసాగింది. ఆమె కుంటుతున్నట్లుంది. కాలికి దెబ్బ తగిలిందో, మరేమన్నా అయిందో ? రామచంద్రమూర్తికి భయం వేయలేదు. ఆమె - హాస్పిటల్‌లో .... తనవాళ్ళెవరినో చూడడానికి వచ్చి ఉంటుందనుకున్నాడు.

"ఏం కావాలి ?"

"కొంచెం .... యీ ఉత్తరం .... చదివి పెట్టరూ ?"

ఆగితే కాలహరణమేమో అని సందేహిస్తున్నాడతను.

"చూపు సరిగా ఆనదు .... అందుకని .... దయచేసి చదివి పెట్టరూ ! దీనంగా .... ప్రాధేయపడింది. ఆమె

కంఠం ఆమె వయసుని ప్రతిఫలించడం లేదు - అసహజంగా .... వొణుకుతూ.

ఉత్తరమేగా ? చదివితే ఏం పోయింది ? పాపం .... స్త్రీ .... బ్రతిమాలుకుంటూంది .... ఆ ఉత్తరంలో ఏముందో ? - జాలి వేసిందతనికి.

" సరే .... ఇవ్వు. " అన్నాడు.

" ఇక్కడా ! .... ఉహుఁ .... అలా పదండి .... బొత్తిగా రోడ్డు .... నలుగురూ వొచ్చి పోతుంటారు.... " అందామె సంచీ పట్టుకుని లేస్తూ.

అంత రహస్యమా ? ఎవరూ వినకూడనిదా ? మరి.... అటువంటి ఉత్తరం తన చేత ఎలా చదివిస్తూంది ?

ఆమెననుసరించడం తప్పలేదతనికి. అతని వెనకే దయానిధి. అప్పుడు చూశాడామెను రామచంద్రమూర్తి. ఆమె మంచి చీరే కట్టింది. వయసు కూడా చాలా ఎక్కువేమీ ఉండకపోవచ్చు. కాని .... మనిషి .... దెబ్బ తిన్నట్లు కనిపిస్తూంది.

లాన్ అంచున .... పూలతోట వేపుగా కూర్చుందామె. ఆమెకు దగ్గరలోనే రామచంద్రమూర్తీ దయానిధీ. ఆమె ఒక ఉత్తరం తీసి యిచ్చింది. అతను చదవసాగాడు.

" విజేన్ !

ఈ వారం పత్రికలో కూయవే కోయిలా సీరియల్ మీద మీ ఉత్తరం ! ఎంత చక్కగా ఉంది ! లోతయిన భావాలు .... మంచి అందమయిన భాష. చక్కని శైలి. పాఠకులను ఉర్రూతలూగించి వదులుతుందంటే నమ్మండి. మీరు చాలా బాగా రాస్తారు ఉత్తరాలు. మీకు నా అభినందనలు. ఉత్తరాలు వ్రాయడం కళ అనీ .... నేటి సీరియల్స్‌కి పాఠకుల ఉత్తరాలే ప్రాణమనీ పత్రికలవాళ్ళెప్పుడు గుర్తించి ఉత్తర కళాకారులను తగు విధంగా గుర్తిస్తారో, గౌరవిస్తారో ? మీవంటి ప్రసిద్ధ రచయితల వల్లే యీ మహత్కార్యం జరగాలి. కవర్ పేజీ మీద ఉత్తర రచయిత ఫోటో వెయ్యడం .... ఉత్తరాలకు పారితోషికమూ పత్రికా పంపడం, ప్రత్యేక సంచికలు

( జ రి గి న - క థ )

మిత్రులిద్దరూ మళ్ళీ హాస్పిటల్‌కి బయలుదేరారు. వాచ్‌మెన్ లేడు. హమ్మయ్య అనుకున్నారు. లోపలికి ప్రవేశించగానే 'ఏమండోయ్' అన్న జంట పిలుపు వినిపించింది. ఆ తర్వాత వారి ప్రశ్నలు ఆడది గొప్పా? మగాడు గొప్పా? చెప్పండి లేకపోతే మా కథ వినండి. నేను ఉద్యోగం చేస్తున్నాను, మావారు వంట ఎందుకు చెయ్యకూడదు ? అలానే బట్టలు ఉతకటం ఇల్లు చిమ్మటం వగైరాలు ఎప్పుడైనా అయితే ఏమో కాని రొటీన్‌గా చెయ్యమంటే ఎలా అంటాడతను. సుఖాన ఉన్న సంసారం బజార్నపడి ఇద్దరూ పిచ్చిఆసుపత్రిపాలపడ్డారు. దీనికి పరోక్ష కారణాలున్నాయన్నాడు దయానిధి. 'ఔను' అన్నాడు రామచంద్రమూర్తి. ఆ రోజు డా॥ విజయని కలుసుకోవటం కుదరదు.

(ఇక చదవండి)

వేసేటప్పుడూ, కొత్త పత్రికలు పెట్టేటప్పుడూ - కథా రచయితలతో పాటు ఉత్తర రచయితల నుంచి కూడా ఉత్తరాల నాహ్వానించడం వగయిరా సంస్కరణలన్నీ జరగాలి. అప్పుడే లేఖా కారులకి తగిన న్యాయం జరుగుతుంది. మీవంటి ప్రముఖ లేఖా రచయితలు ముందుకి రావాలే కాని .... మాబోటి వారందరూ ఉత్తేజితులై - మీ నాయకత్వంలో ఉద్యమాన్ని సఫలం చేయరూ ? నేనూ తరచుగా పత్రికల ముఖచిత్రాల మీదా సీరియల్స్ మీదా ఉత్తరాలు రాస్తూంటాను. ఆమధ్య - ఒక మాస పత్రికలో వచ్చిన - 'ఆంధ్రప్రదేశ్‌లో అభ్యుదయం' మీద ఉత్తరం రాశాను. భాష చక్కనిది. శైలి చక్కనిది. ఒక్కొక్క పదమూ రసగుళికే. చదువుతున్నంతసేపూ

నా మనసు ఎక్కడో విహరించిందంటే నమ్మండి .... అంటూ ఎంతో కష్టపడి నేను వ్రాస్తే - ఆ ఉత్తరాన్ని సంపాదకుడు - 'ప్రకటనల మీద .... ప్రభుత్వ ప్రకటనల మీద లేఖలను వెయ్యం. సీరియల్స్ మీదే వేస్తాం'. అని మూర్ఖంగా నా ఉత్తరాన్ని త్రిప్పి పంపాడు. ఇది- నిరసించవలసిన విషయం. ఈపాటికి మీరు - వెయ్యి ఉత్తర రచయిత ఐపోయి ఉంటారేమో. వెయ్యి నూట పదహారు కాగానే మీకు సన్మానం చేయాలి. ఇప్పటికి శలవిప్పించండి. మీరు గమనించి ఉంటారు, నేనూ - మీఅంత కాకపోయినా కొంచెం పేరున్న ఉత్తర రచయిత్రి నేనని ....

భవదీయ .... లక్ష్మి.

అది చదివేసరికి ఆమె - రెండోది అందించింది. రామచంద్రమూర్తి కొత్త విషయాలు తెలుసుకుంటున్నట్లు ఉత్సాహం చెందాడే తప్ప కొంచెమయినా విసుగు చెందలేదు.

" సహ రచయిత్రి లక్ష్మిగారికి :—

మీ ఉత్తరం. నా మీద అభిమానానికి చాలా కృతజ్ఞతలు. మీవంటివారి ఆదరాభిమానాలే నన్నీ రంగంలో కృషి సలిపేలా ప్రోత్సహిస్తున్నాయి. మీరన్నట్లు - ఉత్తర రచయితలకీ పారితోషికం ఉండాలి. పత్రికల కాపీలు పంపాలి. ఐతే .... నాకు .... చాలామంది రచయితలు .... సంవత్సరానికింత అని డబ్బు పంపిస్తారు ముందుగా. వారి రచనల మీద ఉత్తరాలు వ్రాస్తాను పత్రికలకి. కాంట్రాక్టన్నమాట. ప్రసిద్ధ రచయితల కంటే కొత్త రచయితల దగ్గర ఎక్కువ వసూలు చేస్తాను. సంవత్సర - ఉత్తర కాంట్రాక్ట్ అది. రెగ్యులర్ క్యాజువల్ అంటే ఓ సీరియల్ మేరకే రాస్తాం ఉత్తరాలు. వీటికి ధర సహజంగానే ఎక్కువుంటుంది. సంవత్సరంలో ఆ రచయిత రచనలమీద పెట్టిన కవర్ల ఖర్చు.... పోస్టేజి .... అన్నీ బిల్లు చేసి రచయిత నుంచి వసూలు చేస్తాను. అయినా - ఉత్తర రచయితలు దోచుకో బడుతున్నారనడం నిర్వివాదాంశం. ప్రతి పత్రికా ముఖచిత్రం నుంచి - చివరి పేజీ చివరి లైను వరకూ చదవడానికే యిరవైనాలుగు గంటలూ చాలవు. ఉత్తరాలు రాయాలి. నిజానికి మన ఉత్తరాలే రచయితలకి ఉత్సాహం. పాఠకుల్లో అతన్ని లేదా ఆమెను నిలపెట్టేవి. మన ఉత్తరాలే పత్రికలకి ప్రాణం. అయినా మనని చిన్న చూపు చూస్తున్నారు ! ఈ అన్యాయాన్ని మన లేఖా రచయితల మందరమూ సంయుక్తంగా సంఘటిత పోరాటంతో ఐకమత్యంగా ఎదుర్కొందాం.

త్వరలో - మీకు కొన్ని కంట్రాక్టులు చూస్తాను. మీ పేరు నేను తరచు చూసేదే పత్రికలలో. మీ రచనలలో (ఉత్తరాలలో) స్పార్క్ వుంది. ఫ్యూచరుంది. బ్యూటీ కూడా ఉంది .... అని నేను ఘంటాపథంగా రాయగలను. మీ సూచనలను - యీసారి పత్రికాఫీసులకు వెళ్ళినప్పుడు సంపాదకుల దృష్టికి తెస్తాను. ఉత్తరాలకి మాత్రం అంగీకారపు టుత్తరాలెందుకు రాయకూడదు పత్రికల వాళ్ళు ? మనది ఒకటే ఫీల్డు కనుక మనం యింకా సన్నిహితం కావాలి.మీ ఫొటో .... బయోడేటా పంపండి. బై బై .... మంచి ఉత్తరల మీద అభినందిస్తూ రాసిన ఉత్తరాలు కూడా ప్రచురించడం - పత్రికల విధి కాదా ? ఉత్తరాల రచయితలకు మాత్రం ప్రోత్సాహమూ అభినందనలూ అవసరం కావా ? మీ

విజేన్

ఆమె పొరపాటున యిచ్చినట్లుందా ఉత్తరం. తను అతనికి రాసిన వాటి కాపీలు ... అతను తనకి రాసినవీ.... ఎంత భద్రంగా దాచుకుంది ! వీటికోసమే కాబోలు ఆ అందమయిన చంచీ !

! మైడియర్ లక్ష్మి.

నీ ఫొటో.... ఎంత బాగుంది ! ఫొటోయే యింత బాగుంటే నువ్వింకా ఎంత బాగుంటావో కదా ! నీ ఫొటో చూస్తూ.... కలలలో తేలిపోయాను. ఊహలలో ఊగిపోయాను. ఆరాటములో అల్లలాడి పోయాను. నమ్మలేక

పోతున్నావా?.... నిజం—నమ్మశక్యం కాకుండానే ఉంటుందిలే. నా ఫొటో....వివరాలూ కావాలన్నావు. నేను మొట్టమొదటి సారిగా ఫొటో పంపుతున్నది నీకే. ఎందుకంటే నువ్వంత దగ్గరగా వొచ్చేశావు నా హృదికి. ఇక — నా వివరాలు. తాళం వేయని తలుపులు సీరియల్‌లో రచయిత్రి సృష్టించిన పాత్రకు దగ్గరగా ఉంటాయి నా వివరాలు. నువ్వా సీరియల్ మీద ఉత్తరాలు రాశావా ? ఇంతవరకూ రాయకపోతే — రాయి.

హైదరాబాద్ వీధిలో మాకొక పెద్ద కార్ల షాపుండేది. నాకెవరూ లేరు. ఒంటరిని. ఆ — కార్లమ్మడం వ్యాపారం చాలా లాభసాటిగా రోజుకి వేలకొద్దీ లాభాలు తెస్తున్నా — విసుగొచ్చి అమ్మేశాను. నా హృదయం చదువు మీదకు పోయింది.

రాజమండ్రికీ నాకూ ఎందుకో అనుబంధం. రాజమండ్రి వొచ్చాను. సరదాగా - మెడికల్ కాలేజీలో చేరిపోయాను. మహారాణీపేటలో ఒక మాన్షన్ తీసుకుని ఉంటున్నాను. మెడిసిన్ చదువుతున్నానన్నమాట .... తాళం వేయని తలుపులు సీరియల్‌లోలాగే. తరచుగా నాకేమీ తోచదు. గోదావరి ఎక్కి— మద్రాసు పోయి రెండు రోజులు గడుపుతాను. లేదా కోరమాండల్‌లో హైదరాబాద్ చెక్కేస్తాను. స్టేషనువాళ్లు ఫ్రండ్స్. రిజర్వేషన్ చేస్తారెప్పుడయినా. మనం యిలా స్నేహితులం కావడం తమాషాగా లేదూ ? నీ ఫొటో చూడగానే కలిగిన అభిప్రాయాలు నేనెలా రాశానో, నా ఫొటో చూస్తూంటే నీలో చెలరేగిన భావాలు నువ్వూ . అలాగే రాయాలి సుమా !

అన్నట్లు .... వీక్లీ చూశావా ? పిశాచి సీరియల్ మీద ప్రచురించిన ఉత్తరాలలో మొదటిది నాదయితే రెండోది నీది ! నాకు చాలా సంతోషంగా ఉంది మనని పత్రిక యిలాగ కలపడం. మనది యీ జన్మలో అనుబంధం కాదేమో !



నీ జవాబు కోసం చాలా ఆతృతగా నిరీక్షిస్తుంటాను. వెంటనే .... వివరంగా అన్నీ రాస్తావు కదూ ?

నీ .... విజేన్.

కథ ముదిరి పాకాన పడిందనుకున్నాడు రామచంద్రమూర్తి.

స్నేహం ముదిరి - ప్రేమలో పడితేరాలి. వీళ్ళు అనుకుంటూండగానే ఆమె మరో ఉత్తరం అందించింది.

" విజేన్ !

ఇంక నేనీ విరహం భరించలేను. ఉత్తరాలు చదువుతూంటే మనసు ఉరకలు వేసేస్తూంది నిన్నెంతట కలుసుకోగలనా అని. ఇప్పుడు నా కార్యక్రమం ఏమిటో తెలుసా ? ఉదయమంతా సీరియల్స్....కథలు చదవడం... మధ్యాహ్నం పత్రికలకు ఉత్తరాలు రాయడం ....

సాయంత్రం - ఫైలు ముందేసుకుని డాబామీద కూర్చోడం! ఆ ఫైలులో నువ్వు రాసిన ఉత్తరాలూ, నేను నీకు వ్రాసిన వాటి కాపీలూ ఉంటాయి. నువ్వు రాసిన ఒక్కో వాక్యం చదువుతూంటే హృదయం ఉవ్విళ్లూరిపోతుంది ఎంతవెంతట నిన్ను చూడగలనా అని.

వ్రాతలోనే యింత చిలిపివాడివి. నిజంగా యింకెంత చిలిపిగా మధురంగా ఉంటావో! ఎప్పుడు మనం కలుసుకుంటామా అని ఆ దివ్య క్షణం కోసం తహతహలాడి పోతున్నాను. నిజంగా - మనది జన్మ జన్మల అనుబంధమే. కాకపోతే యింత త్వరలో యింత ప్రేమేమిటీ ఒకరి పట్ల ఒకరికి ? వీజేన్, నిన్ను చూడకుండా .... నీకు దూరంగా .... ఉండలేక పోతున్నాను. ఉద్రేకంలో... నువ్వు రాసిన ఉత్తరాలనే నిన్ననుకుని .... ముద్దులు కురిపించేస్తాను. గట్టిగా — హృదయానికి హత్తుకుంటాను .... ఈ విరహం నేనిక ఎన్నాళ్ళో భరించలేను వీజేన్ .... భరించలేను.

నీ లక్ష్మి.

డియర్ !

ఎవరు భరించమన్నారు విరహాన్ని ? సరిగ్గా నా మనసు చదివేసినట్లు రాశావు. నీకెలా తెలిసింది నా మనసు ? కొత్త రచయిత సీరియలొకటి మంత్లీలో రాబోతూందట. ఉత్తరాలు రాయమని అడగడానికి వచ్చాడు. ఉత్తరానికి ఆరు రూపాయల రేటు నిర్ణయించాను. నీ పేరు కూడా రికమండ్ చేశాను. నాలుగుకేనా ఒప్పేసుకో.

నిన్ను చూడాలని నాకూ తహతహగానే ఉంది. రాత్రి-కల. మనమిద్దరమూ ఒకే ఇంట్లో కలసి జీవిస్తున్నామట. ఇద్దరమూ సంయుక్తంగా పత్రికలకు లేఖలు వ్రాస్తున్నాం. గొలుసు ఉత్తరాలు .... సీరియల్ ఉత్తరాలు .... ఎన్నెన్నో ప్రయోగాలు చేశామట ఉత్తర కళలో. మనకి అవార్డులు వొచ్చాయిట. ఈ కల నిజమయితే ఎంత బాగుంటుంది !

ప్రేమలో ప్రమాదం సీరియల్లాగా రంజుగా ఉండదూ మన దాంపత్య జీవితం ? ఏమంటావ్ ? ఆఁ.... ప్రేమించుకోకుండా పెళ్లేమిటనా .... దానికేముంది ? .... కోరమాండల్లో నువ్వు రాజమండ్రిలో దిగు. మెడికల్ కాలేజికి రా. ఇద్దరమూ నా మాన్షన్లో ఓ పూట విశ్రాంతి తీసుకుని — మర్నాడు కోరమాండల్లో హైడ్ పోదాం. అక్కడ బీచ్లో ప్రేమించుకుందాం ఓ వారం పాటు. తరువాత ఆదర్శ వివాహం చేసుకుని .... ఆదర్శ దంపతులుగా జీవిద్దాం. ఓ. కే. ? నేన్నీకోసం ఎదురు చూస్తూంటాను. వొచ్చేటప్పుడు సాధ్యమయినంత బంగారమూ డబ్బూ పట్టుకు మరీ రా. లోతుతెలియని గుండె సీరియల్లోలా సుఖంగా జీవించేద్దాం."

నీ వీజేన్.

ఒక కాగితం అయిపోగానే మరొక కాగితం అందించిందామె.

"మైడియర్ రెస్ట్ వీజేన్ ....

నేను బయలుదేరుతున్నాను. అక్కడికి వొచ్చాక నీ కివ్వడానికని అంతా రాస్తున్నాను, వలపు నిండిన తలపు సీరియల్లో లాగే.... ఫ్రెండ్తో సినిమాకి వెళ్తున్నానని .... సూట్కేస్ ముందే పంపేసి .... యిల్లు వదిలాను. నాతో రమ ఉంది కనుక మావాళ్ళ కనుమానం కలగలేదు. రమకి మన విషయం అంతా తెలుసు. "అదృష్టవంతురాలివి. వీజేన్తో వెయ్యి యుగాలు సుఖంగా జీవించు." అని ఆశీర్వదించి కోరమాండల్ ఎక్కించింది చివరి క్షణంలో. టికెట్ తీసుకోలేదు. సీరియల్లో హీరోయినూ తీసుకోలేదుగా .... టి. సి. అడగనూలేదు నా హృదయం రైలుకంటె తొందరగా పరుగెడుతోంది నిన్నెంతవెంతట చేరుకుని నీ హృదయం మీద వాలిపోతానా అని. ఎలాగైతేనేం రాజమండ్రి స్టేషన్ వొస్తూందని తెలిసింది. గేటు దగ్గరకు వొచ్చి నిలుచున్నాను.

"ఇది-కోరమాండల్. రాజమండ్రిలో ఆగదు -" అన్నారెవరో.

" రచయిత్రి కంటె మీకు తెలుసా ? ప్రేమ ప్రయాణం సీరియల్‌లో నాయకీ నాయకులు కోరమాండల్ లోనే జర్నీ చేస్తూ-రాజమండ్రిలో దిగి-కాఫీ, టిఫిన్లు సేవించి కొంచెం ప్రేమించుకుంటారు. తెలియకపోతే ఊరుకొండి. మిస్‌లీడ్ చెయ్యకండి. " అని వాళ్ళ నోళ్ళు మూయించాను. రైలు వేగం తగ్గించుకుంటూంది. గర్వంగా నవ్వాను.

రాజమండ్రి స్టేషను....ప్లాట్‌ఫారం....రైలు చాలా స్లో అయింది.

అయ్యో ! .... ప్లాట్‌ఫారం దాటిపోతున్నట్లుందే.... కంగారుగా దిగిపోబోయి...." ఉత్తరం ఆగిపోయింది మధ్యలో.

ఈసారామె అందించిన ఉత్తరం చేతివ్రాత మార్పు వొచ్చింది.

" వీరేన్ !

ఎంత దురదృష్టవంతురాలిని ! నీకు ఉత్తరం వ్రాయడానికి కూడా నోచుకోలేదు. తనువు నీదీ మనసు నాది సీరియల్‌లోలాగ ఉత్తరాలు కూడా మరొకరిచేత రాయించవలసి వొస్తూంది. సీరియల్స్‌మీద పత్రికలకు ఉత్తరాలు రాయ నోచుకోని దౌర్భాగ్యురాలినై పోయాను. చివరకి నీకు కూడా స్వంతంగా రాయలేకపోతున్నాను. " లక్ష్మి.

కోరమాండల్ నుంచి....రాజమండ్రి ప్లాట్‌ఫారమ్ మీదకి దిగింది లక్ష్మి. అంతే....జరిగిందేమిటో ఆమెకు తెలియదు. ప్లాట్‌ఫారంమీద దబ్బున పడిపోయింది. ఆమెకు తెలివొచ్చింది హాస్పిటల్లోనే. మెదడు దెబ్బతింది. కాళ్ళూ చేతులూ సరే సరి. నెలరోజులు పైగా హాస్పిటల్లో వుంచారు. కాళ్ళూ చేతులూ కొంచెం స్వాధీనంలోకి వచ్చాయి కానీ....మెదడులో యింకా సరికాలేదుట.

"వీరేన్....ప్రేమ ప్రయాణం....ఎన్ని ఉత్తరాలు !... కోరమాండల్ రాజమండ్రిలో ఆగడం మరచిపోయింది. స్టుపిడ్ డ్రయివరు, ప్రేమ ప్రయాణం సీరియల్ చదివి వుండడు. ఉత్తరాలు కలిపిన ప్రేమ మనది. పత్రికల కాలమ్‌లో పవిత్ర ప్రణయం....ఎవరేనా సీరియల్ రాస్తే.... సీరియల్‌కి ప్రాణం ఉత్తరాలు....పేపరుకి ప్రాణం మార్కులలాగ....వీరేన్....నేను పట్టుమని పదక్షరాలు రాయలేను. వేళ్ళు వొణుకు. చూపు నిలబడదు స్థిరంగా.

ఈ ఉత్తరం .... నేను చెబుతూంటేనూ .... తను జోడించీ .... రమ రాసిపెడుతూంది.

## సన్యాసి – జిజ్ఞాసువు

ఒక సన్యాసికి జిజ్ఞాసువుకీ జరిగిన సంభాషణ-

" గోసాయీ ఇటు వస్తున్నది నీవు ఎక్కడ నుంచి "

" తెలియదు "

"పోనీ ఎక్కడికి వెడుతున్నదీ చెప్పవయ్యా"

" తెలియదు నాయనా "

" అయితే ఇప్పుడు నీవు ఎక్కడున్నట్టు ? "

" అదీ తెలియదు "

" ఎవరు నువ్వు, నీ పేరు, ఊరు "

" తెలియదు "

" అరే. చూడబోతే తల పండినట్టున్నది. ఇంత కాలం బతికి నువ్వు తెలుసుకున్నదీ "

" అవును-అదే-నాకేమీ తెలియదని "

జిజ్ఞాసువుకు వెంటనే కనువిప్పు కలిగింది. సన్యాసి పాదాల మీద వ్రాలి క్షమించమని కన్నీళ్ళతో వేడుకున్నాడు.

" తెలిసికొంటిని నా కేమి తెలియదంచు " అని లోపల్లోపల పదేపదే వల్లించుకున్నాడు.

ఇదీ మన జీవిత రహస్యం.

- బుద్ధవరపు వెంకటరత్నం

నేను నీ దగ్గరకి రాలేనిక వీరేన్ :

నువ్వే నా దగ్గరకు రావాలి మరి.

కోరమాండల్‌లో వొద్దు. పురే రైలులోనేనా రా. ఇదే నా కోరిక. నువ్వొస్తే .... మాట్లాడుకుందాం.

వీరేన్ :

నువ్వు రాలేదు.

రావు.

నాకు తెలుసు.

ఉత్తరాలు రాయలేని .... సీరియల్స్ చదవలేని .... యీ లక్ష్మి యిక నీకెందుకు ? వాడిన కుసుమాలు సీరియల్‌లో లాగ నేను జీవితాంతమూ యిలా మిగిలిపోవలసిందే. మధుర స్మృతులు సీరియల్‌లో లాగే నేనిక ఒంటరిగా .... ఒంటరి .... గా ....

రమ రాస్తున్నది .... లక్ష్మికి పిచ్చి ముదిరిపోయిందని ఆమెను మెంటల్ హాస్పిటల్‌కి పంపేస్తారుట. వీరేన్ ! .... ఇప్పటికేనా మీకు ఆమె మీద జాలి కలిగితే —

ఒక్కసారి వచ్చి చూడండి. పలకరించండి. పత్రికలలో సీరియల్స్, ఉత్తరాలు .... అంటూ ఆమెకు తీయని కబుర్లు చెప్పండి. ఆమె - అలాగ, మనిషి కాగలదేమో ! ప్లీజ్ .... మానవత్వం ఉన్న మనిషిగా .... ”

అయిపోయింది కాగితం.

ఆమె ఏడుస్తోంది.

వీరేన్ రాలేదన్నమాట .... ఎలా వొస్తాడు ? హైదరాబాద్ బీచ్‌లో ఆస్తి, రాజమండ్రిలో మెడిసిన్ చదువూ.... గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసు ప్రయాణం - యివన్నీ వొదులుకుని అతను రాలేడు మరి.

“ థాంక్స్ .... చదివిపెట్టినందుకు....” వెళ్ళిపోయిందామె. చీకటి పడిపోయింది. “ ఫాక్ట్యువల్ ఎర్రర్స్ (factual errors) వల్ల యిలాటి ప్రమాదాలుంటాయన్నమాట : పాపం....ఆ అమ్మాయి....లక్ష్మి.... ప్రయాణీకులు చెబుతున్నా వినిపించుకోకుండా_వెండార్స్ (Vendors) కోసం వేగం తగ్గించిన కోరమాండల్_రాజమండ్రిలో ఆగుతుందని నమ్మేగా_దిగి_పడి_పిచ్చిదయింది ! ” రామచంద్రమూర్తి నిట్టూర్చాడు. “హైదరాబాద్ బీచ్....రాజమండ్రి మెడికల్ కాలేజ్....ప్స్.... సీరియల్స్‌మీద ఉత్తరాలు....ఉత్తరాలు ఏకం చెయ్యడం... భగవంతుడే రక్షించాలి. పోనులే. అచ్చు అక్షరాలు అథెంటిక్‌గా అనిపిస్తాయి. అచ్చులో_తప్పు కూడా రైటే ఏమో అనిపిస్తుంది. మనుష్యులు అనేది తప్పనీ— మనుషులనేదే రైటనీ....” గేటు వద్దకు వచ్చేశారిద్దరూ.

“ ఎవరు మీరు ? అయ్....తప్పించుకుపోదామనా ? లోపలకు పదండి....” గేట్‌మన్ గద్దించేసరికి తెల్లబోయారిద్దరూ. “ మేం పిచ్చివాళ్ళం కాము. ”

“ నాకు నమ్మకం కలిగించాలంటే....నిన్న మీరు యిద్దరూ కలసి ఎంతిచ్చారో యివాళ ఒక్కొక్కరూ అంత యివ్వండి. పిచ్చివాళ్ళు కాము పిచ్చివాళ్ళు కామనే అంటారు. ”

దయానిధి_జేబులోంచి-రెండు రెళ్ళు తీసి అందించాడు.

గేట్‌మన్ నవ్వాడు. “ నిజమే. మీరు_పిచ్చివాళ్ళు కాదు. మంచివాళ్ళే. ” వెళ్ళండన్నట్లు గేటు తెరిచి నమస్కారం పెట్టాడు.

ఇవతలకు వొచ్చి అన్నాడు దయానిధి. “ తెనాలి రామలింగడి కథ జ్ఞాపకం రావడం లేదూ ? లోపలికి రూపాయ్....బయటకు రెండు ! ” రామచంద్రమూర్తి జవాబు చెప్పలేదు. అతని హృదయం భారంగా పిచ్చి పిచ్చిగా వుంది.

అతను_మెల్లగా అడుగులు వేయసాగాడు.

( స శే ష )

మహాపురుషుల బాల్యాలు – 5

# లాల్ బహదూర్ శాస్త్రి

బాలలూ !

సరిగా యిరవై సంవత్సరాలక్రితం యిదే రోజున అంటే 1966 సంవత్సరము జనవరి నెల 11 వ తేదీన మన భారతమాత తన ముద్దు బిడ్డలలో ఒక ముఖ్యుడిని పోగొట్టుకొన్నది. ఆ మహానుభావు డెవరో మీకు తెలుసా !—భారతదేశ ప్రధానిగ పాలించిన పంతొమ్మిది మాసాలలోనూ పొట్టివాడైనా గట్టివాడనిపించుకొని, ఎన్నో క్లిష్ట సమస్యలను పరిష్కరించి, పరమ పదించిన పుణ్య మూర్తి ఆయన ! ఆయనే కీర్తిశేషులు లాల్ బహదూర్ !– శాస్త్రి అన్నది ఆయన పేరు కాదు! – కాశీ విద్యాపీఠంలో పరీక్షలో కృతార్థుడై పుచ్చుకొన్న గౌరవ పట్టాయే శాస్త్రి !–

లాల్ బహదూర్ 1904 అక్టోబరు 2 వ తేదీన మొగల్ సరాయిలో తాతగారి యింట జన్మించారు ! – తల్లి పేరు రామ్ దులారీదేవి, తండ్రి పేరు శారదా ప్రసాద్. వీరు కాయస్థుల కులానికి చెందినప్పటికీ మద్య మాంసాదులను ముట్టుకునేవారు కారు ! మధ్య తరగతి కుటుంబీకు లవడం చేత ఆర్థికంగా యిబ్బందుల్లో వుండేవారు ! — శారదా ప్రసాద్ రాంనగర్ సంస్థానంలో తాసిల్దారుగా పనిచేసేవాడు. కాని దురదృష్టవశాత్తు ఆయన, లాల్ బహదూర్‌కు ఏడేండ్లు రాకముందే మరణించాడు. దాంతో లాల్ బహదూర్ బాధ్యత అంతా తల్లి రామ్‌దులారీ పైనే పడింది.

లాల్ బహదూర్ బాల్యమంతా కడు పేదరికంలోనే గడిచింది. బాల్యంలో ఆయన బొద్దుగా, పొట్టిగా వుండేవారు !—ఆయన ఎవరితోనైనా యిట్టే జతకట్టి స్నేహం చేసేవారు. ఆయనంటే స్నేహితుల కెంతో ముచ్చట. ఆయన వెంట ఎప్పుడూ ఎంతోమంది స్నేహితులు వుండేవారు !

ఒకసారి ఆయన గురించి ఒక జ్యోతిష్కు డేమన్నాడో తెలుసా !—"లాల్ బహదూర్ గొప్ప రాజకీయ నాయకు డయి–గొప్ప గొప్ప పదవులు సంపాదిస్తాడు–" అని చెప్పాడు !–అప్పట్లో అంతా ఆ జ్యోతిష్కుని మాటలను తేలిగ్గా కొట్టిపారేశారు !–పాపం వాళ్ళకేం తెలుసు ! – ఆయనే భావి భారతదేశ ప్రధాని అయి, భారత రత్న లాంటి అత్యుత్తమ బిరుదు సంపాదించగలడని !–

**బాలవాణి**
**సోమంచిరామం**

లాల్ బహదూర్‌కు ఆటలంటే మక్కువ ఎక్కువ !– కాని పేదరికంవల్ల ఆట సామగ్రి ఏమీ కొనుక్కోలేక పోయేవాడు ! – దానికితోడు అతని స్నేహితులు కూడ అంతంత మాత్రమే ! – చేతిలో పైకం లేకపోతేనేం – బుర్రలో ఆలోచనలకేం తక్కువ లేదు !–చిన్నతనం నుంచే లాల్ బహదూర్‌కు సూక్ష్మంగా, నేర్పుగా ఆలోచన చేసే శక్తి అలవడింది. పరిస్థితిని కూలంకషంగా పరిశీలించి దానికి తగ్గ పరిష్కారం ఆలోచన చేసేవాడు !– ఆయనకు హాకీ ఆట అంటే ఎంతో యిష్టం !–హాకీ కర్ర కొనుక్కోలేకపోయానే అని బాధపడుతూ క్రుంగిపోలేదు!– బుర్ర ఉపయోగించాడు–వంపుతిరిగి వున్న చెట్టుకొమ్మ నొకదానిని నరికి—దానిని చెక్కి హాకీ స్టిక్‌గా తయారు చేశాడు. అసలు హాకీ స్టిక్ కన్నా చక్కగా వుంది అది !– అలా వున్నవాటినే ఉపయోగించే చాకచక్యం లాల్ బహదూర్‌కు చిన్నప్పటినుంచీ వుంది ! –

ఆటలలో ఎంత ఉత్సాహంగా పాల్గొనేవారో, చదువులో అంతకు మరింతగా పాల్గొని అందర్లోకి ఫస్టనిపించుకునే వాడు ఆయన ! – ఆయనకు అంగ్లం-సాహిత్యం-చరిత్ర-యీ మూడు విషయాలపైన మక్కువ యెక్కువ ! – ఆయన ఆంగ్లభాషను అందరికన్న మిన్నగా, స్వచ్ఛంగా, స్పష్టంగా, అందంగా వుచ్చరించేవారు ! – స్కూళ్ళ యినస్పెక్టరుగా వచ్చిన దొరగారు లాల్‌బహదూర్ చదివిన యింగ్లీషు పాఠాన్ని విని ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బై పోయాడు. మనసారా అభినందించి, ఆశీర్వదించాడు.

కడు పేదరికంలో వున్నా కష్టపడడం అంటే లాల్ బహదూర్‌కు యెంతో యిష్టం ! – బాల్యమంతా కష్టాల్లోనే గడిపిన కష్ట జీవి ఆయన ! – ఆయన చదువుకొనే పాఠశాల " హరిశ్చంద్ర " – గంగానదికి ఆవలి ఒడ్డున వుండేది ! – రోజూ పడవ వానికి పైకమిచ్చి నదిని దాటాలంటే ఆయనవద్ద సొమ్ము వుండేది కాదు. సొమ్ము యీయకుండా వుచితంగా పడవ యెక్కడం ఆయనకు యిష్టంలేదు. అందుకని ఒక చేత్తో పుస్తకాలు పుచ్చుకుని గంగానదిని యీది ఆవలిఒడ్డు చేరి బడికి వెళ్ళేవాడు ! – చదువుపట్ల ఆయనకు గల శ్రద్ధ – పనిపట్ల ఆయనకు గల పట్టుదల-డబ్బు విషయంలో ఆయనకు గల అభిమానం – అలాంటివి ! – అయినా ఏనాడూ ఆయన తన పేదరికం గురించి ఆలోచించేవాడు కాడు ! –

ఒకసారి స్నేహితులతో ఒక తోటలోకి వెళ్ళినపుడు-తోటమాలి చేతికి చిక్కాడు. జరిగిన యదార్థం చెప్పిన లాల్‌బహదూర్‌ను ఆ తోటమాలి యెంతగానో మెచ్చుకుని-" నాయనా ! - నీవు చిన్నవాడివని, తండ్రిలేని వాడవని చెప్పావు - కాబట్టే మిగతావారి కన్నా యింకా జాగ్రతగా మసలుకోవాలి ! – తెలిసిందా ! – ఇలా దొంగతనంగా తోటల్లోకి ప్రవేశించకూడదు – " అంటూ హితబోధ చేశాడు. అంతే ! – అప్పటినుంచి లాల్‌బహదూర్ మరింత జాగ్రతగా వుండసాగాడు. తన జీవిత పంథానే మార్చుకొన్నాడు. తన గుణగణాలను పెంపు చేసికొన్నాడు.

లాల్‌బహదూర్ పదవ తరగతి పరీక్షలకు వెడుతుండగా గాంధీగారి విదేశీ చదువులు – వస్త్రాలు బహిష్కరించాలనే పిలుపు విన్నాడు – అంతే ! – పరీక్షలను కూడ లెక్క చేయకుండా – చదువు మానేసి గాంధీగారి అడుగుజాడల్లో నడిచాడు ! అదే ఆయన పట్టుదలకు, కార్యదీక్షకు నిదర్శనం ! – పాఠశాల వదిలివేసిన లాల్‌బహదూర్ భారత స్వాతంత్ర్య సమరంలో ప్రవేశించి భారతమాత బానిస సంకెళ్ళను బద్దలు కొట్టడంలో తన వంతు కర్తవ్యాన్ని తాను నిర్వర్తించాడు ! – అటు పిమ్మట అంచెలంచెలుగా అనేక పదవులను అలంకరించి-ఆఖరుగా భారతదేశ ప్రధానిగా పంతొమ్మిది నెలలు పరిపాలనచేసి, చరిత్రాత్మకమైన "తాష్కెంటు సంయుక్త ప్రకటన" పై సంతకంచేసి భారతదేశ కీర్తి ప్రతిష్ఠలను ప్రపంచాని కంతకూ చాటి చెప్పిన గొప్ప త్యాగమూర్తి, దేశభక్తుడు, కార్యదీక్షాపరుడు, కర్తవ్య నిష్ఠాగరిష్టుడు, కర్మయోగి, కష్టజీవి—1966 సంవత్సరము జనవరి నెల పదకొండున తాష్కెంటులో కన్నుమూశారు ! – ఆయన మరణించినా-ఆయన కీర్తి ప్రతిష్ఠలను భారతీయులు ఎన్నటికీ మరువలేరు.

# వర్తమాన కవిత్వమూ - స్వేచ్ఛా సమాజమూ

మాదిరాజు రంగారావు

**సాహిత్యంలో** సమాజమూ వ్యక్తీ ఒకదాని కొకటి పోషకంగా ఉన్నతికీ వికాసానికీ దోహదం చేసేవి. సమాజం లేంది వ్యక్తి వికాసం లేదు. వ్యక్తుల సమూహమే సమాజం. వ్యక్తులు లేంది సమాజమూ లేదు. వ్యక్తులు వస్తూ పోతుంటారు. నిజమే ! సమాజానికీ ఇది వర్తిస్తుంది. యాభై సంవత్సరాలక్రితం వున్న సమాజ స్వరూపం ఇప్పుడు లేదు. ఈ మార్పు ఒకప్పుడు నెమ్మదిగా అసలేం జరగనట్లూ వేగంగానూ జరుగుతూంటుంది. దీనికి చారిత్రక రాజకీయ మత సాంఘిక కారణాలనేకం. సమాజంలో వివిధ వలయాలూ అంతస్థులూ వుంటాయి. వ్యక్తులూ అనేక విధాలు. ఎవరి వ్యక్తిత్వం వారిదే. సామాజిక పరివర్తనంతో వ్యక్తుల్లో మార్పు వస్తుంది. వ్యక్తుల వికాసంతో సమాజం అభ్యున్నతీ పొందుతుంది. వ్యక్తుల విశిష్టతతో సమాజం ప్రత్యేకంగానూ నిలుస్తుంది. ఈ పరస్పరానుబంధం అనివార్యమూ, అభిలషణీయమూ.

ఆధునిక కవిత్వంలో సమాజం - వ్యక్తి ప్రమేయం విస్తారంగా దృష్టికి వస్తుంది. చారిత్రకంగా ఇది నిర్వహించే పాత్ర వ్యవస్థాగతమైన ఆదర్శాలూ అభిప్రాయాలూ, వ్యక్తిపరమైన ఆలోచనలూ కారణంగా ప్రాముఖ్యాన్ని వహిస్తోంది. సామాజిక భావన విస్మరించరానిదైనట్లే వ్యక్తి స్వరూపమూ మనస్తత్వ ధోరణీ పరిహరించరానిది. ఇవి రచనలో వివిధ నిష్పత్తుల్లో రూపొంది ప్రత్యేక రూపాన్ని పొందుతాయి. ఇది ఇట్లా వుంచి ఏ దేశమైనా ఏ సాహిత్యమైనా పరంపరగా వచ్చే సంస్కృతీ భావన ఒకటి వుంది. ఈనాటి జీవన వ్యవస్థలో నిరసనకు గురైన దురాచారాలూ, చెల్లని నియమాలూ అహేతుకమైన ధోరణులూ తీసివేస్తే సారభూతమైందీ సంస్కృతీ ప్రస్థానంలో శిఖరంగా నిలిచే సంప్రదాయ పరంపర వుంది. మార్పు పేరిట దీన్ని విస్మరిస్తే సంపూర్ణత లోపిస్తుంది. ఇది ప్రతి భాషా సాహిత్యానికీ వర్తిస్తుంది. ఇది జాతీయ స్థాయిలోనూ కొన్ని సందర్భాల్లో దీన్ని అధిగమించి విశ్వ భావనాత్మకంగానూ విలసిస్తుంది. ఆధునిక యుగంలో పరిణమించిన సమాజ స్వరూపంతో కవిత్వమూ, స్వాతంత్ర్యోద్యమం, పునరుజ్జీవనంతో ప్రవృత్తమై, స్వాతంత్ర్యం సిద్ధించాక ఆలోచనలో వ్యవస్థాగతమైన స్వేచ్ఛా సంచారంతో నిర్మితమైంది. వర్తమాన కవిత్వ స్థితీ, వ్యక్తి వికాసంపై దీని ప్రభావం వుంది. ఈ దృష్టితో, స్వాతంత్ర్యం పొందిన కాలం నుండీ ఆధునిక కవిత్వాన్ని ఒక భాగంగా తీసుకొని పరిశీలన జరపడం అన్ని విధాలా సమంజసమూ హేతుయుతమూ.

భారతదేశం స్వాతంత్ర్యం పొందాక రాజ్యాంగంలో ప్రజాస్వామ్య వ్యవస్థను అంగీకరించడంతో జాతీయ దృష్టీ సాంఘిక రాజకీయ ధోరణీ పరివర్తనకు లోనయ్యాయి. ఇది భారతదేశ చరిత్రలో అపూర్వమైంది. జాతి భవిష్యత్తును తీర్చే అసాధారణమైన మలుపు. చరిత్రలో సామాజిక రాజకీయ స్వరూపంతోపాటు సాహిత్యమూ మారిన విలువలతో, ఎదురైన కొత్త పరిస్థితుల్లో అంతర్జాతీయ ప్రభావానికీ గురైంది. సామ్యవాద సిద్ధాంతమూ ప్రబలంగా పనిచేసింది. ముఖ్యంగా అభివృద్ధి చెందుతూన్న దేశాల్లో దీని ఆకర్షణ విపరీతంగానూ వుంది.

## సంక్రాంతి సంబరాలు

సంక్రాంతి పండక్కి సంబరాలెన్నో,
సందళ్ళు, సరదాలు సయ్యాటలెన్నో.

సాతాని పాడితే సంక్రాంతి మొదలు,
గంగిరెద్దాడితే పొంగళ్ళు మొదలు.

ముత్యాల ముగ్గులతొ ముంగిళ్ళు మెఱయు,
కొలువుండి ఆ వడుమ గొబ్బిళ్ళు మురియు.

బంతి చేమంతులతొ వాకిళ్ళు వెలుగు,
పుట్టింట పడుచులతొ నట్టిళ్ళు వెలుగు.

పాతాళమందుండి బలిదాత వచ్చు,
పంట కళ్ళము నుండి మహాలక్ష్మి వచ్చు.

బరిమీద పుంజులకు పౌరుషము పెఱుగు,
పంతాలు, పందేలు ప్రజలలో పెఱుగు.

బావలూ, మరదళ్ళ పరియాచకాలు,
వీనులకు విందైన వింత పాకాలు.

సంక్రాంతి పండుగదె సౌభాగ్యమంతా,
అపురూపమైన దా అనుభవమ్మంతా.

- కస్తూరి నరసింహమూర్తి

ప్రజాస్వామ్య వ్యవస్థలో లభించిన అవకాశాలనుబట్టి వివిధాభిప్రాయాలూ సిద్ధాంతాలూ వివిధ లక్ష్యాలతో కవితా ప్రపంచంలోనూ ప్రచలితం కావడం జరిగింది. జాతి అంగీకరించిన వ్యవస్థలోని స్వేచ్ఛా వాతావరణమే ఈ వైవిధ్యానికి కారణమైంది. ప్రజాస్వామ్యంవల్ల సిద్ధించే ఉత్తమ ప్రయోజనాల్లో ఇదొకటి. ఈనాటి సమాజంలో వున్న పరిస్థితులకు ప్రతిరూపంగా కవిత్వమూ వివిధ భావ ధోరణులతో కన్పిస్తుంది. రామాయణ కల్పవృక్షం పూర్తియింది. మహాసర్గ అవతరించింది. మరో మహా ప్రస్థానం, ఖడ్గ సృష్టి ప్రభవించాయి. వందే మాతరం నినదించింది. పునర్నవం ఆవిష్కృతమైంది. విశ్వంభర ఉదయించింది. దిగంబరం-చేతనావర్తం - విప్లవం ఇట్లా అనేకం-భావావేశం లక్ష్య శుద్ధితో తెలుగులో కవిత్వం స్వేచ్ఛా వాయువుల్ని పీలుస్తోంది. జాతీయ భావన, సంస్కరణం పరివర్తనం ప్రజాస్వామ్యం సామ్య వాదం విప్లవం సంప్రదాయ పరంపరా పార్శ్వాలతో గోచరిస్తుంది. వీటిలో ఒక్కొక్క రచయిత వ్యక్తిత్వంలో ఒక్కొక్కటి ఆధిక్యం వహిస్తూ, లేదా కొన్నిటి కలయిక చేత విశిష్ట రూపాన్ని పొందుతూ పరిశీలనలో గోచరిస్తాయి. వీటితోపాటు చేర్చవలసింది మరొకటి వుంది మన తత్వ ధోరణి. రచయితలో అంతర్నిహితమై చేతనలో నుండి రచనపై ప్రభావాన్ని నెరపేది, మన తత్త్వ పరిశీలనం ఇటీవలిది కావడం, శాస్త్రంతో ఎక్కువ పరిచయం లేకపోవడంవల్ల దీన్ని గురించి ఆలోచన జరగవలసినంతగా జరగడంలేదు. సృజనాత్మక సాహిత్యంలో ముఖ్యంగా కవిత్వంలో ఇది నిర్వహించే పాత్ర అమూల్యమైంది. ఇకపోతే విశ్వజనీనత, మానవతా లక్షణం ఎప్పుడూ వుండనే వున్నవి. పురోగమన తిరోగమన యథాస్థితి సంస్కరణ పరివర్తన విప్లవ సాహిత్యాల్లో ఇది అపరిహరణీయమైంది ఐనప్పటికీ ఇది ఇటీవల పురోగమన హేతుదృష్టితో ఒక సిద్ధాంతంగా రచయితలను ఎంతగానో ఆకర్షించింది. ఏ స్థాయిలో ఏ ఆదర్శంతో చర్య ప్రతిచర్యలతో సంబద్ధమైనప్పటికీ మానవ జీవితం నైతికమైన తాత్త్వికమైన విలువలతో ఆర్ద్రిత ఉదార భావనతో రచన ప్రసారితం కావాలనే అపేక్ష సహజం, వాస్తవ తలంపై ఎంతో వైవిధ్యం కలిగింది.

మానవ జీవితంపై పరిసరాల ప్రభావం తప్పనిసరి. అందువల్ల పరిసరాలు ఆరోగ్యవంతంగా వుండవలసిన అవసరమూ వుంది. ఇది గుణాత్మకమైన స్థితికి ఎంతో

దోహదం చేస్తుంది. చారిత్రకంగా ఆలోచిస్తే వివిధ ధోరణులు ఉత్తమ లక్ష్యాలతోనే వచ్చాయి. ఎప్పటి కపుడు సమాజంలో ఏర్పడే నిష్క్రియతనూ కాలుష్యాన్నీ పోగొట్టి బంధనల్ని ఛేదించి చైతన్యవంతం చేసే ప్రయత్నం జరుగుతుంది. స్వేచ్ఛా వ్యవస్థ, వివిధ భావ ప్రసారాలకు దోహదం చేస్తుందనడంలో సందేహంలేదు. ఏ భావ ప్రసారానికీ లోను కాకుండా, ఏ రచయిత దూరంగా వుండలేడు. అట్లా అయితే వ్యక్తిత్వానికి సంపూర్ణత చేకూరదు. చారిత్రక పరిణామంలో సందర్భోచితినీ కోల్పోతుంది. ఇప్పుడే కాదు మునుముందూ జీవితంలో ఏర్పడే అనుచితమైన స్థితులనుండీ, బంధనాల నుండీ విముక్తంచేసే ప్రయత్నం జరుగుతూనే వుంటుంది. అరాజక స్థితికీ గందరగోళానికీ భయావహ మృత్యు స్థితికీ దారితీసే విధ్వంసక ధోరణి ఏ మాత్రమూ ఏ ఆదర్శంతోనో సమర్థనీయం కాదు.

ఈనాడు మన చుట్టూ నెలకొనివున్న సమాజం నిస్సందేహంగా కొత్త ప్రపంచం. స్వాతంత్ర్యానికి పూర్వ స్థితికీ నేటి స్థితికీ ఏ విధంగానూ పోలిక లేదు. జీవితాన్ని సంపన్నంచేసే సౌభాగ్యమయంచేసే శాస్త్ర సాంకేతిక పారిశ్రామిక పురోగతి సంస్కృతీపరమైన గొప్ప విలువల స్థితికి ఏ విధంగానూ విరుద్ధం కాదు. పైగా జీవితంలో గుణాత్మకమైన మార్పుకు దారితీసే ఆలోచనా శక్తుల్ని కళాత్మక ధోరణుల్నీ ఆధునికతో ప్రకాశవంతం చేస్తుంది. దీనికి భిన్నంగా స్వేచ్ఛలేని వ్యవస్థలో వ్యక్తి ఆలోచననూ, అభిప్రాయాన్నీ అరికట్టే నిరంకుశ ధోరణులు సృజనశక్తిని వికసింపనీయవు. వివిధ స్థాయిల్లో వ్యక్తిత్వాన్ని కుంఠితం చేస్తుంది. సామాజికమైన పరిపూర్ణతను ఖండితం చేస్తుంది. మానవుని సంపూర్ణమైన అభివృద్ధికీ సమాజ వికాసానికీ వివిధ భావ ప్రసారానికీ వేదికయైన ప్రజాస్వామ్య విధానం ఒక్కటే అభిలషణీయమూ, అనుసరణీయమూ ఐంది.

కవిత్వం ఎటువంటి జీవిత వాస్తవ దృశ్యాల నుండి ప్రయాణం చేసినా, అభిప్రాయాల వివరణం ప్రకటనం, ఆవిష్కారం మాత్రమే కవిత్వం అవదు. ఇవి కవిత్వం రూపం పొందడానికి అర్హమైన కళాత్మకతను కనీస స్థాయిలో అవలంబించవలసి ఉంటుంది. స్వేచ్ఛా సమాజంలో వెలువడుతూన్న నేటి కవిత్వాన్ని విశాలమైన అవగాహనతో ఈ దృష్టితో సమాలోచనం జరుపవలసి ఉంది. అప్పుడు కాని చారిత్రక సంప్రదాయ రాజకీయ సాంఘిక మనస్తత్వ ప్రభావ శక్తుల ప్రత్యేకతలు గుర్తింపబడి కవిత్వంలోని మౌలికత, విశిష్టత, అనుభవానికి రాదు. సౌభాగ్యం కుసుమించే సామాజిక చేతనతో ఆలోచన అన్వేషణ అనుభవం పరివర్తనతో "గమ్యమై స్వేచ్ఛా సమ సమాజం, రానీ కొత్త యుగం వాస్తవమై" ★

## తల్లిపాలు-డబ్బాపాలు

పాఠశాలలో ఉపాధ్యాయులు సమర్థవంతమైన బోధనా శక్తి, శ్రద్ధ, పట్టుదల కలిగి వుండి, వున్నత విద్యా ప్రమాణాలుగల విద్యార్థులను తయారు చేసిననాడు ప్రయివేటు ట్యూషన్లు, గైడ్లు యొక్క ఆవశ్యకత వుండదు. పాఠ్యపుస్తకం 'తల్లిపాలు' అయితే, గైడు 'డబ్బా పాలు'. తల్లి ఏ విధంగా తన పిల్లలను తీర్చిదిద్దడానికి ఎంత శ్రమిస్తుందో, ఆదేవిధంగా, పాఠశాలలోని ఉపాధ్యాయులు బాలబాలికలను సక్రమ మార్గాన పెట్టడానికి శ్రమించగలిగిననాడు, పిల్లలు పాఠశాలలోని ఉపాధ్యాయులను తల్లులుగాను, ప్రయివేటు చెప్పే మాష్టర్లను సవతి తల్లులుగా భావిస్తారు. గైడ్స్ పరీక్షలలో ఉత్తీర్ణులవడానికి మాత్రమే ఉపయోగపడుతాయి. పాఠ్యపుస్తకాలు విద్యార్థుల Standards పెంచుతాయి. ఆదే విధంగా డబ్బా పాలు పిల్లల ఆకలిని మాత్రం తీరుస్తాయి, తల్లిపాలు మాత్రం పిల్లలకు శక్తిని యిస్తాయి, ఆరోగ్యాన్ని పెంచుతాయి.

# కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని

భగవాన్ శ్రీ రమణమహర్షి అంతటి పుణ్య పురుషుని చే ఆదర పూర్వకంగా 'నాయన' అనే పిలుపు నందుకున్న కావ్య కంఠ వాసిష్ఠ గణపతిముని కారణ జన్ములు కావడంలో వింత ఏముంటుంది ? అంతవరకు అయ్యల సోమయాజుల గణపతి శాస్త్రి అని వ్యవహృతుడవుతూ వచ్చిన కావ్య కంఠునికి 'నాయన' అనే పేరు ప్రచుర ప్రచారం లోకి వచ్చింది. అలాగే అంతవరకూ 'మౌన స్వామి' అని వ్యవహరించ బడుతూ వుండిన ఆ పుణ్య పురుషునికి 'రమణ' అనే వ్యవహార నామం వాడుకలోకి వచ్చింది. రమణ నామాన్ని తొలుదొలుత ఉచ్చరించిన మహనీయుడు కావ్యకంఠుడే. ఓం ప్రథమంగా ఈ రెండు పేర్లూ ప్రతిధ్వనించిన పవిత్ర స్థలం తమిళనాడుకి చెందిన తిరువణ్ణామలై లోని అరుణాచలం మీది విరూపాక్ష గుహ. ఆ సుదినం 1907, నవంబరు 18. పరమాద్భుతమైన ఆ సన్నివేశం గురించి తెలుసుకోవడం అవసరం.

డా॥ చల్లా రాధాకృష్ణ శర్మ

తపోయాత్రలు చేసి చివరకి తిరువణ్ణామలై చేరుకొన్నారు కావ్య కంఠులు. స్వామిని దర్శించారు. తపస్స్వాధన స్వరూపాన్ని తెలియజేయవలసిందిగా ఆయన్ని అర్థించారు. స్వామి మౌనం వహించారు; కాని ఆయన చల్లని చూపు శిష్యుని మీద ప్రసరించింది. ఆ తర్వాత స్వామి దివ్యవాణి వినిపించింది. 'నేను నేను అనేది ఎక్కడ పుడుతున్నదో బాగా గమనిస్తే అది పుట్టే చోటనే లీనమవుతోంది. అదే తపస్సు'. కురిసిన వానకు ఎండిపోతున్న పంట చేను తేరుకున్నట్టుగా, సదుత్తరం కోసం తపించి పోతున్న కావ్యకంఠుని హృదయం సంతృప్తి చెందింది.

రామకృష్ణ పరమహంసకూ వివేకానందస్వామికీ మధ్య ఎంత గాఢమైన సంబంధం వున్నదో, భగవాన్ రమణమహర్షికీ నాయనకూ మధ్య అటువంటి సంబంధం ఉన్నదనటం సత్య సన్నిహితం. గురువులోని విశిష్టతను నలుగురికీ తెలియజేసిన ఘనత వివేకానందుడికి చెందినట్లే, రమణ మహర్షి ఉపదేశామృతాన్ని నలుగురికీ పంచిపెట్టిన చిరయశస్సు నాయనకు చెందుతుంది.

ఈ సందర్భంలో నాయన రచించిన రమణ గీత సంభావ్యం. రచనా విధానంలో నైతేనేమి, గ్రంథ పరిమాణంలో నైతేనేమి ఇది భగవద్గీతకు సాటి వచ్చే రచన అని విజ్ఞుల అభిప్రాయం. రమణ భగవానుని వాణి నుంచి వెలువడిన కారణంగా దీన్ని కూడా భగవద్గీత అనవచ్చు. అయితే ఇందులో పృచ్ఛకులు పలువురు; ఉపదేశించే వాడు మాత్రం ఒక్కడు. బ్రహ్మ సూత్ర వివరణ కూడా ఇందులో చేయబడింది.

కాని చిత్ర మేమిటంటే రమణ, నాయనల మధ్య గురు శిష్య భావం నెలకొన్నా వారి మధ్య సోదర భావం వున్నట్లు తెలియ వస్తుంది. ఇందుకు సాక్ష్యం నాయన వ్రాసిన లేఖలే. ఆయన రమణ మహర్షిని విశ్వగురువనీ, పారాశర్యుడనీ, కారణ గురువనీ–ఇలా సంబోధించినా, ఉత్తరం అడుగున తనకు జన్మాంతర సోదరుడనీ, మీ వాడనీ, చిరకాల భక్తుడనీ వర్ణించుకున్నాడు. వారిద్దరూ కలిసి వున్న ఛాయా చిత్రాల్ని చూసినా, ఈ సంగతి స్పష్టమవుతుంది. ఇలా గురు శిష్య సంబంధంతో పాటు సోదర భావం కూడా నెలకొని వుండడం ఒక అపూర్వ విషయంగా భావించవచ్చు.

నిజానికి నాయన విశిష్ట చరిత్రుడు. ఆయన సిద్ధ పురుషుడు. మంత్రవేత్త. శాస్త్రాంబుధిని ఆపోశనం పట్టిన అపర అగస్త్యుడు. కావ్య కంఠుడు. రూపుదాల్చిన

కవిత. బహు గ్రంథకర్త. వశ్యవాక్కు. ఎంత సనాతనుడో అంత నవీనుడు. స్త్రీ స్వాతంత్ర్యమును ఆయన అభిలషించారు. అంటరానితనమును ఖండించారు. ఆ విషయమై ప్రసంగాలు కావించారు. 1925 లో జరిగిన హరిజన మహాసభలకు అధ్యక్షత వహించారు. కొంతకాలం కాంగ్రెసు సభ్యులుగా ఉండినారు.

ఇలా బహుముఖమైన ప్రతిభ ప్రదర్శించిన నాయన ప్రభవించి నూరేళ్ళు పైబడ్డాయి. 1878, నవంబరు 17 న ఆయన బొబ్బిలికి దగ్గరలో వున్న లోగీశ అగ్రహారంలో జన్మించారు. తండ్రి నరసింహశాస్త్రి, తల్లి నరసమాంబ. ఆ దంపతులు ఆయనకి పెట్టిన పేరు సూర్యగణపతిశాస్త్రి. కాలక్రమాన ఆ పేరులోంచి సూర్య శబ్దం లోపించింది. వైదిక ఋషులవలె ఆయన గోత్రనామం స్వీకరించారు. అందువల్ల ఇంటిపేరు లోపించింది. ఆయన తపోవృత్తిని చూసి ముని అని వ్యవహరించసాగారు. అప్పుడు వాసిష్ఠ గణపతి ముని అయ్యారు. చివరికి రమణమహర్షి పెట్టిన ' నాయన ' పేరు ప్రచుర ప్రచారంలోకి వచ్చింది.

గణపతి ముని సహజ కవి. బాలారిష్టములకు తరుచు గురిఅవుతూ వచ్చినా, ఆయన చాలా చిన్నతనంలోనే సంస్కృత కావ్యాలు అధ్యయనం చేశారు. అది ఆయన మేధకి తార్కాణ. పదోయేట ' పాండవ ధార్తరాష్ట్రి సంభవం ' అనే 33 శ్లోకాల ఖండకావ్యం చెప్పారు. అది కూడా ఒకే ఒక గంటలో చెప్పడం, ఆయన కవితాశక్తికి ప్రబల నిదర్శనం. ఆ తర్వాత ఒక గంటలో 62 శ్లోకాలతో మరో ఖండకావ్యం చెప్పారు. దానిపేరు " సుకన్యా సంవాదం ". జ్యోతిష శాస్త్రంలోనూ ఆశ్చర్యావహమైన పాండిత్యం గడించారు.

పెక్కు స్తోత్రములూ, సూత్ర గ్రంథములూ వెలయించిన గణపతి ముని రచనలలో "ఉమా సహస్రం" తలమానికం అనవచ్చు. ఇది వెయ్యి శ్లోకాల ఉద్గ్రంథం, అలాగే ఇంద్రాణి సప్తశతి ( 700 శ్లోకాలు ) కూడా ఆయన రచనావళిలో పేర్కొనదగింది. రమణమహర్షి అనుగ్రహపాత్రులైన నాయన ఇలా ఎన్నో రచనలు



చేయడం ఒక విశేషంగా కనిపించకపోవచ్చు. అయినా ఉమాసహస్రాన్ని 20 రోజులలో పూర్తిచేయడం ఆయన దీక్షకూ, పాండిత్యానికి ఒక మంచి ఉదాహరణ. రచనా వ్యాసంగంతో పాటు ఆయన తపోయాత్రలు చేశారు. ఉపాధ్యాయ వృత్తి కూడా కొంతకాలం నిర్వహించారు.

1901 వ సంవత్సరం గణపతి ముని జీవితచరిత్రలోనే కాక తెలుగువారి సాంస్కృతిక చరిత్రలోనూ విశిష్టమైనదని నా అభిప్రాయం. తన అసాధారణమైన కవిత్వంతో విశాఖపట్టణ ప్రదేశాంతర్గత కలువరాయి గ్రామ నివాసి అయిన గణపతి శాస్త్రి నవద్వీప వాసులైన పండితుల్ని మెప్పించి వారి ఆదరాభిమానములతో పాటు ' కావ్యకంఠ ' అనే గొప్ప బిరుదును పొందిన సంవత్సరమది. అనగా సంస్కృత భాషా సాహిత్యాలలో తెలుగువారి ప్రతిభను దిగ్దంతులవంటి పండితులు జోహారులు అర్పించిన సంవత్సర మది ! ఒక తెలుగు బిడ్డ అఖిలభారత స్థాయిలో ఎనలేని కీర్తి గడించడం అందరికీ గర్వకారణం. అప్పటికి పట్టుమని పాతికేళ్ళయినా లేని యువకుడు గణపతి !

గణపతి ముని నవీనుడని చెప్పడానికి ఆయన 1927, ఫిబ్రవరిలో హైదరాబాదు లోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయ రజతోత్సవ సందర్భంలో చేసిన అధ్యక్షోప న్యాసం ప్రబల నిదర్శనం. అమూల్యము లనదగిన విషయాలతో నిండి వున్న ఆ ఉపన్యాసం అవశ్య పఠ నీయం. ఇది వచన యుగమనీ, పద్య రచనల కంటె వచన రచనలే ఎక్కువగా వెలువడ వలసిన అవసరం ఎంతైనా ఉన్నదనీ, నవలలు కూడా సంతరించ బడాలనీ నాయన సహేతుకంగా పేర్కొన్నారు. శాస్త్ర గ్రంథాల ఆవశ్యకతను కూడా ఆయన విశదీకరించారు. ఈ సంద ర్భంలో ఆయన మాటలనే ఉదాహరించడం సముచితం.

"ఆంధ్ర భారతిని సేవించుచున్న కవులకు నేనొక సూచన చేయుచున్నాను. పద్య గ్రంథముల కంటె వచన గ్రంథములను నిర్మించుట యందు వారెక్కువ పరిశ్రమను దీసికొనవలెను .... పద్య గ్రంథములను మంచి వ్యుత్పన్నులే తప్ప సామాన్య జను లర్థము చేసి కొన జాలరు. సులభ శైలి గల వచన గ్రంథములే సర్వ జనోప యుక్తములై యుండును .... "

"నిదానించి వ్రాయు నెడల మన యాంధ్ర కవులు మంచి నవలలను వ్రాయగలుగుదు రను విశ్వాసము నాకు గలదు."

ఆధునిక వాఙ్మయం ఎలా అభివృద్ధి చెందాలో సూచిం చిన గణపతి ముని సంస్కృతంలో 'పూర్ణ' అనే నవలను రచించి ఆ సాహిత్యానికి నవ్యతను చేకూర్చారు. సంస్కృత పండితులు కేవలం సంప్రదాయ విధేయులనే వాదానికి అప వాదం కల్పించారు. ఆయన సంస్కృతంలో అవధానాలు చేసి సహృదయ లోకంలో ఆ భాష పట్ల ఆదరభావాన్ని ఇనుమడింప జేశారు.

పౌరాణిక మత ప్రభావం నుంచి భారతీయులు బయట పడాలన్నది గణపతి ముని అభిప్రాయం. ఈ పురాణ గాథల వల్ల వేద సమ్మతములైన అభిప్రాయాలు కొన్ని మరుగుపడినవని ఆయన నమ్మకం. ఉదాహరణానికి వేదంలో ఇంద్రుడు త్రిలోక సార్వభౌముడు. కాని పురాణాలలో వర్ణించబడిన ఇంద్రుడంటే మనకు కలగ వలసినంత ఆదర భావం కలగదు. అలాగే వైదిక ఋషులు చేసిన యజ్ఞాలకూ ఆ తర్వాత కర్మకాండ ప్రబ లిన యజ్ఞాలకూ భేదం ఉంది. ఈ విషయాదికాన్ని గుర్తించిన గణపతి ముని వేదసమ్మతమైన మతమును పునరుద్ధరించాలన్న పరమాశయంతో ఇంద్ర సహస్రనామ స్తోత్రం వంటి పెక్కు స్తోత్ర రచనలు చేశారు. ఈ స్తోత్రాలలో నామావళికే ఎక్కువ ప్రాధాన్యం. కావ్య కంఠుని రచనలలోనూ ఈ గుణం కనిపిస్తున్నా, కొన్ని స్తోత్రాలలో ఆయన హృదయావేదన స్పష్టంగా కనిపిస్తుంది. భారత దేశానికి పట్టిన దుర్దశ (పారతంత్ర్యం)తొలగి పోవాలని ఆయన ఆ జగన్మాతను స్తుతించిన తీరు పరికించండి.

'హతంచ విహతం ధుతంచ విధుతం
రుదంత మఖవో విశిష్ట కరుణే
ఇమం స్వవిషయం శివం గమయతుం
తవాంబ ! చరణం వ్రజామి శరణమ్'

దెబ్బలు తిని, అణిగి, చెదిరి, కలత చెంది, దిక్కు లేనిదై విలపిస్తున్న నా భారతదేశానికి శుభస్థితి కలిగించాలని, జననీ ! నీ చరణమును శరణు పొందుతున్నాను - అని దీని భావం.

ప్రబుద్ధ భారత దేశాన్ని ఆశించినట్లుగానే నాయన స్త్రీ స్వాతంత్ర్యాన్ని కూడా ఆశించారు. ఆయన హృదయం భక్తి భావానికే కాక జాతీయాభిమానానికి కూడా ఆలవాలం.

మహా తపస్విగా, సంచార సంస్కృత సాహిత్యంగా వర్ధిల్లిన గణపతి ముని తమ చివరి దశలో స్వగ్రామ మయిన కలవరాయి చేరుకున్నారు. ఆశ్రమం కూడా నిర్మితమయింది. కాని అందులో ఉండలేదు. అక్కడి నుంచి ఖరగ్‌పూర్ వెళ్ళారు. అక్కడే నాయన తమ భౌతిక శరీరం విసర్జించారు. అది 1936, జూలై 25.

నాయన మరణవార్త రమణ మహర్షి అంతటి దృఢ చిత్తుని కూడా కలచి వేసింది. అశ్రుపూరిత నయనాలతో "నాయన వంటి మరొక వ్యక్తిని మనం ఇంకెక్కడ చూడగలుగుతాము" అని మహర్షి పేర్కొన్నారు. గణపతి మునిని బహు విధాలుగా ప్రశంసించవచ్చు. కాని దీన్ని మించిన ప్రశంస మరొకటి ఉండబోదు.

కావ్య కంఠుని శిష్య ప్రశిష్యులు పలువురు తెలుగు, తమిళ నాడులలో కనిపిస్తారు. అద్భుత సన్నివేశాలతో కూడిన ఆ మహనీయుని జీవిత చరిత్రను తొలుత శ్రీ కపాలి శాస్త్రి సంస్కృతంలో వ్రాశారు. ఈ గ్రంథ నామం వాసిష్ఠ వైభవం. ఆ తర్వాత ఎంతో పరిశ్రమించి ఎన్నో వివరాలు సేకరించి శ్రీ గుంటూరు లక్ష్మీకాంతం 'నాయన' అనే పేరుతో సుమారు 800 పుటల బృహద్గ్రంథం వ్రాశారు. తెలుగులో వెలసిన జీవిత చరిత్రలలో ఇది ఒక ప్రశస్త రచన అనటం అతిశయోక్తి కాదు. నాయనను గురించి శ్రీ యామిజాల పద్మనాభ స్వామి కొన్ని వ్యాసాలు సంతరించారు. నాయన జీవిత చరిత్రను వివరిస్తూను, ఆయన కవితా వైభవం వివరిస్తూను అభిజ్ఞులు ఆంగ్లంలో వ్యాసాలు ప్రకటించారు. ఆంగ్లంలో అయన జీవిత చరిత్రను ప్రచురించాలనే ప్రయత్నమూ జరుగుతోంది. ఇలా కావ్య కంఠుని బహు ముఖ వ్యక్తిత్వాన్ని అభివర్ణించే రచనలు వెలువడడం అవసరం. అప్పుడే ఆ మహనీయుని ప్రతిభ నలుగురికీ తేటతెల్లం అవుతుంది. ఇంతకూ కావ్యకంఠ శ్రీ వాసిష్ఠ గణపతిముని కారణ జన్ములు! వేద ఋషుల భక్తి తత్వాన్ని పునరుద్ధరించేందుకూ, సంస్కృత సాహిత్యాన్ని సుసంపన్నం చేసేందుకూ ఆ మహనీయుడు తమ జీవితాన్ని మీదు కట్టారు. ★

---

# అమృతంగమయ

ఇదేనా మహాత్ములు ప్రభవించిన పుణ్యభూమి ?
ఇదేనా వేదనాదాలు విన్పించిన ఋషివాటి ?
ఇదేనా 'అహింసా పరమో ధర్మః' అని
ప్రబోధించిన నేల ?
ఇదేనా 'ధర్మో రక్షతి రక్షితః' అని సందేశించిన
ధాత్రి ?

మరి -
ఎక్కడిదీ కాళరాత్రి ?
ఎక్కడిదీ హింసోన్మాదం ?
ఎక్కడిదీ అనాగరికత ?
ఎక్కడిదీ పైశాచికత ?
సురులు అసురులైనారా ?
మానవతా శిఖరాలెక్కవలసినవారు
పాతాళంలోకి పతనమౌతున్నారా ?
ఎందుకీ స్వ పర భేదాలు ?
ఏమిటీ వితండ వాదాలు ?
ఏల ఈ విష ప్రయోగాలు ?
ఎందుకీ రక్త పాతాలు ?

ఓ భగవాన్ !
నా వాళ్ళ గుండెల్లో దీపాల్ని వెలిగించు
నా వాళ్ళకు సమైక్యతాపథం చూపించు
నా జాతికి 'భారతీయత'ని ప్రబోధించు
నా జనతను ప్రగతిలోకి నడిపించు
ఈ తిమిరాలు తొలగాలి
నా భారతం వెలుగులోకి పయనించాలి
ఈ వాదాలు పోవాలి
నా భారతం
విశ్వానికి మానవతా సందేశం విన్పించాలి
ఈ భయద శిశిరాలు పోవాలి
నా భారతం
నవ వసంతంతో నా కవనంలా శోభించాలి
ఈ కాళరాత్రి తొలగాలి
నా భారతం
సూర్యోదయంతో సుందర శతపత్రంలా
వికసించాలి
'మృత్యోర్మా అమృతంగమయ' !

– తిరునగరి

"భాయి — ఈ ఉద్యోగం చేయడం శుద్ధ దండుగ. దీనికి ఎదుగూ లేదు, బొదుగూ లేదు. ఈ ఉద్యోగాన్ని, ఈ దేశాన్ని వదిలి పెడ్తేనే కాని మనం బాగుపడం" అంటూ అందుకున్నాడు నసీరుద్దీన్ అప్పుడే వచ్చిన ఉత్తరం చదివి మడత పెట్టూ.

"ఏమిటి భాయి... ప్రొద్దున్నే అన్నం తినకుండా వచ్చావా? మీ ఆవిడతో పోట్లాడి వచ్చావా? కరకరలాడుతున్నావు. ఈ ఉద్యోగమైతే బాగా లేదనుకో నేనూ ఒప్పుకుంటాను. కానీ ఈ దేశం ఏం పాపం చేసిందంట?" అన్నాడు అతని కోక్లర్కు నర్సింగరావు.

# ఎండమావులు

కె.ఆర్.కె.మోహన్



"అవును భాయి. నిజమే అంటున్నాను. మనం చేస్తున్న ఈ-ఉద్యోగానికి, ఇదే దుబాయిలో అయితేనా ఎంతిస్తారో తెలుసా? అదృష్టమంటే వాళ్ళది." అన్నాడు నసీరుద్దీన్ నిట్టూరుస్తూ.

"అవుననుకో. ఇక్కడి కంటె ఏ నాలుగైదు రెట్లో ఎక్కువ ఇయ్యవచ్చు. అంతమాత్రాన మాతృదేశాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోవడమేనా?" అన్నాడు నర్సింగరావు.

"వెళ్ళిపోవడం ఎందుకు భాయి. ఇక్కడ సంవత్సరం అంతా కష్టపడితే మనకి ఆరువేల రూపాయలు అన్నీ పోను రావడం గగనమవుతోంది. అదే అక్కడయితేనో ఇదే పనికి సంవత్సరానికి కనీసం యాభై వేలు ఇస్తారు. మనం రెండుచేతులా సంపాదించవచ్చు. ఇంటికి కావలసినంత పంపుకోనూవచ్చు. ఇష్టమున్నవాళ్ళు ఉద్యోగంచేసి వద్దనుకున్నప్పుడు తిరిగి వచ్చేయవచ్చు" అన్నాడు నసీరుద్దీన్.

నసీరుద్దీన్ అపర స్వర్గాన్ని ఊహించుకుంటూ, తన్మయత్వంతో కళ్ళు మూసుకున్నాడు.

"ఏం-ఆ దేశాల్లో అంత ఎక్కువగా జీతాలిస్తారా? పైగా అందరికీ ఇస్తారా?" అన్నాడు నర్సింగరావు ఆశగా.

"అవును భాయి. ఈ ఇరాన్, కువైట్, దుబాయి, అరేబియా వంటి మధ్య ప్రాచ్య దేశాలలో, విపరీతంగా పెట్రోలు దొరుకుతుంది. నేల త్రవ్వితే నీరు దొరక్కపోవచ్చుకాని, పెట్రోలు మాత్రం బాగా దొరుకుతుంది ఈ దేశాలలో. దాంతో ఈ దేశాల వాళ్ళు కుబేరులై పోయారు. అయితే ఇక్కడి వాళ్ళకి డబ్బుందేకాని చదువు తక్కువ, తెలివీ తక్కువ. అందువల్ల ప్రతిదానికీ ఇతర దేశాలమీద ఆధారపడుతుంటారు. మన దేశం

వాళ్ళంటే వీళ్ళకి మంచి నమ్మకం, గౌరవమూను. అందువల్ల ఇతర దేశాలవాళ్ళ కంటె మన దేశం వాళ్ళంటే వాళ్ళు ప్రత్యేక ఆసక్తిని కనబరుస్తారు. తెలిసినవాళ్ళ మాట అట్టేపెట్టు. మా బంధువులలోనే అక్కడ ఎంద రున్నారో! అందరూ మంచి పదవుల్లో వుండి, రెండు చేతులా సంపాదిస్తున్నారు." అంటూ ఒక్క బిగిన చెప్పసాగాడు నసీరుద్దీన్.

"అంతా బాగానే వుంది కాని మనకి అక్కడ ఉద్యోగాలు దొరకొద్దూ. మనమేమైనా పెద్ద చదువులు చదివేడిశాం కనుకనా. అవన్నీ అదృష్టవంతులకి. మనబోటి వాళ్ళకి కాదు" అన్నాడు నర్సింగరావు.

"అక్కడికి పోడానికి పెద్ద చదువులే అవసరంలేదు. వాళ్ళకి ఇల్లుకట్టే తాపీమేస్త్రీ దగ్గర్నుంచి ఇంజనీర్ వరకు అందరూ కావాలి మామూలు గుమాస్తాలూ కావాలి. ఆఫీసర్లూ కావాలి. మెకానిక్కులూ కావాలి. మెషినిస్టులూ కావాలి. ఇంతెందుకు - ఎవరికి సరిపడే ఉద్యోగాలు వాళ్ళకి దొరుకుతాయి." అన్నాడు నసీరుద్దీన్.

"ఇంకేం....ఈ గొర్రెతోక ఉద్యోగం పట్టుకుని వ్రేలాడే కంటె, అక్కడికి వెళ్ళిపోడం మంచిది కదా!" అన్నాడు నర్సింగరావు.

"నేనైతే వెళ్ళిపోవాలనే నిశ్చయించుకున్నాను. మా శ్రీమతిని కూడా ఒప్పించేసి, మా వాళ్ళకి ఉత్తరం వ్రాస్తాను. ఏమి నువ్వు కూడా వస్తావా? నీకు కూడా చూడమని వ్రాస్తాను! అన్నాడు నసీరుద్దీన్."

"నువ్వు చెప్పిందంతా నిజమే కావచ్చు కాదనను. కాని దూరపు కొండలు నునుపయి, అక్కడికివెళ్ళి చూస్తేనే కాని అసలు సంగతి తెలీదు. ఎల్లాగూ నువ్వెళ్ళదలుచు కున్నావు కదా. నువ్వెళ్ళి బాగుంటే వ్రాయి. తప్పక నేనూ వస్తాను." అన్నాడు నర్సింగరావు.

"అంతే భాయి. నేనూ నీలాగే, ఇన్నాళ్ళూ వెనక ముందాడుతూ ఆలస్యం చేశాను. నాలుగేళ్ళ క్రితమే రమ్మని మా బావమరిది బలవంతం చేశాడు. అప్పుడే వెళ్ళుంటే ఈపాటికి పిల్లజమీందార్‌ని అయివుండేవాడిని" అన్నాడు నసీరుద్దీన్.

"ఎనీవే విష్ యు బెస్ట్ ఆఫ్ లక్ ఇన్ అడ్వాన్స్" అంటూ లేచాడు నర్సింగరావు.

అక్కడితో ఆ ప్రస్తావన ఆగింది.

* * *

చూస్తుండగా ఆరు నెలలు గడిచాయి. ఈ ఆరు నెలలలోనూ నసీరుద్దీన్ తన బంధువులకి, మధ్య ప్రాచ్య దేశాలలో ఎక్కడైనా ఉద్యోగం చేయడానికి సిద్ధంగా ఉన్నట్లు, తనకి ఒక మంచి ఉద్యోగం చూడమంటూ, చాలామందికి వ్రాశాడు. అతని బంధువులు ఇంచుమించు అన్ని ముఖ్యమైన మధ్య ప్రాచ్య దేశాలలోనూ ఉన్నారు.

ఆ రోజు సౌదీ అరేబియాలోని, నసీరుద్దీన్ దగ్గర బంధువుల వద్ద నుంచి ఉత్తరం వచ్చింది. అతనికోసం ఒక ప్రైవేటు కంపెనీలో, మంచి ఉద్యోగం చూసినట్లు, ముందు మూడు నాలుగు నెలలు సెలవు పెట్టి వెళ్ళి అక్కడ చూసుకుని బాగుంటే ఉండవచ్చనీ, లేకుంటే తిరిగి వచ్చేయవచ్చనీ, ఆ ఉత్తరంలో ఉంది.

ఆ ఉత్తరం చూడగానే ఏనుగెక్కినంత సంతోషం అయింది నసీరుద్దీన్‌కి. ఆనందంతో కుప్పిగంతులు వేసి నంత పని చేశాడు. నర్సింగరావుని పిలిచి మెరిసే కళ్ళతో ముఖం చాటంత చేసుకుని, ఆ ఉత్తరం చదివి వినిపించాడు. "అయితే సౌదీ అరేబియాకి వెళ్ళదలుచుకున్నావన్న మాట" అన్నాడు నర్సింగరావు.

"అవును భాయి. అవకాశం వచ్చినప్పుడు వదులు కుంటే ఎల్లా. ముందు ఒక్కడినే వెళ్ళి చూస్తాను. బాగుంటే అందులో జేరి, ఆ తర్వాత ఫామిలీని కూడా తీసుకు వెళ్తాను." అన్నాడు నసీరుద్దీన్.

నసీరుద్దీన్‌కి కలిసి వస్తున్న అదృష్టానికి, నర్సింగ రావుకి ఒక ప్రక్కన సంతోషం, మరొక ప్రక్కన కొంచెం అసూయ కలిగాయి. దేనికేనా తెగిస్తేనే, విజయం సిద్ధించేది అని అనుకున్నాడు. తన మిత్రుడు

సలహా చెప్పినప్పుడు, తనకి కూడా ఒక మంచి ఉద్యోగం చూడమని చెప్పి ఉంటే బాగుండేదని, ఇప్పుడనుకున్నా, అల్లా చెప్పనందుకు పశ్చాత్తాపించ సాగాడు. పైకి మాత్రం ఎంతో సంతోషంతో, మిత్రుని అభినందించాడు.

*  *  *

కొద్ది రోజులకే, నసీరుద్దీన్ సెలవు పెట్టి సౌదీ అరేబియాలో తన కొత్త ఉద్యోగంలో చేరడానికి వెళ్ళిపోయాడు. తాను కొంచెం కుదురుకున్నాక, ఒక మంచి ఉద్యోగం చూసి రాస్తాననీ, తప్పక వచ్చేయమనీ మరీమరీ చెప్పాడు నర్సింగరావుతో.

కొత్త ఉద్యోగంలో జేరిన పది రోజులకి, నసీరుద్దీన్ సుదీర్ఘమైన ఉత్తరాన్ని నర్సింగరావుకి వ్రాశాడు. అందులో, తన కొత్త జీవితం చాలా బాగుందనీ, స్వర్గం అంటే అదేనేమో అనిపించేటంత అద్భుతంగా ఉందనీ, ఇన్నాళ్ళూ రానందుకు విచారిస్తున్నాననీ, కనీసం ఇప్పటికైనా ధైర్యం చేసి రాగలిగినందుకు తనకు తానే అభినందనలు తెలుపుకున్నానని వ్రాశాడు. నర్సింగరావు కనుక ఖాయంగా వచ్చేయ దలుచుకుంటే, అతనికి కూడా మంచి ఉద్యోగం చూస్తానని మళ్ళీ వ్రాశాడు.

మూడు నెలలు గడిచాయి, ఈలోపల ఇండియానుంచి ఎవరో వస్తుంటే. వారితో నసీరుద్దీన్ తన భార్య ఆయేషా బేగంని సౌదీ అరేబియాకు రప్పించుకున్నాడు. పెళ్ళయి నాలుగేళ్ళయినా, వాళ్ళకి ఇంకా పిల్లలు కలగ లేదు. అదీ ఒకందుకు మంచిదే – ఈ విదేశయానానికి, బాదరబందీ లేకుండా పోయిందని సంతోషించాడు నసీరుద్దీన్.

ఆయేషాబేగం చాలా అందంగా ఉంటుంది. పాలరాతి బొమ్మకి మీగడ అద్దినట్లు ఉంటుంది. పిల్లలు కలగ లేదేమో ఆమె అందం ఏమాత్రం జారకుండా ఉంది. ఆ యువ దంపతులు ఎంతో ఆనందంగా కొత్త జీవితం గడుపుతున్నారు. దానికి తోడు సౌదీ అరేబియా ముస్లిం దేశం. అందువల్ల, ముస్లిములైన నసీరుద్దీన్ దంపతు

లకు తమ మత సంస్కృతుల మధ్యనే ఉండడంలో, పరాయి దేశంలో ఉంటున్నట్లే అనిపించడం లేదు. అదీ కాక ఆ ఊరిలో వారి బంధువులూ, ఇతర భారతీయులూ ఎందరో ఉన్నారు. అన్ని సదుపాయాలతో, అధిక వేతనంతో, హాయిగా గడిచిపోతోంది వారి జీవితం.

* *

వజీర్ సాదత్, సౌదీ అరేబియాలో గొప్ప కోటీశ్వరుడు. బాగా పలుకుబడి ఉన్నవాడు. గతంలో కొంత కాలం ఆయన, సౌదీ అరేబియాలో రాజుగారి, మంత్రి వర్గంలో ఒకడుగా ఉండేవాడు. అందువల్లే ఆయన వజీర్ అయ్యాడు. ఆ పదవి నుంచీ తప్పుకున్నాక కూడా, ఆయనకున్న డబ్బూ, పలుకుబడుల మూలంగా, వజీర్ అనే పదం ఆయన పేరులో భాగంగా ఉండిపోయింది.

నసీరుద్దీన్ పనిచేస్తోంది ఒక ప్రైవేట్ సంస్థలో. దాని యజమాని వజీర్ సాదత్. అటువంటి సంస్థలు ఆయనకి ఎన్నో వున్నాయి. సాదత్ తన కుమార్తెకి పెళ్ళి చేశాడు. రాజు తల్చుకుంటే దెబ్బలకి కొదవా అన్నట్లు, డబ్బులో పడి దొర్లే, ఆయన, ఆ వివాహాన్ని అత్యంత వైభవంగా జరిపాడు. చెప్పుకోదగ్గ విషయమేమిటంటే, అంత పెద్ద యెత్తున జరిపిన వివాహానికి పెద్దల్ని మాత్రమే పిలవకుండా, తన సంస్థలలో పనిచేసే వారందర్నీ, చిన్నా పెద్దా తేడా లేకుండా, ఎంతో మర్యాదగా ఆహ్వానించాడు. అంత పెద్ద ఆయన పిలిచినందుకు ఉబ్బి తబ్బిబ్బయ్యి, ఉద్యోగస్థులంతా ఘనంగానే నజరానాలు సమర్పించుకున్నారు.

అందరిలాగే, నసీరుద్దీన్ కూడా, సాదత్ గారింట్లో పెళ్ళికి వెళ్ళాడు. వెంట ఆయేషాబేగంని కూడా తీసుకు వెళ్ళాడు. అసలే అందగత్తె ఆమె. పెళ్ళికోసం ఖరీదైన బట్టలు, నగలు ధరించి అలంకరించుకోవడంతో, మరింత అందంతో మెరిసిపోసాగింది ఆమె. బాగా చదువుకున్నదేమో ఆమె పర్దా ధరించేది కాదు. ఆ విషయమై నసీరుద్దీన్‌కి పట్టింపు వుండేది కాదు. నిజానికి, ఆమె అందాన్ని చూసిన వాళ్ళు, తన అదృష్టం పట్ల అసూయ చెందాలని అతని మనస్సులో వుండేది.

ఆయేషాబేగం, వజీర్ సాదత్ ఇంట్లో పెళ్ళికి వచ్చినప్పుడు అందరి కళ్ళూ ఆమె మీదే. అంతటితో నసీరుద్దీన్ స్థాయి కూడా అమాంతం పెరిగిపోయింది. పెద్ద పెద్ద అధికారులు, అపర కుబేరులు కూడా, పని కట్టుకుని నసీరుద్దీన్ దగ్గరకు వచ్చి తమని తాము పరిచయం చేసుకోటం, ఆ విధంగా, ఆయేషాబేగంను దగ్గర నుంచి చూసి, ఓ మాట మాట్లాడి ధన్యులమయ్యామని సంతోషించడం మొదలు పెట్టారు. అందుకని ఈ గౌరవానికి ఆనందంతో ఉక్కిరి బిక్కిరయ్యాడు నసీరుద్దీన్.

కొన్ని వేల మందున్న ఆ పెళ్ళి పందిట్లో చుక్కల్లో చంద్రుడిలాగా వెలిగిపోతోంది ఆయేషాబేగం. వెన్నెలని ముద్దగా చేసి నిలబెట్టినట్లున్న ఆమె వజీర్ సాదత్ కంట పడింది. ఆమెని గురించి విచారించాడు. ఆమె తన కంపెనీలో పని చేస్తున్న ఒక సామాన్య ఉద్యోగి నసీరుద్దీన్ భార్య అని తెలియడానికి ఎన్నో నిమిషాలు పట్టలేదు. స్వయంగా వెళ్ళి, నసీరుద్దీన్‌తో మాట కలిపి, ఎంతో మర్యాద చేశాడు. ఆయనకి తన భార్యని పరిచయం చేశాడు నసీరుద్దీన్. కొంచెంసేపు మర్యాద మాటలయ్యాక, వారిని బలవంతపెట్టి, వి. ఐ. పి. లు వున్న వరుసలో స్వయంగా కూర్చోపెట్టాడు సాదత్. భోజనాల సమయంలో కూడా వారి సరసనే కూర్చోబెట్టాడు.

భోజనాలు అయ్యాక, వజీర్ సాదత్ దగ్గర సెలవు తీసుకున్నాడు నసీరుద్దీన్. తనని యజమానిగా కాక ఒక స్నేహితునిగా భావించమనీ, తరుచు భార్యా సమేతంగా తన ఇంటికి వస్తుండవలసినదనీ, మరీ మరీ చెప్పాడు. వజీర్ సాదత్, ఆ నగరంలో తాను కూడా ఒక వి. ఐ. పి. అయినందుకు, మనస్సులోనే గంతులు వేయసాగాడు నసీరుద్దీన్.

వారం తిరక్కుండా నసీరుద్దీన్‌కి తన కంపెనీలోనే పెద్ద ప్రమోషన్ వచ్చింది. ఊహించకుండానే ప్రమోషన్

## ప్రశ్నలు-సమాధానాలు

1. 1896 ఫిబ్రవరి 29న పుట్టిన వ్యక్తి తేదీల ప్రకారం తన మొదటి పుట్టిన రోజును ఎప్పుడు జరుపుకుంటాడు ?
2. ఆరోగ్యవంతుడైన మానవునిలో ఉండే ఆక్సిజన్, కార్బన్ మొదలగు వాయువులతో కలిపి అతని విలువ ఎంత ?
3. మెదడు శరీర అవయవములకు ఆజ్ఞలు జారీ చేసే వేగ మెంత ?
4. ఇంగ్లీషులో ' Run ' అనే పదానికి అర్థాలెన్ని?
5. పార్లమెంటును సమావేశ పరచలేని ప్రధాని ఎవరు ?
6. రెండు సార్లు తాత్కాలిక ప్రధాని అయి, ప్రధాని కాలేని వ్యక్తి ఎవరు ?
7. ప్రపంచంలో ఎక్కువగా అమ్ముడుపోయే కూల్ డ్రింక్ పేరేమిటి ?
8. ప్రపంచంలో ఎక్కువ జనులు మాట్లాడే భాష ఏమిటి ?
9. ఎక్కువ కళ్ళు కలిగిన జంతువేది ?
10. హిందీ కవి ' ప్రేమ్‌చంద్ ' అసలు పేరేమిటి ?

* * *

1. 1904, ఫిబ్రవరి 9న 2. 45 రూపాయలు
3. సెకనుకు 18 K.M. లేదా 64,800 K.M.P.H.
4. 827 5. చరణ్‌సింగ్ 6. G L. నందా
7. కోకోకోలా 8. మాండరిన్ ( చైనా భాష )
9. మిడత 10. ధనపతిరాయ్ శ్రీవాత్సవ

వచ్చినందుకు ఎంతో సంతోషం కలిగినా, నసీరుద్దీన్ మనస్సులో మాత్రం ఏదో తెలియని భయం చోటు చేసుకొంది.

ఆ తర్వాత తరుచుగా ఏదో వంకతో, నసీరుద్దీన్‌నీ, ఆయేషాబేగంనీ, తన ఇంటికి ఆహ్వానించసాగాడు వజీర్-సాదత్. అంతటి కోటీశ్వరుడు, అందులో యజమాని, పిలిస్తే, వెళ్ళకుంటే బాగుండదని తప్పనిసరిగా వెళ్ళేవాడు నసీరుద్దీన్. వాళ్ళు తిరిగి వెళ్ళేముందు ఏదో వంకతో ఘనంగా కానుకలు అప్పజెప్తుండేవాడు వజీర్ సాదత్. అప్పుడప్పుడు తాను కూడా ఏదో వంకతో నసీరుద్దీన్ ఇంటికి వెళ్తుండేవాడు. వెళ్ళినప్పుడూ 'ఇది మా మర్యాద' అంటూ ఏవో కానుకలు తీసుకెళ్తాండేవాడు. ఇదంతా నసీరుద్దీన్‌కి ఆయేషాబేగంకీ చాలా ఇరకాటంగా వుండేది. కాని ఏమీ చేయలేక ఊరుకున్నారు వాళ్ళు.

* * *

కొద్ది నెలలు గడిచాయి.

ఆరోజు వజీర్‌సాదత్ తన ఇంట్లో ఏదో శుభకార్యం వుందనీ, భార్యా సహితంగా, సాయంత్రం తన ఇంటికి రావలసినదనీ కబురు చేశాడు.

గత్యంతరంలేక ఆ సాయంత్రం ఆయేషాబేగంని వెంటబెట్టుకుని, వజీర్‌సాదత్ ఇంటికి వెళ్ళాడు నసీరుద్దీన్.

వారిని చూడగానే సాదరంగా ఆహ్వానించి లోనికి తీసుకు వెళ్ళాడు వజీర్‌సాదత్. లోపల ఆడవాళ్ళతో మాట్లాడుతుండమని, ఆయేషాబేగంని లోనికి పంపించాడు.

నసీరుద్దీన్‌ని ప్రత్యేకంగా వేరే గదిలో కూర్చోబెట్టాడు. ఇద్దరూ కూర్చున్నాక "మీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి " అన్నాడు సాదత్.

" చెప్పండి " అన్నాడు భయం భయంగా నసీరుద్దీన్.

" నేను కోటీశ్వరుణ్ణి. కాని నా దృష్టిలో నన్ను మించిన ధనవంతులు మీరు. " అన్నాడు సాదత్.

ప్రశ్నార్థకంగా చూశాడు నసీరుద్దీన్.

" అవును మీ భార్య ఆయేషాబేగం అందం ముందు ఎంతటి ధనమూ తక్కువే " అన్నాడు సాదత్, నసీరుద్దీన్ కళ్ళలోకి సూటిగా చూస్తూ.

ఇబ్బందిగా ముఖంపెట్టి సగం లేచాడు నసీరుద్దీన్.

" కూర్చోండి సూటిగా చెప్తాను. " అని నసీరుద్దీన్ కళ్ళలోకి సూటిగా చూస్తూ అన్నాడు.

భయంతో సోఫాలో ముడుచుకుపోయాడు నసీరుద్దీన్.

" మీ భార్య వంటి అందగత్తె నావంటి కోటీశ్వరుడి దగ్గర వుంటేనే రాణింపు. ఆమెని నాకు వదిలేయండి. నా జనానాలో జేర్చుకుంటాను. అందుకు బదులుగా మీకు ఎంత డబ్బు కావాలో అడగండి. లక్షలైనా పర్వాలేదు. కోట్లు అయినా పర్వాలేదు. ఇదికాక మీకు నచ్చిన పిల్లని చెప్పండి. ఆ ఖర్చంతా పెట్టుకుని నేను మీకు పెళ్ళి చేయిస్తా. నాకు మాత్రం అయేషాబేగం కావాలి." అన్నాడు సాదత్ దృఢంగా.

నసీరుద్దీన్ నెత్తిన మబ్బులేని పిడుగు పడినట్లయింది. కొంచెంసేపు మాటరాక కొయ్యబారిపోయాడు. ఆ తర్వాత " ఇది మీకు ధర్మం కాదు. ఇన్నాళ్ళూ మిమ్మల్ని తండ్రిలాంటివారుగా భావించి గౌరవించాం. ఇంక నాకు ఈ దేశమూ వద్దు మీ ఉద్యోగమూ వద్దు. వెంటనే మా భారతదేశానికి వెళ్ళిపోతాను. నా భార్యని పిలిపించండి" అన్నాడు వణుకుతున్న కంఠంతో.

" మూడబ్బాయ్. ఆయేషాబేగంని నేను వదులుకోడం జరిగేపని కాదు. ఆమె నా అంతఃపురంలోకి జేరుకుంది. అక్కడనుంచి ఆమెను ఎవ్వరూ బయటకి తేలేరు. నేను చెప్పినట్లు, మర్యాదగా వింటావా, కోటీశ్వరుడి వవుతావు. లేదా నీ గతి కుక్కలకి కూడా వుండదు. నీ భార్య మళ్ళీ నీ కంట పడడం మాత్రం కల్ల " అన్నాడు వజీర్ సాదత్. ఈసారి అతని కంఠం కర్కశంగా ఉంది.

వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ, " దుర్మార్గుడా, నేను ఊరుకుంటానా. పోలీసులకి రిపోర్టు ఇస్తాను. మా రాయబార కార్యాలయంలో ఫిర్యాదు చేస్తాను " అంటూ తిట్లు అందుకోసాగాడు నసీరుద్దీన్.

" నువ్వేం చేయదలుచుకున్నా నాకేం భయంలేదు. ఈ దేశంలో నా మాట వినేవారే కాని, నీ గోడు వినిపించుకునే వారెవరూ లేరు. మర్యాదగా నువ్వు నా మాట విన్నావో నీకే మంచిది. లేకుంటే, అడ్డమైన గడ్డీ కరవ వలసి వస్తుంది అన్నాడు " వజీర్ సాదత్.

నసీరుద్దీన్ లేచి నుంచుని ఏడుస్తూ, సాదత్‌ని తిట్టడం మొదలు పెట్టాడు.

" ఇంక లాభం లేదు " అంటూ సాదత్ చప్పట్లు కొట్టాడు. వెంటనే నలుగురు దృఢకాయులు లోపలకి వచ్చారు. నసీరుద్దీన్‌ని బయటకి తీసుకుపొమ్మన్నట్లుగా వాళ్ళకి సైగ చేశాడు సాదత్.

వెంటనే వాళ్ళు నసీరుద్దీన్ మీద పడి, అతను గింజు కుంటున్నా మోసుకుపోయి, కోటలాగా వున్న ఆ ఇంటి బయట పడేశారు. అక్కడనుంచి కారులో అతని ఇంటి దగ్గరకు తీసుకుపోయి వదిలి, ఈ విషయం బయటపెడ్తే ప్రాణాలు దక్కవని బెదిరించారు. ఇవన్నీ వాళ్ళకి పరిపాటే.

వాళ్ళు వెళ్ళిపోయాక, ఇంట్లోకి పోయి నెత్తి, నోరూ కొట్టుకుని ఏడవసాగాడు నసీరుద్దీన్. ఆ తర్వాత తేరుకుని తన బంధువులూ, స్నేహితులూ దగ్గరకిపోయి తనకి జరిగిన ఘోరాన్ని చెప్పి గొల్లుమని ఏడవసాగాడు.

ఎవరు విన్నా, చివరకి అందరి సమాధానం ఒక్కటే. " వజీర్ సాదత్ చాలా పలుకుబడిగలవాడు. అతన్ని ఎదిరించడం ఎవరి తరం కాదు. ఈ విధంగా ఇంతకు ముందు చాలాసార్లుజరిగింది. ఆ యా దేశాల రాయబారులకి ఫిర్యాదు చేసినా ఫలితం లేకపోయింది — ఎందుకంటే ఇట్టి విషయంలో జోక్యం కల్పించుకుంటే, వజీర్ సాదత్‌కి వున్న పలుకుబడి మూలంగా, ఫలితం ఏమీ లేకపోయినా దేశాల మధ్య స్నేహ సంబంధాలు దెబ్బతినే అవకాశం వుంది. అందువల్ల ఎవరూ కల్పించుకోలేక పోతున్నారు. ఇప్పుడు ఈ విషయంలో కూడా అంతే. " అని.

"అంతేనా ఇంక నా ఆయేషా నాకు దక్కదా ?" అంటూ గగ్గోలు పెట్టాడు నసీరుద్దీన్.

"అంతే. వజీర్ సాదత్ జనానాలోకి వెళ్ళిన ఏ స్త్రీ మళ్ళీ బయటకు రాలేదు." అని సమాధానం.

అది వింటూనే "ఆయేషా" అంటూ అరచి విరుచుకు పడిపోయాడు నసీరుద్దీన్.

వెంటనే అతన్ని ఆస్పత్రిలో జేర్చారు. త తర్వాత మనిషికి తెలివి వచ్చింది కాని అసలు తెలివి తప్పింది. పిచ్చివాడై పోయాడు. ఎప్పుడూ "ఆయేషా" అని అరుస్తూ ఏడుస్తుంటాడు.

మధ్య ప్రాచ్య దేశాలలో ఎడారులు ఎక్కువ.

ఎడారులలో ఎండమావులు వుంటాయి.

ధనానికి ఆశపడి ఎండమావుల్ని వెతుక్కుంటూ పోయి వాటికి బలి అయిపోయాడు పాపం నసీరుద్దీన్.

★★

# సచ్చిదానందం

**— వసంతరావు వేంకటరావు**

లక్షలు లక్షలు వెచ్చించి
రక్షాదక్షమైన
దివ్య భవనం నిర్మించుకొన్నావు ;
దేదీప్యమానంగా
కాంతిచ్ఛటలు
వ్యాపింపచేసేవు ;
కుడ్యాలంకారాలతో బాటు
గోడలోనే బీరువా లమర్చేవు ;
మొరటుగా నడిచి మట్టే
నేలకు కూడా మొజాయిక్
ఫ్లోరింగ్ చేయించేవు ;
పడక గది ప్రక్కనే
పాయిఖానా పెట్టించేవు ;
ఏమి నాగరికత !

ఇంతటి ఆడంబరంతోకూడిన
ఇంట్లో వుంటూ,
ఇహలోక స్వర్గ మనుభవిస్తున్నానని
మహా మురిసిపోతున్నావు కదూ !

కాని, ఈ

సర్వాంగ సుందర బహువర్ణ శోభిత
సౌఖ్యదాయక శీతలీకృత
మహా సౌధంలో నివసించే
నీవు "నీవు" కాదు.
"అసలు నీవు" అంతరంగంలో నున్నావు.
అంతరంగంలో సౌధాలు లేవు,

ఆస్తులు లేవు అలంకారాలు లేవు ;
అంతరంగ మందున్నది
భయంకర కాంతారం,
ఆ కాంతారంలో మత్తెక్కిన క్రూరమృగాలు
నిరాఘాటంగా విహరిస్తున్నాయి.

కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య
కర్కశ మృగాల వాతపడుతూ
అదే కైలాసమనుకునే మానవా !
వాటి విశృంఖల విహారం అరికట్టి
చేతనైతే వాటిని నాశనంచేయి
లేదా అదుపులో పెట్టుకొని
నిరంతరం అప్రమత్తుడవై యుండు !
అత్యంత చపలమైనది మనసు అనే కోతి
కోతి చిన్నదే కాని
దాని చేష్టలు పెద్దవి !
దీక్షాదక్షుడవై వుంటే తప్ప
ఆట మానదు. ఆడిందంటే
నీ లక్ష్యం చెదరక మానదు.
నీ లోపలే వెలుగుంది !
లో వెలుగు చూడాలంటే
పై వెలుగు తగ్గించుకోవాలి !
పరిశీలన వల్ల కాదు
పరిశోధన వల్ల కాదు
అనుభూతి వల్ల మాత్రమే
వాస్తవిక సత్యం, అవుతుంది మరి ఆవిష్కారం. ★

# మైకాసుర వృత్తాంతాలు

“ మూడు నిమిషాలు మాట్లాడాలంటే మూడు రోజులు ముందు చెప్పండి ; మూడు గంటలు మాట్లాడాలంటే మూడు నిమిషాలు ముందు చెప్పండి ” — అని అన్నాడట ఒకాయన ఓ ఉపన్యాసానికి పిలవడానికి వెళ్ళిన నిర్వాహకులతో—ఎంత తక్కువ మాట్లాడాలంటే అంత ఎక్కువ కృషి అవసరం. కొంతమంది “ చాలా మాట్లాడాలనుకొని వచ్చాను .... ఇంకొక్క రెండు విషయాలు చెప్పి ముగిస్తాను ”—అని అప్పటికే ఓ గంట అయిందన్న విషయం మర్చిపోయి వ్యవహరిస్తారు—కొందరు వారి కిచ్చిన “ సబ్జక్టు ” మర్చిపోయి తాత్కాలికంగా ఎవరో ప్రస్తావించిన అనవసర విషయాల మీదనే సాములు చేస్తారు. వేదిక ఒకడిది వేధింపు మరొకడిని అన్నట్లు వేదికకు చెందని విషయాలమీద ఆవేశ కావేశాలు వెళ్ళగక్కి మరికొంతమంది వేదికలు దుర్వినియోగం చేస్తారు. నిజంగా మైకు మైకాన్నిస్తుంది. మైకు దగ్గర చేరి నానా రకాలుగా హింసించే వాళ్ళని “ మైకాసురులు ”, “ మైకు భయంకరులు ” మొదలైన ముద్దు పేర్లతో పిలవచ్చునని ఈపాటికే లాక్షణికులు లక్షణ నిర్దేశం చేశారు. ఇలా మైకు చుట్టూ జరిగే రకరకాల హాస్య విన్యాసాల్ని మనం కూడా “మైకాలజీ” అని పిలుచుకుంటే తప్పేమీ ఉండదనుకొంటాను.

ఉపన్యాసమనగానే రెడీమేడ్‌గా కనబడేవాళ్ళు రాజకీయ నాయకులు, మంత్రులు—తల తోకా లేకుండా ఎక్కడ మొదలెట్టారో ఎక్కడ ఆపుతున్నారో ఏ విషయమో తెలియకుండా అనర్గళంగా ఉపన్యసించగల “ ఉపన్యాస కారులు ” వారు. “ కారులు ” గనకనే ఎన్ని స్పీడు బ్రేకర్లు వున్నా ఊత పదాల్తో హారన్ గొట్టుకుంటూ వెళ్ళిపోగలరు. వారి ఉపన్యాసం సరదాగా వినండి :

“ ఈనాడు మనం ఈనాడు పేపరు చదువుతున్నామంటే నిజంగా ఈనాడు మనం చాలా గర్వించాలి. అనాడు మన పెద్దలు స్వాతంత్ర్య పోరాటంలో ఎన్నో కష్టాలుపడి మరి ఎన్నో త్యాగాలుచేసి దేశానికి స్వరాజ్యం తెచ్చి— మనం ఈనాడు ఎన్నో యంత్రాల్ని ఎన్నెన్నో వ్యవసాయ పనిముట్లు ముఖ్యంగా మన రైతాంగానికి మన పేద రైతాంగానికి ఇంకా ఎన్నెన్నో ప్రాజెక్టుల్ని, ఇంకా ఎన్నో కోట్లు కోట్లు ఖర్చుపెట్టి దేశాన్ని ముందుకు నడిపించడానికి, ఇంకా ఎంతో కృషి జరగటానికి ఇంకా ఎంతో సమాజం బాగుపడటానికి ” .................ఇలా ఈ వాక్యం తెమలదు. అలా సాగుతూనే వుంటుంది జీడిపాకంలా. ఇంకా కొంతమంది మనందరికి తెలిసిన విషయాల్నే కొత్తగా చెబుతున్నట్లు చెబుతూ తడబాట్లు పొరబాట్లతో మనల్ని నవ్విస్తారు. చిత్తగించండి :

## హాస్యవిహార్

జొరాశర్మ

“ మన దేశానికి 1947 ఆగష్టు 15 వ తారీఖున స్వతంత్రం వచ్చింది. ఆనాడు తిలక్, బోసుబాబు, మహాత్మా నెహ్రూ మరి మహాత్మాగాంధి ఇందిరాగాంధీగారి నాయకత్వంలో స్వ రా జ్యం సంపాదించినాము ” — ఈ విషయం మనకి ఆవేశంగా చెబుతూ ఆగష్టు పదిహేనుకు అక్టోబర్ పదిహేననో, అక్టోబర్ రెండును ఆగష్టు రెండు అనో అనేసరికి మర్నాడు ఉదయానికల్లా పేపర్లో బాక్సు అయిటమ్ అయి కూర్చుంటుంది. మొత్తంమీద అందరూ అలా కాకపోయినా కొందరైనా మనకు వాళ్ళ అజ్ఞానామృతం చవిచూపించి ఆనందింపజేస్తారు.

## తులసీ మహత్యం

తులసి ఆకులతో కప్పిన శవం కొంతకాలం కుళ్ళిపోకుండా వుంటుందని ఈ మధ్య అమెరికన్ శాస్త్రజ్ఞులు వెల్లడించారు. జపాన్‌లో ప్రతి ఇంటా తులసీవనం వుంటుంది. కలకత్తాలో ఒక యూరోపియన్ తన ఇంట తులసివనం ఏర్పాటు చేసుకున్నాడు. కారణం వివరిస్తూ "ఓషధీ లోకంలో తులసిమొక్కలో నున్నంత విద్యుచ్ఛక్తి మరి ఏ ఇతరచెట్లలోను లేదు. తులసిమొక్కలు ఉన్న ప్రాంతమున రెండు వందల గజముల మేర వరకూ వాయువు పరిశుద్ధంగా వుంటుంది. మలేరియా, ప్లేగు మొదలగు అంటు వ్యాధులను, క్షయ రోగమును కలిగించే క్రిములు ఆ ప్రాంతానికి చేరవు. దోమలు ఆ ప్రాంతానికి రావు. నేను ప్రతి రోజు తులసివనంలో షికార్లు చేస్తూ వుంటాను" అని ఆ ఇంగ్లీషు దొర వివరించాడు. పరాయివాళ్ళు, విదేశీయులు చెబితే అభ్యుదయ కాముకులకు నచ్చుతుంది. కాని మనం ప్రతి ఇంట్లో తులసీ పూజ చేయటం అనాదిగావస్తున్న సదాచారం. తులసీ తీర్థం దేవాలయాలలో ఇవ్వడం మన సాంప్రదాయం. ప్రాణంపోయే సమయంలో తులసినీరు గొంతులోపోయడం మన ఆచారం. తులసి మహాత్యమును విదేశీయుల కన్న బాగా తెలుసుకొనినవారు భారతీయులే అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

కొంతమంది రాజకీయ నాయకుల్లో "ఛాలెంజి రాముళ్ళు" వుంటారు. వారు ఏ సభలోనైనా ఛాలెంజి చెయ్యకుండా మైకొదలరు—"దమ్ముంటే అవతల పార్టీ వాళ్ళని ఇదే సెంటర్లో ఈ డయాస్ ఎదురుగా సభ పెట్టమనండి. ఎదురు బొదురు సభలు పెట్టి మాట్లాడమనండి చూద్దాం" — అంటూ ఛాలెంజి చేస్తారు జనం కూడా ఒక్కసారి హోరెత్తేలా ఈలల్తో, చప్పట్లతో ఇంకా ఇంకా రెచ్చగొట్టి ఒదిలిపెడతారు. ఈ ఛాలెంజి ఎలాగూ నెరవేరదు. కాని ఈ సన్నివేశం మాత్రం చూడ ముచ్చటగా వుంటుంది.

సరే సభలో కొద్దాం. స్వాగతాలు పరిచయాలు వగైరాల్లో కూడా కొన్ని తమాషాలుంటాయి. ఒక్కొక్క వక్తని వేదికమీదకు ఆహ్వానిస్తూ తలకో అరగంట పరిచయ ఉపన్యాసం అనర్గళంగా సాగించగల ఉపన్యాసకారులు కూడా వుంటారు. సభ మొదలైనా మొదలవనట్టుగా శ్రోతల్ని కలవరపెడుతుంది. ఈలోగా వేదిక మీద వక్తలు వాళ్ళల్లో వాళ్ళు మాట్లాడుకొంటూ వుంటారు. దీనికితోడు (ఏ ప్రైజులో ఇవ్వడానికి వచ్చిన) ఓ సినీ నటి రుమాలు అద్దుకొంటూ ఈలవేసే జనం వైపు చెయ్యెత్తుతూ వీళ్ళంతా నా అభిమానులే అన్న విజయగర్వంతో సభ నాలుగు చెరగులా పరికించి చూస్తూ చిరునవ్వులు వెదజల్లుతూ వుంటుంది. సభ మొదలవుతూ ఉంటుంది .... ఓ పక్క పరిచయం పేరుతో నాన్‌స్టాప్ ఉపన్యాసం గాలిలో కలిసిపోతూ వుంటుంది .... ఈ సన్నివేశం చూస్తే వచ్చినంత "ఎఫెక్టు" రాస్తే రాదు. తటస్థ పడ్డప్పుడు తప్పక చూసి ఆనందించాల్సిందే !

ఇక సభల్లో సాధారణంగా తల పండిన పండితులే అధ్యక్షిస్తారు. కొంతమంది అధ్యక్షుల పలుకులు మితంగా వ్యక్తికి వ్యక్తికి మధ్య పాయసంలో జీడిపప్పుల్లా రుచికి రుచి తోడుచేసి కొత్త రుచుల్ని పంచి పెడతాయి. మరి కొంతమంది అలా కాదు. వారికున్న బుర్ర విజ్ఞాన భాండారం అవడం వల్ల ఒక వక్త మాట్లాడగానే

ఆ అధ్యక్షుల వారికి అనేక విషయాలు జ్ఞాపకానికొస్తూ ఉంటాయి. "ఇప్పుడు వాడ మాట్లాడాక నాకు గుర్తొస్తోంది .... " అంటూ వారి జ్ఞాపకాల్లోకి మనల్ని తీసుకెళ్తారు ఇక్కడ అధ్యక్షులవారు పులిహోరలో కరివేపాకు లాగా అడ్డం వస్తారు.

సభలో ఓ సారి ఒకాయన ఉపన్యాసం సాగుతోంది. జోరుగా లేదు. జోకొట్టేలా ఉంది. వేదిక మీద అధ్యక్షుల వారు కూడా జోగుతున్నట్టున్నారు. కన్ను మూస్తూ తెరుస్తూ పాక్షికమైన మెలుకువలో ఉన్నారు. ఇంతలో నా పక్కనున్న సాహితీ మిత్రుడు "అధ్యక్షులవారు కన్ను మూసేలా ఉన్నారు" - అంటూ నా తొడ మీద తట్టాడు. తట్టాడు అనటం కంటే తట్టి లేపాడు అనచ్చు. ఎందుకంటే అప్పటికే ఉపన్యాస ప్రభావం కావచ్చు నాకు కూడా కునుకులాంటిది ఆవహించింది.

కవి సమ్మేళనాల్లో కూడా మైకు ప్రభావం ఉంటుంది. రాసింది మూడు లైన్లో లేదా నాలుగు లైన్ల పద్యమో. దానికోసం ఆ కవిరాక్షసులవారు చేసే ఉపన్యాసం మనకు సుత్తి ఘాతమే నన్నది అనుభవైకవేద్యమే !

కొన్ని చోట్ల కాంట్రాక్టు ఉపన్యాసాలుంటాయి వేదిక మీద ఉన్న ఇద్దరు వక్తల్లో ఓ వక్తగారు మరో ప్రసంగించబోయే వక్తని తెగ పొగుడుతారు. తరువాత ఆ వక్తగారు అంతకు పూర్వం ప్రసంగించిన వక్తగార్ని ఆకాశంలోనే ఉంచుతారు. వీరిద్దరి తంతు "నువ్వు నన్ను పొగుడు నేను నిన్ను పొగుడుతా" అన్నట్లు అదోరకమైన కాంట్రాక్టు పద్ధతిలా ఉంటుంది. వీళ్ళిద్దరూ అసలు (విషయం) కంటే వడ్డీతోనే మనల్ని అలరిస్తారు.

ప్రభుత్వ పరంగా జరిగే వారాలు, దినాల ఉత్సవాల సందర్భంగా మంత్రులు ముఖ్య మంత్రుల ప్రసంగాలు కూడా మైకు ముందునుంచే జరుగుతాయి. "నా వాళ్ళకు నా జాతివాళ్ళకు, ఆడపడుచులకు, తమ్ముళ్ళకు, చిరంజీవులకు" - అంటూ ఓ మూడు నిముషాల పాటు సంబోధన సాగగా కొత్తగా కలం పట్టిన కవిగారు వచన కవిత చదివినట్లు, "హుం హుం హుం .... " అంటూ చిరు

> " గతానికి, వర్తమానానికి వారధి కట్టే విజ్ఞాన భాండాగారమే గ్రంథాలయం. ప్రపంచంలో ఏలుమూలల నివసించే లక్షల కొలది ప్రజలు ఏక సమయంలో ఒకే గ్రంథాన్ని చదువుతూ వుండవచ్చు. ఇటువంటి సదుపాయాన్ని కూర్చే ఆసర గ్రంథాలయంకు ఉంది. ఇవి విజ్ఞానాన్ని వెదజల్లే కేంద్రాలు. "
>
> - శ్రీ అనంతశయనం అయ్యంగార్

మందహాసమా అన్నట్లు మనల్ని దుర్యోధన స్వగతమా అన్నట్లు, మరేదో ఏకపాత్రాభినయమా అన్నట్లు ఆనందింప చేస్తాయి.

నిత్య వ్యవహారంలో మామూలు మాటల్లో కూడా ఉపన్యాస ధోరణి అలవాటయిపోయినవాళ్ళు కొందరుంటారు. వీళ్ళకి ఎదురుగుండా మైకు అక్కర్లేదు. "వైదిక భాష" అన్నట్లు వీళ్ళది "మైకు భాష" అనచ్చు. చందా అడగడానికి వచ్చినాయన "ఆయొక్క కార్యక్రమానికి ఆ యొక్క ఇది ఏదయితే ఉందో ఆ యిదిని మీరు అర్థం చేసుకొంటారని, తప్పకుండా ఇస్తారని ఆ యొక్క దీనికి మీరు కూడా సహాయ సహకారాలు అందిస్తారని ఆశిస్తూ మేం చెప్పేదేమిటంటే .... " అలా సాగుతుంది ఆ ధోరణి ....

ఇంతా చదివి వీళ్ళంతా ఎందుకిలా అయిపోతున్నారని అడక్కండి. ఇదంతా మైకు మహాత్మ్యమే ! నిజంగా మైకు మైకాన్నిస్తుంది .... .... ! !.

# ఆధునిక మూఢ విశ్వాసాలు

ఆనాడు మహాకవి కాళిదాసు అన్నాడు :

'పురాణ మిత్యేవ న సాధు సర్వం
న చాపి కావ్యం నవమిత్యవద్యం
సంతః పరీక్ష్యాన్యతరాత్ గ్రహంతి
మూఢః పరః ప్రత్యయనేయ బుద్ధిః'

కాళిదాసు చెప్పినది కావ్యాలపరంగా, కాని ఆయన సూక్తిని సాధారణంగా పాత కొత్తల పట్ల మనుష్యుల వైఖరికి అన్వయించవచ్చు ఆ కాలంలో పాతకే ఎనలేని గౌరవం, కొత్తపట్ల చిన్న చూపు వుండేది. కాని ఈనాడు పరిస్థితి తలక్రిందులై పోయింది. కొత్తపట్ల మనకి మోజు మోతాదు మించిపోయింది. పాతనంతా చెత్త అని కొట్టివేసే ధోరణి ప్రబలమైపోతోంది. మన కళ్ళెప్పుడూ మిరుమిట్లుగొలిపే పాశ్చాత్య ప్రపంచంమీదే ఉంటున్నాయి.

**వాసమూరి**

అందువల్లే మన సంస్కృతీ వారసత్వాల పట్లా, మన భాషా సాహిత్యాల పట్లా, పరంపరాగతంగా వస్తున్న మన ఆచార వ్యవహారాల పట్లా ఈసడింపు వ్యక్తమవుతోంది. ఏమిటిది అని ప్రశ్నిస్తే ఇది విజ్ఞాన యుగం, మనం విజ్ఞానపు పరుగుతో అందుకోకపోతే వెనకబడిపోయి, కొన్నాళ్ళకి కాలగర్భంలో కలిసిపోతామంటారు. కాని విజ్ఞానమంటే ఇంత అభిమానం కనబరుస్తున్న మనం నిజంగా విజ్ఞానానికి అనుగుణమైన వైఖరి వహిస్తున్నామా, విజ్ఞానం ఏమి కోరుతుందో గ్రహిస్తున్నామా అని ప్రశ్న తోస్తోంది.

విజ్ఞానమంటే ప్రతీదీ పూర్తిగా తెలుసుకోవాలన్న తపన అని చెప్పవచ్చు. ప్రతిదాన్నీ జాగ్రత్తగా పరిశీలిస్తుంది, పరిశోధిస్తుంది, పదే పదే పరిశోధిస్తుంది, ఆపైన అలా తెలుసుకున్న విషయాలపై గంభీరంగా ఆలోచించి నిర్ణయాలకు వస్తుంది. మనం అభిప్రాయాలు ఏర్పరచుకునే ప్రతిదాని విషయమై ఈ జాగ్రత్తలు తీసుకుంటున్నామా ? ఉదాహరణకు చూడండి, పాత కాలం నుంచి వచ్చినది అత్యధిక భాగం మూఢ విశ్వాసాల మయమని కొట్టివేస్తూ వుంటాం. పాత నమ్మకాలలో కొన్ని ఎంతో పరిశీలనమీదా, అనుభవంమీదా, ఆలోచన మీద ఏర్పడ్డవేమోనని మనం తెలుసుకోవడానికి కూడా ప్రయత్నించడం లేదు. ఇంగ్లీషు సామెత 'ఎంప్టీయింగ్ ద బేబీ ఎలాంగ్ విత్ ద బాత్ వాటర్' అన్నట్లు చెడుతోబాటు ఎంతో మంచిని కూడా కేవలం పాతపట్ల మనకున్న విముఖత కారణంగా తోసిపారేస్తున్నాం. అలాంటివి కొన్ని పాఠకుల దృష్టికి తేవడమే ఈ వ్యాస ఉద్దేశ్యం.

ఆధునికత పేరిటా, నాగరికత పేరిటా, వ్యాపార ప్రకటనల ప్రభావంలో పడే తల్లులు తమ పుట్టిన బిడ్డలకు కొద్దికాలం మాత్రమే స్తన్యమిచ్చి, తరువాత డబ్బాపాల మీదే వారిని పెంచసాగారు. కాని ఈనాడు బిడ్డ ఆరోగ్యానికీ, అభివృద్ధికీ తల్లిపాలవంటి శ్రేయస్కరమైనది మరొకటి లేదని ప్రపంచమంతటా గుర్తించబడుతోంది. దేశాల ప్రభుత్వాలూ, అంతర్జాతీయ సంస్థలూ పెద్ద ఉద్యమాలే చేబడుతున్నాయి.

ఆధునిక ప్రసూతి వైద్యశాలల్లో పుట్టిన బిడ్డల్ని తల్లులున్నచోట కాక వేరే మరొక గదిలో ఉయ్యాలలో కానీ పెట్టెల్లో కానీ ఉంచి ఒక నర్సు ఆ శిశువుల సంరక్షణకి ఉండడం జరిగుతోంది. ఇది గతంలో బిడ్డల్ని మార్చి వేయడం, కుక్కలు ఎత్తుకుపోవడం వంటి దుస్సంఘటనలకు అప్పుడప్పుడూ దారితీసినా, వాటిని మనం పట్టించుకోనక్కరలేదు కాని ఈనాడు ప్రపంచంలో ఒక ప్రముఖ

మానవ శాస్త్రజ్ఞుడిగా గుర్తించబడుతున్న ఆష్లీమాంటెగ్యూ తన 'టచింగ్' (స్పర్శించడం) అన్న పుస్తకంలో ఇది చాలా తప్పు పద్ధతి అని రుజువు పరచాడు. బిడ్డ యొక్క శారీరక, మానసిక వికాసంలో తల్లి యొక్క స్పర్శ ఎంతో ప్రముఖ పాత్ర వహిస్తుందని ఆయన నిరూపించాడు. కేవలం వాదించలేదు. ఎన్నో వైజ్ఞానిక అధ్యయనాలూ, పరిశోధనా నివేదికలు గణాంక వివరాలు గ్రాఫు పటాలతో సహా ఉటంకించాడు. స్పర్శ జ్ఞానం పై ఆయనది కూలం కషమైన, సర్వోత్తమమైన పుస్తకమని చెప్పవచ్చు. ఆయన రచన ప్రభావం వల్ల అమెరికాలోని కొన్ని నర్సింగ్‌హోంలలోనూ, ప్రసూతి గృహాలలోనూ బిడ్డను తల్లి దగ్గరే సదా ఉంచే పద్ధతి మొదలు పెట్టారు కూడా. కాని మనమీ సత్యాన్ని గుర్తిస్తున్నామా ?

మనవారు గర్భవతులు భయం, జుగుప్సా, అత్యాశ్చర్యం అతి విషాదం వంటివి కలిగించే వాటిని వేటినీ చూడకూడదనీ, వారు ప్రశాంతమైన, మనస్సుకు ఆహ్లాదకరమైన వాతావరణంలో ఉండాలనీ భావించేవారు. ఆధునికులు దీనిని ఒక మూఢ విశ్వాసంగా కొట్టి వేస్తారు. కాని మార్చి 1985 రీడర్సు డైజెస్టులో 'ద సీక్రెట్ లైఫ్ ఆఫ్‌ది అన్‌బార్న్ చైల్డ్' అన్న వ్యాసం పడింది. ఇది అదే పేరుగల పుస్తకంనుండి తీసిన సారాంశ వ్యాసం. అది మన పూర్వులునమ్మినది నిజమని తెలియజేస్తుంది. ఆ వ్యాసం రాసినది ఒక మనోవైద్య నిపుణుడు డా॥ టామస్‌వెర్నీ. ఎన్నో పరిశోధనల పిమ్మట ఆయన బిడ్డ పుట్టకముందు తల్లి అలవాట్లూ, వ్యవహారమూ, మానసిక ధోరణులూ, ఆమె వినే సంగీతం గర్భస్థ శిశువు మీద ప్రభావం చూపుతాయని ఆధారాలు చూపాడు. తల్లి పొగ త్రాగితే దానికి ఆ పుట్టని శిశువులో ఒక ప్రతిక్రియ వస్తుందని కూడా చూపాడు. అంటే గర్భిణీ స్త్రీల గురించి మనలో పరంపరాగతంగా వస్తున్న అభిప్రాయాలూ, నమ్మకాలూ అన్నీ పూర్తిగా మూఢ విశ్వాసాలు కావని తేలుతుంది గదా.

మన ప్రాచీనులు రాగి చెంబులూ, పాత్రలూ, బిందెల్లో నీళ్ళు త్రాగడానికి వాడేవారు. అటువంటి నీరు ఆరోగ్యరీత్యా

# భరతమాతకిదే వందనం !

ఏ భావకుని మదిలోన, భాసిల్లెనో, నవోదయ
సాహితీ నవ్య గీతి
ఏ కవి కలము నుండి వర్షించెనో, కావ్యాల విరిజల్లు
కమనీయముగను
ఏ గాయకుని గళమందు ర్శి మించెనో
మధుర మధురామృత పల్లవ గాన రసము
ఏ మధుర ప్రేమ రసైక మనోవేదమందు శ్రుతిచేసి
పలికెనో, జయదేవు విరహ గీతముల్
ఏ పరమ యోగీంద్రులు, మన కందించిరో
వేద వేదాంగ సారముల్, విపులముగను
ఏ హాలికుడు హలము పట్టి, ధాన్యరాసులు పండించి
దండిగాను, సకల మానవ కోటికి, సమృద్ధిగాను
జీవనాధార మొసగె, నిస్వార్థపరుడు
ఏ శ్రామికుల కష్ట ఫలమో, మానవాళికి వలయు
సౌకర్య సాధనము లెన్నో, సిద్ధ మొనరించి
మన కిచ్చినారు
కోటిప్రభాతేజోవిరాజ, ఓ భరతమాత
నీదు గారాబు బిడ్డల, నిఖిల ఖ్యాతి కిదే
వందన మొనర్తు—నే నొక్కమారు.

— ఆదూరి శారదాదేవి

మంచిదని వారి విశ్వాసం. మనమీనాడు అన్నిటికీ స్టెయిన్‌లెస్ స్టీల్ వాడుతున్నాం. అది ఎక్కువ పారిశుద్ధ్యం అనుకుంటాం. నిజానికి స్టెయిన్‌లెస్ స్టీలు మంచీ చెయ్యదు, చెడూ చెయ్యదు. కాని కొన్నేళ్ళ క్రిందట ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో ఒక విజ్ఞానవేత్త పరిశోధనల గురించి వ్యాసం పడింది. ఆయన అధ్యయనం ద్వారా రాగి నీళ్ళను కొంత పరిశుద్ధం చేస్తుందనీ, అందువల్ల రాగి పాత్రలలో

నీరు ఆరోగ్యదాయకమనీ తేలింది. వెండికీ, బంగారానికీ కూడా ఆ లక్షణమే వుంది. కాని వెండీ బంగారాలు సామాన్యావసరాలకు వాడలేము కదా. రాగి యొక్క ఈ ప్రత్యేకతను గుర్తించే ననుకుంటాను నదిలో దిగేటప్పుడు కానీ, నదిమీద ప్రయాణం చేస్తున్నప్పుడు కానీ ఒక రాగి డబ్బు నదిలో పడేయడం ఆచారంగా వచ్చింది. ఒక ఉర్దూ కవి అలా రాగి డబ్బులు విసరడం చూసి ధనాన్ని నష్టపరుస్తున్నారనీ, అన్యాయం చేస్తున్నారనీ భావించి ఆవేశంతో ఒక కవిత రాశాడు. పాపం ఆయనది అసందర్భమైన ఆవేశం. ఎందుకంటే నదిలో వేయమన్నది రూపాయలూ వరహాలూ కాదు. అత్యల్పమైన రాగి డబ్బు. అది నది పరిశుభ్రం కావడానికి ఉడుతా భక్తి ప్రయత్నం లాంటిది కదా. అందులో తప్పేముంది?

అలాగే గంగాజలం పవిత్రమైనదని మనవారు నమ్మేవారు. ఆ జలం పవిత్రంగా వుండడానికి కారణం అది హిమాలయాల ద్వారా ప్రవహిస్తున్నప్పుడు కొన్ని ఔషధుల సారం ఆ జలంలో కలవడమే అని కొందరు పరిశోధకులు వెల్లడించారు. కాని ఇటీవల గంగ నీరు బాగా కలుషితమై పోయిందని ఆందోళన వ్యక్తమయింది. కొన్ని వందల కోట్లు ఖర్చుఅయ్యే గంగ శుద్ధి కార్యక్రమం రూపొందించడం జరిగింది కూడా. గంగానదికి వున్న సహజ స్వయం పారిశుధ్య శక్తికి ఎన్నో రెట్లు మించిన కాలుష్యం చేరితే ఏమవుతుంది? కాని ఆ కాలుష్యం ఎలా వచ్చిందో కొంచెం వివరంగా ఆలోచించండి.

మనవారు ప్రతి యింటా తులసికోట వుండేటట్లు ఏర్పరచిన ఆచారం విలువ ఇప్పుడిప్పుడే గుర్తించబడుతోంది.

'ఉల్లి చేసిన మేలు తల్లయినా చేయలేదు' అన్నది మన ప్రాచీన సామెత. ఆయుర్వేద వస్తు గుణదీపికలు రెండే రెండు సర్వరోగహరులుగా వర్ణించబడ్డాయి. అవి వెల్లుల్లీ, గోమూత్ర శిలాజిత్తూ. అందుకే మనవారు ప్రసూతి గృహంలో, శిశు సంరక్షణలో వెల్లుల్లికి అధిక ప్రాధాన్య మిచ్చారు. ఇటీవల ఆసుపత్రి ప్రసవాలు వచ్చిన తరువాత వెల్లుల్లికి ఇంచు మించుగా స్థానమే లేకపోయింది. కాని మళ్ళీ ఇటీవల కొంత పరిశోధన జరిగి వెల్లుల్లి విలువ గుర్తించడం జరిగి, దాని సారం తీసి 'కాప్సూల్సు'గా చేసి ప్రవేశపెడితే ఆధునిక వైద్యులు వాటిని సిఫారసు చేస్తున్నారు. ఆధునికత అంటే మోజుపడేవారు కూడా వాడుతున్నారు.

సర్వసాధారణంగా అలోపతీ వైద్యులు 'లివ్ 52' మాత్రలు సిఫారసు చేస్తూంటారు. అది కాలేయం మీద అద్భుతంగా పనిచేస్తుంది. కాని అది పూర్తిగా ఆయుర్వేద ఔషధమే. ఆ ఔషధం తయారు చేసే హిమాలయా డ్రగ్ కంపెనీవారు తయారుచేసేవి అన్నీ కూడా ఆయుర్వేద ఔషధాలే. కాని అన్నింటికీ ఇంగ్లీషు పేర్లు పెట్టారు. వాటిని అలోపతీవైద్యులు చాలామంది వాడుతూ ఉంటారు. అంటే ఇంగ్లీషు పేరుపెట్టి, ఇంగ్లీషు వేషం వేస్తే మరొక విధంగానైతే మనం కన్నెత్తి చూడని దానికైనా ఆదరణ లభిస్తుందేమో ననిపిస్తుంది. ఇదే స్వామీజీలూ, సన్యాసులూ వగైరాల విషయంలో కానవస్తుంది. దేశీయ భాషల్నే ఆశ్రయించుకున్న స్వామీజీలను — వారు పీఠాధిపతులైతే తప్ప - పట్టించుకునేవారు అంతగా ఉండరు. అదే ఇంగ్లీషులో ధారాళంగా, ప్రభావవంతంగా మాట్లాడగలిగే వారయితే — వారు చెప్పేది కొత్తదీ, గంభీరమైనదీ కాకపోవచ్చు — అవి సరళీకృత భగవద్గీత, లేదా ఉపనిషద్ వ్యాఖ్యానాలే — వారికి దేశ విదేశాల్లో అంతటా శిష్యులూ, ఆశ్రమాలూ ఆదరణ, ప్రచారం లభిస్తాయి.

'ఆక్యు పంక్చర్' అన్నది చైనా నుంచి వచ్చిందీ (అసలు ఆదిలో అది భారతదేశంలో పుట్టినదే) ఇంగ్లీషు పరిభాష ధరించింది కాబట్టే దానికీనాడు ఇంత ఆదరణ లభిస్తుందేమో. లేకపోతే 'ఆక్యు పంక్చర్' సూత్రాలకీ ఆధునిక శరీర శాస్త్ర సూత్రాలకీ సంబంధమేమిటి? సమన్వయ మేముంది?

చివర మరొక ఉదాహరణ. అభ్యంగనస్నానం చేసేటప్పుడు చెవుల్లో కూడా (నువ్వుల)నూనె పోసుకుంటారు. అది ఆక్షేపించారు కొందరు ఆధునిక వైద్యులు — పరిశీలన

...తపకుండానే. 'చెవి యంత్రమేమీ కాదు ఆయిల్ పోయడానికి' అన్నారు. మానవ శరీరం యంత్రం కాదు కాబట్టే (నువ్వుల) నూనె వాడకం. యంత్ర భాగాలు నూనెను పీల్చుకోవు. కాని శరీరం (నువ్వుల) నూనెని పీల్చుకుంటుంది. అందుకే పూర్వం నవజాత శిశువులకి ఒంటినిండా నూనె బాగా పట్టించేవారు. అది వారి చర్మానికి ఎంతో మేలు చేసేది. అలాగే చెవిలో పోసిన నూనె చెవిలోని పొర పీల్చుకుంటుంది. దానివల్ల కొంత మేలు ఉంది. అపరిశుభ్రమైన నూనె వాడడంవల్ల వ్యాధులు రావచ్చునన్నది - అది అపరిశుభ్రతకి సంబంధించినది కానీ, నూనె వాడకంకి సంబంధించినది కాదు. చెవి తన సంరక్షణ తాను సహజంగానే చేసుకుంటుంది. దానికి నూనె వంటివి అక్కరలేదు. నూనె వాడకం అసహజం అన్నారు ఆధునిక వైద్యులు కొందరు. మరి తలకు నూనె ఎందుకు రాసుకుంటున్నాం ? అదిమాత్రం అసహజం కాదా ? జంతువులు నూనె వాడుకుంటున్నాయా? సబ్బు ఎందుకు వాడుతున్నాం ? సబ్బు వాడకం వల్ల కొంత పరిశుభ్రత లభించేమాట నిజమే అయినా, దానితో బాటు శరీరపు సహజ తత్వాలు కూడా కొన్ని నష్టపోతున్నాయని ఇటీవల కొందరు తెలియచేస్తున్నారు. పూర్వ పద్ధతి - నూనె, సున్నిపిండి - దానిలో కావలస్తే ఓషధుల్ని కూడా చేర్చుకోవచ్చు - వాడకమే చర్మం దీర్ఘకాలం మంచి స్థితిలో ఉండడానికి తోడ్పడుతుందని కూడా కొందరు భావిస్తున్నారు.

ఇక్కడ చెప్పినవి ఏవీ వెంటనే నమ్మ నక్కరలేదు. వాటిని తగినంతగా పరిశీలించామా అన్నదే ప్రశ్న. ఆమోదించడానికి ఎంతగా ఆధారాలు కావాలో నిరాకరించడానికి అంతగానూ ఆధారాలు చూపాలి. క్షుణ్ణమైన పరిశీలనా, పరిశోధనా, ఆలోచనా తర్వాతే ఏ నిర్ణయానికైనా రావాలి. విజ్ఞానం, విజ్ఞానం అంటూనే విజ్ఞాన విరుద్ధంగా మనం వ్యవహరించడం లేదా ? మనదీ, పాతదీ అంతా ఒక్క దెబ్బని కొట్టిపేయడం ఆధునిక మూఢ విశ్వాసం అవదా ? ఇక్కడ మచ్చుకి కొన్ని విషయాలు మాత్రం ప్రస్తావించడం జరిగింది. మన నిర్లక్ష్యంవల్ల ఎన్ని అమూల్యమైనవి పోగొట్టుకుంటున్నామో ఒక్కమారు పరిశీలించండి. ★

"మంచికి చెడ్డకి పోటీ, కొత్తకి పాతకి భేటీ" అంటూ ప్రయోగం చేసి చూపిన

# అచ్చమైన ఆధునిక కవి ఆరుద్ర

" వేదంలా గోదావరి ప్రవహిస్తోందే చెల్లీ
వెన్నెలవలె కృష్ణవేణి విహరిస్తోందే తల్లీ "

అంటూ గొంతెత్తి పాడిన ఆరుద్ర కలం నుండి ఎన్ని కవితా బిందువులు వెలువడి; సింధువులై నిలిచినయ్యో, చెప్పటం కష్టం ! త్వమేవాహం, సినీ వాలి, గాయాలూ గేయలూ, కూసలమ్మ పదాలు, ఎంచిన పద్యాలు, ఇంటింటి పజ్యాలు, సమగ్రాంధ్ర సాహిత్యం పేర సాహిత్య చరిత్ర పన్నెండు సంపుటాలు, వందల కొలది రేడియో రచనలు— ఈ అరవై వత్సరాల జీవితంలో ఎన్నెన్ని విజయాలు ! ఎన్ని ప్రయోగాలు ! ! ఎందరి గొంతుల్లోనో మాధుర్యాన్ని సంతరించుకొని గుండెల్లో ప్రతిధ్వనించిన వేల కొలది సినీ గీతాలు ! ఆరుద్ర కేవలం కవే గాక, చక్కని విమర్శకుడు కూడా ! షష్ఠిపూర్తి జరుపుకున్న ఆరుద్ర వయసుకు పెద్దవాడేమోగాని, కలానికి చాలా చిన్న ! పిన్న ! అయితేనేం వాసిలో మిన్న !

**డా॥ మోదిరాజు రామలింగేశ్వరరావు**

' వచిత్ కవీనాం నవా దృష్టిః ' అని ధ్వన్యాలోకంలో చెప్పినట్లు, కవిత్వంలో నవ్యత వుండాలని విశ్వసించే వాళ్ళలో ఆరుద్ర ఒకడు అందుకే అతని " త్వమే వా హం ", తెలుగువాడికి ఆశ్చర్య హేతువయింది. ' సింతటిక్ చింతను ధరించు కవి, అంతటా ఖయాసు పెరిషించు, ఖయాసు ఎడారి లోపల, ఒయాసీస్సు పొయిట్రీ, కవిత్వపు ఖయాసులో, ఖయాసుకి ఉరికొయ్య ' అని ఆరుద్ర అంటున్నప్పుడు పాఠకుడు నిశ్శబ్దమయిపోయి మళ్ళీ వినవలసి వచ్చింది. ' లో ! హాలో ! లోయలో, ఓ, ఒహో, పటాలం, పటాలం, " అని మళ్ళీ వినపడగానే, పులికిపడవలసి వచ్చింది. ' ఈ వ్యాకరణం కన్నా గణితం పనికొస్తుంది. అటా రేఖా గణితం కీర్త్యా అభ్యుదయ బీజ గణితం ద్వారా సాల్వ్ చేద్దాం ఇప్పుడు, పైథాగరస్ థీరం ' అన్నప్పుడు మెదడుకు పదును పెట్టవలసి వచ్చింది. " బలవంతమైన సర్పము చలిచీమల చేతచిక్కి ..." అనే పద్యాన్ని, ఎంత అందంగా, ఎంత హృద్యంగా, ఆరుద్ర గణితంలో పొదిగాడో, గమనిస్తే ముచ్చట వేస్తుంది. చిన్న చిన్న చీమలు వగైరాలు అడుగు భుజం అయితే, బలవంతమైన సర్పం గట్రా ఎట్ సెట్రా, అడుగు భుజం వుత్పత్తిచేసే ఆహారంమీద ఆధారపడడంవల్ల, లంబం అయితే, ఈ రెండు భుజాల సంఘర్షణ ఫలితంగా రూపొందిన కర్ణంమీద చతురస్రం ఏర్పడుతుంది. అంటే ఒక నూతన అవస్థ, ఒక పునీత వ్యవస్థ ఏర్పడుతుంది.

తెలంగాణా ఉద్యమాన్ని సంకేతాలతో చూపగల్గిన ఆరుద్ర ప్రజ్ఞ, అతనికి ఒక్కడికి మాత్రమే సాధ్యం అనిపిస్తుంది. ' నక్కలు తిరిగే తోటలో రాకాసి రాకొకడుండెరా ' అనటం, " ఈ కాంతను చెరబట్టగ రాకాసులు తలపెట్టిరి " అని అనటం, "వాడి నాలుక వాడి కత్తిరా, వాడి రాజ్యపు పొట్లపాదురా, వాడి ఆశల కంతు లేదురా, వాడి పేరు దగాకోరురా, వాడి వజీరు పేచీకోరురా, వాడి పెళ్ళాం గాండ్లసంగురా, వాడు పెళ్ళాం చేతిలో కత్తెవ్వా, వాడు పెళ్ళానికే పెళ్ళవు" అని బుర్రకథ చెప్పగలగటమూ కూడా ఆరుద్రకే చెల్లుతుంది

ఆరుద్ర కవితలు నిజ జీవితానికి ప్రతిబింబాలు. చెప్ప దల్చుకున్న దానిని సూటిగా, అందంగా చెప్పగలగటం ఆతలి స్పెషాలిటీ !

"ఖరీదైన ఆడవాళ్ళ భర్తలు, ఖరీదైన పెంపుడు కుక్కలు" - "బాధ్యతలు లేని హక్కులు, చెల్లే బ్యాంకు చెక్కులు, నవ యౌవనం మత్తు నాకు కావాలి". ఇంక కొన్ని జీవిత సత్యాలు - "జీవితం రేడియో సెట్టుకి, భర్త ఏరియల్, భార్య ఎర్తు," "భార్యా భర్తల ఎప్తూ ఏరియల్సున్నా, ఏకాభిప్రాయం అనే విద్యుచ్ఛక్తి లేకపోతే సెట్టు పలకడం సున్నా!" "విశేషణం లేని పదం లాగా వివాహం కాని జీవితం అసుందరం !"—"అబ్బాయి జీవితం పజిల్‌కి, మీ అమ్మాయి కీ సొల్యూషన్ కావచ్చు-" "మగవాడి జీవితం ఒక బైసికులు, దాని ముందు చక్రానికి బ్రేకు తండ్రి, వెనుక చక్రానికి బ్రేకు భార్య."

ఆరుద్ర, జీవితాన్ని చూసినంత దగ్గరగా బహుశా ఎవరూ చూడలేదేమో ! అందుకే, "నువ్వు ఎక్కదల్చుకున్న రైలు ఎప్పుడూ ఒక జీవిత కాలం లేటు ; ఏళ్ళూ పూళ్ళూ నిరీక్షించలేక ఎక్కేస్తావేదో ఒక బండి !" అంటాడు. ఏదో అవుదామని కలలు కనే యువకులు ఏళ్ళతరబడి నిరీక్షించి, ఏదో ఉద్యోగంలో చేరిపోవడం - యం. ఏ. పాసయి ట్రాఫిక్ కానిస్టేబుల్‌గా చౌరాస్తాలో నిలబడటం—నిత్యం మనం చూస్తున్న సత్యమే గదా !

అయితే ఆరుద్ర అటు పాతనూ, ఇటు క్రొత్తనూ ముడివేసి కలిపి నిలిపిన ధీరుడు. "చెడిన జీవిత సార మాధురి చెచ్చెరన్ భువి దించెదన్" అంటాడు ఒకచోట. 'బలవంతమైన జీనిలా లేచే విరుచుకుపడే, ఫోర్సుగా వచ్చే కెరటాలకి కరగిపోయే వేవ్ బ్రేకర్లు, చిన్న చిన్న చీమలు, బ్రెయిన్‌లో పెయిన్, ప్రతి వెయిన్‌లో మెషిన్ గన్ రెయిన్' అంటాడు ఇంకో చోట. 'ఈమె ఆయస్కాం / తకాంత-నిజం / ప్రతి రజం—ఇ / చే ప్రయాణం—అంటాడు.

'వెయ్యి వోల్టుల కవిత్వం' అనే ఖండికలో ముందు మూడు పంక్తులు + గుర్తుతోను, తరువాత మూడు పంక్తులు — గుర్తుతోను, మళ్ళీ మూడు పంక్తులు + గుర్తుతోను, ఇలా సాగిపోతుంది కవిత. + గుర్తున్న పంక్తులను చదువుకుంటే ఒక కవిత, — గుర్తున్న పంక్తులను చదువుకుంటే ఇంకొక కవిత సాక్షాత్కరిస్తుంది.

శ్రీశ్రీ, ఆరుద్ర త్వమేవాహాన్ని చదివిన వెంటనే హెచ్చరించాడు — "జాగ్రత్తగా అడుగులేయాలని, లేకపోతే ప్రమాదంలో పడతాడని"—ఆరుద్ర అక్కడక్కడ గమనంలో తడబడినా, మళ్ళీ నిలదొక్కుకున్నాడు. నిలువెత్తున నిలబడ్డాడు.

ఆరుద్ర చేసిన అతి హృద్యమైన ప్రయోగం వచన కవితలో నాటికను వ్రాయడం. తండ్రి కొడుకుతో "నీ యౌవన జీవన నాటకానికి, ఫస్టు బెల్లు కొట్టారు. నీకేది బెస్టో నాకు బాగా తెలుసు. ఇప్పుడు ముగ్గురు విలాసినులొస్తారు. నీ జీవితంలోకి వింతకాంతులు తెస్తారు. నీకు నచ్చిన కిరణానికి ఎన్నుకో" అంటాడు. అపుడు కొడుకు, "నా జీవిత ప్రభాతంలో ఇంకా పది గంటలైనా కాలేదు. ఇప్పుడే ఎందుకింత తొందర, అప్పుడే ఎందుకీ బాదర బందీ ? అప్పుడే పెళ్ళి పంజరంలో నా మనః కీరం ఎందుకు బందీ ?" అని ప్రశ్నిస్తాడు. తండ్రి "ఒంటరితనం అడవి లోపల యౌవనం వెన్నెలలా వేస్టు కాకూడదని" చెప్తాడు. సేవకుడు వచ్చి, "ఎవరో వచ్చారండి, కవటాకుల్లో ఈనెల్లాంటి వాళ్ళు, రివటల్లాంటోళ్ళు, సీతాకోక సిలకలు, అప్పాసెల్లెళ్ళలా గున్నారు, ఆరతికర్పూరంలాగున్నారు, ఆళ్ళతో ఆళ్ళ అయ్యగార్లొచ్చారండి, ఇద్దరూ రెండు ఇనప్పెట్టెలాగున్నారండి"—ఇలా సాగిపోతుంది నాటిక ! చదివి ఆనందించవల్సిందే తప్ప, చెప్పి మురిపించేందుకు శక్తి చాలదు.

'ఛందస్సుతో అందంగా చాకిరీ చేయించుకున్నాడు ఆరుద్ర' అని ఎపుడో శ్రీశ్రీ అన్నాడు. నిజం ! "తొయ్యోయ్, మొయ్యోయ్ మొయ్, మొయ్యోయ్, తొయ్యోయ్ తొయ్, ఇంకా ఇంకా రాజ, ఇంకా ఇంకాన య్న, లాగండ్రా బ్రతుకు, లాగండ్రా బరువు"— అన్నప్పుడు బరువు మోసింది ఛందస్సు కాదా మరి !

ఆరుద్ర మంచి కవి ! మంచి కవిత్వం వ్రాసిన కవి ! తెలుగువాడు బ్రతికున్నంత కాలం తెలుగు గుండెలో బ్రతికే కవి ! ★

# యువతా! మేలుకో!!

"హిప్పీ జుట్టు, గొట్టం పాంటు
జర్కిన్ షర్టు, డిస్కో డాన్సు
కొందరి యువకుల సొత్తు
అంతటితో అది సరిపోక
వెంటబడుదురు అమ్మాయిలెవక"

కవి కలం నుంచి జాలు వారిన కవితే కాదది, నిత్యం సంభవించే సంఘటనల ప్రతి రూపమది. ఇక మరో వంకకు తిరుగుదాం —

## హరివిల్లు

**— ప్రసాద్**

స్ట్రగుల్ తోటి స్టడీ చెడదురా
స్టడీ కోసమే స్ట్రగులవ్వుమురా !

చీకటి మాటున గోడల మీద ప్రత్యక్షమయ్యే వ్రాతలవి. ఉపన్యాసాల హోరు వుద్రేకంగా మారి రక్తాన్ని వేడిక్కిస్తే మనసులలో కలిగే భావాల సమాహారమది.

ఇంకో ప్రక్కకు తిరిగితే —

సినిమాలే జీవిత పరమావధిగా, తారల పూజలే జీవిత ధ్యేయంగా, వారి స్మరణే జీవిత లక్ష్యంగా కాలం వెళ్ళబుచ్చే వారు మరి కొందరు.

"కుడి ఎడమైతే పొరపాటు లేదోయ్" అనే పాట దేవదాసు నోటి వెంట పలికించిన ఆ కవి ఏనాడు వ్రాశాడో కాని, ఆ దేవదాసే నేడు ఎందరికో స్ఫూర్తి దాతయ్యాడు. ఆ స్ఫూర్తితో, మైకంయిచ్చిన పరధ్యాసంతో సర్వం మరిచిపోయి బాటిల్ సంస్కృతికి దాసులయి పోయేవారుఎందరో!

ఇక మహా కవి దర్శించిన కుర్రవాళ్ళు ఎలా వున్నారో చూద్దాం —

కొంతమంది కుర్రవాళ్ళు పుట్టుకతో వృద్ధులు- పేర్లకీ, పుకార్లకీ, పకీర్లకీ నిబద్ధులు. నాన్నగారి తాతగారి భావాలకు దాసులు- నేటి నిజం చూడలేని కీటక సన్యాసులు ...

దేశానికి వెన్నెముకగా పరిగణింపబడుతూ, దేశ జనాభాలో అధిక శాతం వున్న యువత స్థితిని గమనించాం.

'స్వరాజ్యం నా జన్మ హక్కు' అని తిలక్ మహాశయుడు గర్జిస్తే, ఎందరు వీర కిశోరులు ఆనాటి స్వాతంత్ర్య సంగ్రామంలోకి దూకలేదు? చదువు, సంధ్యలు మానివేసారు, తిండీ తిప్పల సంగతి మర్చిపోయారు. వీర సావార్కర్ విరచిత "1857 స్వాతంత్ర్య పోరాట" గ్రంథమే అందరికీ పారాయణ గ్రంథం. వీర శివాజీ, ఝాన్సీరాణి, రాణాప్రతాప్, గురుగోవింద్‌సింగ్‌ల సాహసకృత్యాలే వారిని వుత్తేజపరిచే విషయాలు. వారి ప్రతి మాటలోను, చేతలోను దేశ స్వాతంత్ర్య దీక్షే కనబడుతుండేది. 'వందేమాతరమ్' అని వినదిస్తూ బ్రిటీష్ రక్కసి మూకలకు ఎదురు నిల్చారు, వారి లాఠీ దెబ్బలను పూలహారాలుగా స్వీకరించారు, తుపాకీగుండ్లకు ధైర్యంతో గుండెలను చూపించారు, మరణించవల్సి వచ్చినా చిరునవ్వుతోనే ఆఖరిశ్వాస పీల్చారు.

"బ్రిటీష్ వారిని దేశం నుంచి తరమాలి, దేశమాత దాస్య శృంఖలాలు ఛేదించాలి" యిదే వారి ధ్యేయం. ఇక్కడ రెండు సంఘటనలు గమనిద్దాం —

1921 లో సహాయ నిరాకరణ వుద్యమ సందర్భంగా చంద్రశేఖర్ అజాద్‌ను పోలీసులు అరెస్టుచేసి మేజిస్ట్రేటు ముందు హాజరుపర్చారు.

'నీ పేరేమిటి?' మేజిస్ట్రేట్ ప్రశ్నించాడు.

'అజాద్' జవాబు. అజాద్ అంటే హిందీలో స్వేచ్ఛ అని అర్థం. కోపమొచ్చిన మెజిస్ట్రేట్ 'నీ తండ్రి పేరేమిటి ?' అని అడిగాడు.

'స్వాధన్' అన్నాడు. స్వాధన్ అంటే స్వాతంత్ర్యం అని అర్థం.

'మీదేవూరు ?' మళ్ళీ ప్రశ్న.

'జైలు' అన్నాడు ఆ కుర్రవాడు.

మెజిస్ట్రేట్‌కు కోపం వచ్చింది. 16 హంటర్ దెబ్బల శిక్ష విధించాడు. కాశీ సెంట్రల్ జైల్లో పోలీసులు అతనిని కొడుతుంటే 'అయ్యో' అనలేదు సరికదా 'వందేమాతరమ్' అంటూ నేలమీదకి ఒరిగిపోయాడు.

సుభాస్‌చంద్రబోస్ కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజీలో చదువుకుంటున్న రోజుల్లో ఎఫ్. సి. ఓటెన్ అనే ఆంగ్లేయుడు లెక్చరర్‌గా పనిచేస్తున్నాడు.

అతనికి భారతదేశమన్నా భారతీయులన్నా చాలా చులకనగా వుండేది. ఒకనాడు భారతదేశాన్ని క్లాసులో తెగ తిడుతున్నారు. అతని తిట్లు వినలేని బోస్ అతని మీదకి సింహంలాగా లంఘించి పాదరక్షతో చెంపమీద కొట్టాడు. అయితే ఆ తర్వాత బోస్‌ని రెండేళ్ళపాటు ఆ కాలేజీలో చదివే వీలులేకుండా డిబార్ చేసారు.

ఆనాటి యువకుల దేశభక్తి అలాంటిది. స్వదేశీ వుద్యమంలో గుట్టలు గుట్టలుగా విదేశీ వస్త్రాలను దహనం చేసారు. వున్నత పదవులను దూదిపింజల్లా తేలికగా విసర్జించారు.

కాని నేడు యువకుల ఆగ్రహానికి స్వదేశీ బస్సులు గురౌతున్నాయి. దేశ సమైక్యతకు అనుసంధానంగా నిలచిన రైలుబళ్ళు నిలిపివేయబడుతున్నాయి.

ఒకటేమిటి అనేకం దగ్ధం గావింపబడుతున్నాయి. ఏమిటి కారణం ? అమూల్యమయిన స్వేచ్ఛను దుర్వినియోగం చేయటం, 'ఇది నా దేశం' అనే భావన లోపించడం. జపాన్ దేశంలో ప్రతి కార్మికుడు తన దేశ గౌరవ ప్రతిష్ఠలను దృష్టిలో వుంచుకొని వస్తువులు తయారుచేస్తారుట. కాని మన దేశంలో వ్యక్తిగతమైన స్వార్థానికి వుపకరించే పనులే చేపడుతుంటారు. ఈ స్థితి మారాలి. దేశ జనాభాలో అధిక శాతం వున్న యువకులు, దేశానికి వెన్నెముకగా పరిగణింపబడుతూ, దేశ ప్రయోజనాలను దృష్టిలో వుంచుకోకపోతే, మన పూర్వులు శ్రమించి సాధించిన స్వాతంత్ర్యం నిలిచేనా ? తప్పక నిలుస్తుంది. ప్రపంచంలో ఏ ఒక్క శక్తి మన వంక కన్నెత్తి చూడలేని దశ వస్తుంది. అందుకు ఒక్కటే మార్గం. యువకులు తమను తాము దేశ సేవా కార్యంలో సమర్పించుకునేందుకు సంసిద్ధులు కాగల్గాలి. ఈ కార్యాన్ని దేశ వ్యాప్తంగా రాష్ట్రీయ స్వయం సేవక సంఘ్ చేపట్టి గత అరవై సంవత్సరములుగా కృషి చేస్తున్నది. బాల్యదశ నుంచే చక్కని సంస్కారాలను ప్రోదుచేసే ప్రక్రియను యీ సంస్థ ఆచరణలో చూపగల్గుతున్నది. అంతేకాదు గత చరిత్రలోని అమూల్య విషయాలు ఎరుకపరచి దేశ భక్తిని నరనరాల్లో జీర్ణింప చేస్తున్నది. అందుకే యీనాడు దేశవ్యాప్తంగా లక్షలాది యువకులు దేశమాత సేవలో సర్వస్వం త్యాగం చేయటానికి సంసిద్ధులుగా వున్నారు. ఎక్కడ ఏ విపత్తు వచ్చినా స్వప్రేరణలో ముందుకు దూకే సంసిద్ధత వారికుంది. ఇలానే మరికొన్ని సంస్థలు కూడా పనిచేస్తున్నాయి. దేశంలోని యువజనులంతా యీ దశగా పయనించ గల్గినపుడు దేశ స్వాతంత్ర్యానికి భయం వుండదు. దేశ సమైక్యతకు హాని జరగదు.

వివేకానందుడు చెప్పినట్లుగా వుక్కు నరాలు యినుప కండరాలు, వజ్ర కఠోరమైన మనస్సు గల వారుగా యువత రూపొంద గల్గాలి.

"నీ జాతి హితం కొరకు, మానవాళి శ్రేయస్సు కొరకు నిన్ను నీవు సమర్పించుకోవటమే సర్వోత్తమ కార్యం" అన్న స్వామి మాటలు అందరకూ శిరోధార్యం కాగల్గాలి.

వివేకానందుని జన్మదినమైన జనవరి 12 వ తేదీని జాతీయ యువజన దినోత్సవంగా పరిగణించటానికి కేంద్ర ప్రభుత్వం నిశ్చయించటం ఎంతో ముదావహమైన విషయం.

★

# వృత్తి విద్య - వృత్తి విద్య

ఏ దేశంలోనైనా విద్యా విధానం పెడదోవ పడితే మరే విధంగానూ ఆ దేశం పురోగమించలేదు. అందుకే మాంటుసోరి అనే ఆయన మాటల్లో నేడు అవసరమైన అతి-ముఖ్యమైన సమాజ సంస్కరణ, విద్యను మానవుల పరం చేసి దేశ అవసరాలకు అనుగుణంగా మలచుకోవడమే. విద్య అంటే ఏమిటో అనేక ప్రముఖులు అనేక విధాలుగా నిర్వచనాలు చెప్పారు. అరిస్టాటిల్ అనే గ్రీక్ తత్వవేత్త, విద్యాధికుడు, విద్య ఉన్నత మనస్కులుగా మానవులను మార్చే సాధనంగా పేర్కొన్నాడు. స్వామి వివేకానంద విద్య మానవులలో అదివరకే చోటు చేసుకొన్న వివేకాన్ని పెంచే మాధ్యమం అని, అది వ్యక్తి శీలాన్ని, మేధాశక్తిని పెంచి బుద్ధి వికాసానికి తోడ్పడే మార్గమని చెప్పారు.

డా॥ పి. జి. కృష్ణమూర్తి

అయితే ఈ విద్య ఎలా అభివృద్ధి చెందాలి?

"జలబిందు నిపాతేన, క్రమశః పూర్వతేఘటః
సహేతు సర్వ విద్యానాం ధర్మస్యచ ధనస్య చ."

( ఒక్కొక్క నీటి బొట్టే పడుతూ ఉంటే కుండ నిండినట్లు, విద్య, ధర్మ, ధనం కూడా క్షణం, క్షణం, కణం, కణం సాధించి పెంచుకోవాలి )

మన సాధారణ విద్య విజ్ఞాన సముపార్జనకు దోహదం చేయకపోగా వృత్తి విద్యకు సోపానంగా కూడా పొసగక వృత్తి విద్యగా మిగిలిపోయింది. ఈ దేశంలో విద్యను గూర్చిన చర్చ, సమీక్ష శతాబ్దికి పైబడి చర్చనీయాంశంగా జరుగుతూ వచ్చింది. వృత్తివిద్య అవసరాన్ని గుర్తించడం, ఆలోచించడం కూడా అప్పటి నుండి కొనసాగుతూ వచ్చాయి. 1854 లో వుడ్స్ డిస్పాచ్‌కూ 1964 లో కొఠారి కమీషన్‌కు మధ్య కాలంలో వృత్తివిద్య గురించి చర్చించిన ఇతర సంఘాలు : హన్టర్ కమీషన్ ( 1882 ), కలకత్తా విశ్వ విద్యాలయాల కమీషను ( 1919 ), హార్టగ్ కమిటి ( 1929 ), సార్జంట్ ప్లాన్ ( 1944 ), విశ్వవిద్యాలయ విద్యా కమీషన్ ( 1948 ), సెంకడరీ విద్యాకమీషన్ ( 1962 )

జాతీయ విదానపు విద్యా తీర్మానం 1968 లో కొఠారి కమీషన్ సిఫారసులను అంగీకరించి సాంకేతిక, వృత్తి విద్యలలో వసరులను పెంచ వలసిన అవసరాన్ని గుర్తించింది. దానిలో భాగంగా వ్యవసాయం, పరిశ్రమలు, వర్తకం, వైద్య, ఆరోగ్య రంగాలలో అనువర్తించే విధంగా విద్యను పరిపుష్టంచేసి అభివృద్ధి పరచాలని నిర్ణయం జరిగింది. విద్య ప్రయోజనాత్మకం కావాలనేది సర్వదా, సర్వధా అంగీకరించ బడినదే. అయితే అలాకాలేదనే ఆందోళన కూడా అందరితోపాటే భారతదేశ నేతలకు కూడా కల్గి తిరిగి గత ఆగష్టులో విద్యా విధానంలో ముందడుగుగా ఒక విధాన దృక్పథ పత్రాన్ని ప్రవేశపెట్టారు. ఈ పత్రంలో అనేక అభివృద్ధి దాయక, ఆశాజనక, ఆదర్శ ఆశయాలు పొందుబరచబడ్డాయి. అయితే ఆచరణలో అవి ఎంతవరకు కొనసాగుతాయో నెరవేరతాయో వేచి చూడాలి. ఈ విధాన దృక్పథం రాబోయే శతాబ్దంలోని పరిస్థితులకు అనుగుణంగా జనాభా, ఉత్పాదన ఉపాధి స్థితిగతులను దృష్టిలో ఉంచుకొని ఏర్పరచినదిగా పేర్కొనబడినది.

## వృత్తి విద్య :

విద్యను అభివృద్ధి కార్యకలాపాలతో జోడించటానికి వృత్తివిద్యకు తగిన ప్రణాళికా బద్ధమైన కార్యక్రమాన్ని

రూపొందించటం, శిక్షణ ఇవ్వడం, దానిని సమర్థవంతంగా అమలు పరచడమే సముచిత విధానం. వృత్తి విద్యను గూర్చి కూడా అనేక మంది నిపుణులు, సంస్థలు అనేక నిర్వచనాలు ఇచ్చారు. 1974 లో ఐక్యరాజ్య సమితికి అనుబంధమైన విద్యా, విజ్ఞాన, సాంస్కృతిక విభాగం సూచించిన మేరకు సాధరణ విద్యతోపాటు, సాంకేతిక విద్య, సంబంధిత శాస్త్రాల అధ్యయనం, ప్రయోగాత్మక నైపుణ్యాల సముపార్జన, ఆర్థిక, సాంఘిక జీవనరంగాలలోని వివిధ వృత్తులకు సంబంధించిన ధోరణులను అర్థంచేసుకొనే పరిజ్ఞానం ఇందులో చేరతాయి.

వృత్తి విద్యలు పాఠశాల విద్య ముగియగానే ప్రారంభింపబడి అర్హులైన సుమారు 50% విద్యార్థులకైనా ప్రత్యేకమైన శిక్షణతో కొనసాగాలనేది పై ముసాయిదాలోని సారాంశం. ఈ వృత్తి విద్య లక్ష్యం-సామాజిక మార్పులను తీసుకురావడం ఉత్పత్తికి, ఆర్థికాభివృద్ధికి, వ్యక్తిగత శ్రేయస్సుకు తోడ్పడం. ఇందులో మానవ వనరుల పరిరక్షణ, సద్వినియోగం ప్రధాన అంశాలు. వర్ణాశ్రమ ధర్మాలు అంతరించిన ఈ సమాజంలో ఇప్పుడు వ్యక్తులకు వృత్తులను కులం ప్రాతి పదికగా నిర్ణయించడం సాధ్యంకాని పని. అందుకే అవసరం, అర్హత ప్రాతిపదికగా అవి సమకూర్చబడాలి. ఇందులో శిక్షణ అతి ప్రాధాన్యమైన అంశం. దీనికి ప్రస్తుతం 7,00,000 మంది విద్యార్థులకు, 1700 హైయర్ సెంకండరీ పాఠశాలలే కాక, 5000 వృత్తివిద్యా సంస్థలు కూడా దేశంలో నెలకొని ఉన్నాయి. ఈ సంస్థలు ఉద్యోగితకు సంబంధించిన అనేక వ్యవస్థిత రంగాల అవసరాలను తీర్చడానికి సంస్థాగత నియత కార్యక్రమం ద్వారా పూర్తికాలం శిక్షణ ఇస్తున్నాయి. అటువంటివి మన పాలిటెక్నికల్ కళాశాలలు, ఐ టి. ఐ లు మొ॥ నవి. ఇంకా అనియత వృత్తి విద్యాకోర్సులను నిర్వహిస్తున్న విజ్ఞాన కేంద్రాలు కూడా పని చేస్తున్నాయి.

అయితే పెరుగుతున్న జనాభా వనరుల పెరుగుదలతో సంబంధం లేకుండా వరదలాగా వస్తున్నప్పుడు ఈ విధాన నిర్ణయాలు, ప్రణాళికా సాధనాలు, సంస్థాగత శిక్షణా వ్యవస్థలు ఏమూలా చాలవు. సమాజ స్థిత ప్రవృత్తి మారినప్పుడు సామాజిక స్థితి గతులు మెరుగుపడి వృత్తి అనే సమస్య సమసిపోయి అందరికీ భృతి లభ్యమవుతుంది. గ్రామ సీమల్లో ప్రజా బాహుళ్యానికి ముమ్ముందు సరిఅయిన అవగాహన అవసరం. విద్యార్థులలో సాధారణ విద్య పట్ల గల వెర్రి వ్యామోహం తగ్గించడం మరింత అవసరం. వృత్తులను బహుముఖంగా విస్తరింప జేయడం స్వయం కృషిని పెంపొందింప జేయడం జాతి యావత్తుకు అత్యావసరం. లేకపోతే మన విద్య అవిద్యా మార్గంలోనూ వృత్తి విద్యా విధానం వృత్తివిద్యా విధానంగా మారక మానవు. ★

" అమ్మా ! "

" రా నాన్నా ! " చేతులు చాచింది చందన.

ఒక్క అంగలో ఆమె దగ్గరి కొచ్చి పడ్డాడు బాబు.

" బాబూ !... ఇన్నాళ్ళూ ఎక్కడున్నావ్ ? " వాణ్ణి దగ్గరికి తీసుకుంటూ అంది చందన. వాడిని అలా చూస్తుంటే ఎంతో తృప్తిగా వుందామెకి.

" విమానం ఎక్కి ఎక్కడికో వెళ్ళాను! ఆ తరవాత మళ్ళీ ఇక్కడి కొచ్చాను! " అన్నాడు బాబు.




" మరి నీకు వీళ్ళు అన్నం అవీ పెట్టారా ? "

" ఆ ! "

" మీ నాన్నగారిమీద బెంగగా వుందా ? " నవ్వుతూ అడిగింది.

ఓసారి ఆమె మొహంలోకి చూసి—

" అవును ! " అన్నాడు బాబు.

" మనం మీ నాన్న దగ్గరి కెళ్ళిపోదామా ? "

"          "

" మాట్లాడవేం ? .... మీ నాన్న దగ్గరికి మనం వెళ్ళద్దా ? "

" వెళ్తాను ! "

" వెళ్తాను కాదు ! వెళ్దాం అనాలి ! "

" ఉఁహుఁ ! నేనే వెళ్ళిపోతాను ! "

" అదేవిఁటి "....ఆశ్చర్యపోయింది చందన. బాబు మాట్లాడలేదు. " మరి....నేను రావద్దా ! " అంది మళ్ళీ.

" ఉహుఁ ! వద్దు ! " తక్కున అన్నాడు బాబు.

" ఎందుకు ? " బిత్తరపోయింది చందన.

" నువ్వు మీ ఇంటి కెళ్ళిపో ! "

" అది కాదు బాబూ !....నేను మీ అమ్మని కదా...."

" కాదు ! "

" బాబూ ! " విస్మయంగా చూసిందామె.

" అవును ! నువ్వు మా అమ్మవి కాదు ! మా అమ్మ చచ్చిపోయింది ? " దుఃఖంతో వాడి కంఠం పూడుకు పోయింది.

" ఛ ! ఎవరన్నారలా ?....మీ అమ్మేం చచ్చిపోలేదు ! నేనే మీ అమ్మని ! " వాడిని కౌగిట్లోకి తీసుకోబోతూ అంది చందన.

వాడు దూరంగా జరిగి—

" విలనంకుల్ అన్నారు ! " అన్నాడు.

" విలనంకులా ? "

" అదే మావయ్యా ! .... నీ పెళ్ళి చెడగొట్టాలనే నన్ను మీ ఇంటికి తీసుకొచ్చారట ! అందుకే ఇప్పుడు పంపేస్తారట ! నిజం ! ఒట్టు ! " వాడి కళ్ళలోంచి నీరు బొట్లు బొట్లుగా పడి చొక్కాని తడిపేస్తోంది.

వాణ్ణి చూస్తుంటే చందనకి కడుపు తరుక్కుపోయింది. వాణ్ణి పొదివి పట్టుకుని—

" అబద్ధం ! విలనంకుల్‌కి మనం అంటే ఇష్టంలేదు ! అందుకే అలా అబద్ధం చెప్పాడు ! చూశావ్‌గా....ఇప్పుడు నీలాగే నన్నూ బంధించాడు ! .... నిజంగా నువ్వు నా కొడుకువే ! " అంది చందన. ఆమె కళ్ళు కూడా నీళ్ళతో నిండుకున్నాయి.

" మరి ఆరోజు నువ్వు నా కొడుకువే కాదు అని ఎందుకన్నావ్ ? " నిలదీశాడు బాబు.

గతుక్కుమంది చందన. వెంటనే తేరుకుని—

" అబ్బే ! తమాషా కన్నాను ! .... నిజంగా నువ్వు నా కొడుకువే ! ఒట్టు ! " అచ్చం వాడిలాగే ఒట్టేసింది.

" నిజంగానా ? " వాడి కళ్ళు మెరిశాయి.

" నిజం ! ఒట్టేశాగా ? .... "

" అమ్మా ! " అంటూ ఆమె గుండెల్లో తలదాచుకుని బావురుమన్నాడు బాబు.

* * *

సారధి మనసంతా కందిరీగల తుట్టెలా వుంది. పాపాల బరువుతో కృంగిపోయిన అతని హృదయాన్ని పశ్చాత్తాపం కార్చిచ్చులా దహించేస్తోంది. చిత్రంగా అతనిలో మార్పొచ్చింది.

" ఇప్పుడు తనేం చెయ్యాలి ? .... రాఘవ చేసే హోమంలో మరో సమిధ వేసి, ఆ మంటలో ఓ అమాయకురాలు ఆహుతి అయిపోతుంటే చూస్తుండాలా ? .... ఇంకా పాపాలు పోగుచేసుకోవాలా ? ....

( జరిగిన కథ )

చందనని, జయంత్‌ని చూసిన రాఘవ, మురళి బిత్తరపోయారు. 'ఏం మామయ్యా' అంటున్న చందనని 'నీకు పిచ్చి...' అని ఆగాడు రాఘవ. 'లేదు' అంది చందన. 'నేను పురుడు పోసినపుడు' అన్న మాటలు విని వెనక్కి తిరిగి చూసాడు రాఘవ. కాశ్మీర్ డాక్టర్ కనిపించింది. తమిద్దరి నాటకం బయట పడిందని తెల్సుకున్నారిద్దరు. దేవకి కూడా రాఘవని అసహ్యించుకుంది. నాటకానికి తెర పడబోతుందన్న సమయంలో రాఘవ పిస్టల్ బయటకి తీసి చందనని బెదిరించి 'బాబు'ని బంధించి ఉన్న చోటకి తీసుకెళ్ళాడు. సారిధి సహాయంతో తన పెండ్లి ప్రయత్నాలు మొదలుపెట్టాడు రాఘవ.

రాఘవ పెళ్ళి చందనతో జరుగుతుందా ?

( ఇక చదవండి )

ఇప్పటికే తనెన్నో పాపాలు చేశాడు. ఎందరో వుసురు పెట్టాడు. ఆ వుసురు తగలకుండా వుంటుందా?.... లేదు ! తగిలింది !.... అప్పుడే తన ప్రతాపం చూపిస్తోంది. ...."

అప్రయత్నంగా సారధి తన మోచేతిమీది మచ్చలు చూసుకున్నాడు. బాబుని తెచ్చిన మర్నాడే ఆ మచ్చల మీద అనుమానం వచ్చిందతనికి. స్పర్శజ్ఞానాన్ని కోల్పోయిన ఆ మచ్చని డాక్టర్‌కి చూపించాడతను. ఆ డాక్టర్ ఆ వ్యాధిని కుష్ఠు వ్యాధిగా తేల్చాడు.

అంతే మొదలు నరికిన మానులా కూలిపోయాడు సారధి. తను చేసిన పాపాలు వికటాట్టహాసం చేసి మరింత భయపెట్టాయి.

" మైగాడ్ ! .... ఈ వ్యాధి ఇలాగే పెరిగి పోతే.... వీధిలో అడుక్కునే కుష్ఠు వాళ్ళలా .... ఓహ్ ! .... " ఏడ్చాడు ! .... వెక్కి వెక్కి ఆడదానిలా ఏడ్చాడు. బహుశా అప్పట్నించే అతనిలో ఎక్కువ మార్పు వచ్చింది .... బాబుని వాళ్ళ తండ్రి దగ్గరికి చేర్చాలన్న ఆలోచనా వచ్చింది.

అందుకే .... ఇప్పుడు రాఘవ చేసే ఘాతుకాన్ని ఆపాలి ! .... కనీసం బాబుని కాపాడే ప్రయత్నం చెయ్యాలి ! .... తనకెలాగూ ఎవరూ లేరు. దిక్కు మొక్కు లేని ఒంటరివాడుగానే మిగిలి పోయాడు. కానీ.... ఇప్పుడు మరో కన్నతండ్రిని బిడ్డని వేరు చేసి మరింత చరిత్రహీనుడు కాకూడదు ! " అనే నిర్ణయాని కొచ్చిన సారధి మెల్లగా లేచి చందన ఇంటికేసి నడిచాడు. అతను వెళ్ళేసరికి శాంతారామ్‌గారు హాల్లో కంగారుగా పచార్లు చేస్తున్నారు.

" సర్ ! .... " మెల్లగా పిల్చాడు సారధి.

" ఎవరు ? " పచార్లు ఆపి అన్నాడాయన.

" నా పేరు సారధి ! .... "

" ఎవరు కావాలి ? "

" శాంతారామ్‌గారు .... "

" అవును ! నేనే ! .... "

" మీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి ! " అన్నాడు సారధి.

" నాతోనా ? " కళ్ళు చిట్లించాడాయన.

" అవును ! ప్లీజ్ ! ముఖ్యమైన విషయం ! "

" చెప్పండి ! "

" మీ చందన .... "

" మా చంద....?....చందన విషయం తెలిసిందా ? " ఆదుర్దాగా అన్నాడు శాంతారామ్.

" తెలుసు ! " అన్నట్టు తల వూపాడు సారధి.

" ఎక్కడ ? .... ఎక్కడుంది ! "

" వూరి చివరి పాడుపడ్డ బంగ్లాలో ! "

" పాడుపడ్డ బంగ్లాలోనా ? " అనుమానంగా చూశాడాయన.

" అవును !....ఆమే కాదు !....బాబు కూడా అక్కడే వున్నాడు ! "

" బాబు కూడానా ! పదండి ! " ఆతృతగా చెప్పుల్లో కాళ్ళు దూర్చాడు శాంతారామ్.

" ఇలా వెళ్తే లాభం లేదు ! "

" ఏం ? "

" వాళ్ళు రహస్యంగా బంధించి వుంచారు. అక్కడికెళ్ళి వాళ్ళని తీసుకురావడం అంటే అంత తేలికైన విషయం కాదు ! " అంటూ జరిగింది క్లుప్తంగా చెప్పాడు సారధి.

శాంతారామ్ మొహం పాలిపోయింది. " మరైతే ఏం చేద్దాం ? " అన్నాడు కంగారుగా.

పోలీసుల సహాయంతో ముందు వాళ్ళని రక్షించాలి ! ఆపై బాబుని వాళ్ళ నాన్న దగ్గరికి చేర్చాలి !....అప్పుడు నే ననుకున్నది సాధించినట్టు ! " గొణిగినట్టు అన్నాడు సారధి.

" బాబు నాన్న మీకు తెలుసా ? "

" ఉఁహుఁ ! ఇల్లు మాత్రం తెలుసు ! "

" ఇల్లు తెలుసా ? ఎలా ? " ఆశ్చర్యంగా చూశాడు శాంతారామ్.

గతుక్కుమన్నాడు సారధి. తన పొరపాటుని కప్పి పుచ్చుకుంటూ——

నా కొడుకు " బాబు స్నేహితుడు ! ఓసారి అటు వెళ్తుంటే వాళ్ళిల్లు చూపించాడు ! " అందంగా అబద్ధాలాడాడు.

" అయితే ఇప్పుడేం చేద్దాం ? " అన్నాడు శాంతారామ్.

" పోలీసులకి ఫోన్ చెయ్యండి ! నేను పురోహితుణ్ణి, పెళ్ళి సామాన్లు తీసుకొస్తాను ! " అన్నాడు సారధి.

" పురోహితుడు, పెళ్ళి సామాన్లు........"

" ఊరికే నటన !....అలా నటించకపోతే అక్కడికి నాకూ ప్రవేశం వుండదు ! అందుకే మీరు వచ్చి రెడీగా బైట వుండండి. సమయం చూసి నేను విజిల్ వేస్తాను ! అప్పుడు పోలీసులు, మీరూ రంగంలోకి వద్దురుగాని ! " అన్నాడు సారధి.

"సరే " అన్నట్టు తలూపాడు శాంతారామ్.

" మరి నే నొస్తా !...." వెనుతిరిగాడు సారధి.

" ఒక్క క్షణం ! .... " అని—

" జయంత్ ! " అన్నాడాయన బిగ్గరగా.

లోపల్నించి జయంత్ పలికాడు.

" ఒక్కసారిలా రండి ! "

జయంత్ హాల్లో కొచ్చాడు.

" వీరికి బాబు, చందనల వునికి తెలిసింది ! " వుత్సాహంగా అన్నారు శాంతారామ్. జయంత్ మొహం క్షణం వెలిగింది—

" నిజవాఁ ? " అన్నాడు ఆనందంగా.

" అవును !....మిస్టర్....సారధీ ! ఈయన మిస్టర్ జయంత్ !....బాబు తండ్రి ! అంటే....మీ బాబు ఫ్రెండ్‌కి నాన్న ! .... మీకు మునుపు పరిచయం లేకపోయినా ఇప్పుడు నేను చేస్తున్నాను ! " అన్నాడు శాంతారామ్.

ఏదో ఆలోచిస్తున్న సారధి చివ్వున వెనుతిరిగి—

" నమస్తే ! " అన్నాడు.

అంతే ! జోడించిన ఆ చేతు లలాగే వుండిపోయాయి. కొయ్యబారిపోయినట్టు నిల్చుండిపోయాడు. అతన్ని చూసిన జయంత్ " నువ్వా ? " అన్నాడు కర్కశంగా.

( స శే షం )

# ఆంధ్రదేశానికి అతిథులు పెలికాన్ పక్షులు

డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు




పెలికాన్ పక్షుల స్థావరం ఐరోపాఖండం. అక్కడి శీతాకాలపు చలిగాలులను తట్టుకోలేక ఉష్ణమండలంలోవున్న మన దేశానికి వలస వస్తాయి. మన రాష్ట్రంలోని కొల్లేరు సరస్సు, నేలపట్టు, తెలినేలపురం వీటికి ఆతిథ్యమిస్తాయి. మన ప్రాంతంలో వీటిని కొల్లేటి కొంగలని వ్యవహరిస్తుంటారు.

పెలికాన్ పక్షులు అటు ఎగరటానికి, ఇటు నీటిలో ఈదటానికి అనువైన శరీరాన్ని కలిగివున్నాయి. తెలుపు, బూడిద, జేగురు రంగుల్లో కనిపించే ఈ పక్షుల్లో మగపక్షి ఆడపక్షికన్నా పెద్దది. సుమారు పదకొండు కిలోల బరువుండే ఈ పక్షికి తెడ్డుకలిగిన కాళ్ళు వుంటాయి. అందువల్ల నేలమీద వీటి నడక వికారంగా వుంటుంది. ఎగురుగల పక్షుల్లో పెలికాన్ పెద్దది. వీటి రెక్కలు సుమారు తొమ్మిది అడుగుల వెడల్పున తెరచుకుంటాయి. పెలికాన్ ప్రత్యేకత కింది దవడ కింద వేళాడుతుండే తిత్తి. సాగే గుణం గల ఈ తిత్తి ఆహార సంపాదనలో ఉపయోగపడుతుంది.

పెలికాన్స్ ఆహారం చేపలు. కింది దవడకు వేళాడే తిత్తిని వల లాగా ఉపయోగిస్తూ నీటిమీద ఈదుతుంది. నీటితో పాటుగా తిత్తిలోకి చేరిన చేపలను పెలికాన్ మింగుతుంది. తిత్తిలో చేరిన చేపలు తప్పించుకు పోకుండా పై దవడ మూతలాగా కప్పివుంచుతుంది. అప్పుడప్పుడు పెలికాన్స్ గుంపుగా ఏర్పడి చేపలను వేటాడుతాయి. పదిపన్నెండు పెలికాన్ పక్షులు U ఆకారంగా ఏర్పడి నీటిలో ఈదుతూ, తమ రెక్కలతో నీటిమీద దబదబ బాదుతూ నీటిలో అలజడిని సృష్టిస్తాయి. ఆ అలజడికి భయపడిన చేపలన్ని U ఆకారంలోపలికి చేరుతాయి. అప్పుడు ఆ చేపలను పెలికాన్స్ భుజిస్తాయి.

ఉష్ణ ప్రాంతాలకు వలస వెళ్ళేప్పుడు Λ ఆకారంగా ఏర్పడి గుంపులు గుంపులుగా ప్రయాణం చేస్తాయి. ఆకాశంలో ఏర్పడే వేడిగాలులు పెలికాన్స్ వేగంగా ప్రయాణం చేయటంలో సహాయపడతాయి. వలసప్రాంతానికి చేరగానే పెలికాన్స్ జంటకడతాయి. ఎత్తుగా ఉండే చెట్లమీద నివాస మేర్పరుచుకుంటాయి. మగపక్షి గూడుకు కావాల్సిన పుల్లలను ఏరుకొస్తుంది. ఆడపక్షి గూటిని నిర్మిస్తుంది. ఆడపక్షి సాధారణంగా రెండుగుడ్లు పెడుతుంది. గుడ్లు తెల్లగా పొడుపుగా వుంటాయి. ఆడ మగ పక్షులు వంతులు వేసుకుని పొదుగుతాయి. 35-40 రోజుల్లో పిల్లలు బయటకు వస్తాయి. రెక్కలు

( తరువాయి 80వ పేజీలో )

# కౌటిల్యుని అర్థశాస్త్రములో వృక్షాయుర్వేదము

రాజ్యమందలి ప్రజలు ఐహికముగ సమస్త వస్తువులు కలిగి వాటి ఉపయోగ విశేషములచే చాలా అభివృద్ధి కలిగి మనగలగడమే ప్రయోజనము అనే విషయాన్ని మనసులో తలపోసి, వాటి ధర్మ విధులను, ప్రయోజనములను, పద్ధతులను వివరముగ తెలియజేసేదే కౌటిల్యుని అర్థశాస్త్రము.

ప్రజానుకూలత, అభివృద్ధి, లేని పరిపాలన నిరర్థక మని నమ్మిన అతడు ప్రజోపకరమైన, రాజ్యార్హమైన మార్గములను తన అర్థ శాస్త్రములో తెలియజేశాడు.

ఇప్పటికి 24 శతాబ్దాలకు పూర్వం అనగా క్రీస్తు పూర్వం నాలుగవ శతాబ్దంలో అటువంటి గ్రంథం భారత దేశస్థులకుండడం చాలా గొప్ప విషయం. చిరస్మరణీయ మైనదీ-

ఈ గ్రంథం కేవలం రాజ్యపాలనకే పరిమితం కాలేదు. పదార్థం అంటే వస్తువు అని కూడా అర్థం.

భోజన పదార్థములు, వాడుక పదార్థములు, లోహ పదార్థములు, వ్యవసాయము చేసి పండించినవి, రసాయనిక పదార్థములనీ లెక్కలేనన్ని విధములా వుండేవి.

ప్రస్తుతాంశం కౌటిల్యుని అర్థ శాస్త్రములో వృక్ష వైద్యము, వ్యవసాయము, వృక్షముల జీవితములను గూర్చిన విషయము.

క్రీస్తు శకం తరువాత కూడా ఆ పద్ధతులే అనుసరింప బడ్డాయి. ప్లేటో, అరిస్టోటిల్ మొదలైన మహనీయులు ఆయా శాస్త్రముల గురించి గ్రంథములున్నట్లు తెలుస్తున్నది అని వ్రాశారు క్రమక్రమంగా, ఆయా శాస్త్రమును గురించి ఎంతో పురోభివృద్ధిని సూచిస్తూ ఆంగ్ల రచయితలు ఎన్నో గ్రంథాలు వ్రాశారు.

ఈనాడు రేడియోలలోనూ దూరదర్శినులలోను వృక్షములనుగురించి, పెంపకం విషయం, వాటి తీరును గురించి, పంటలను గురించి, ప్రజలకు తెలియ జేస్తున్నారు.

ధన్వంతరి ఆయుర్వేద వైద్యమునకు మూల పురుషుడు. అమృతాన్ని దేవతలకందించినవాడు. చరకుడు ఆయుర్వేద శాస్త్రము వ్రాశాడు. సుశ్రుతుడు శస్త్ర వైద్యుడు, సహదేవుడు పశువైద్యమును గురించి వ్రాశాడు. వాటిని ( పశువులను ) సాకడంలో నిష్ణాతుడు.

ఈ విషయాలన్నీ మన పురాణాలవల్ల తెలుసు కుంటున్నాం.

వేదుల మీనాక్షీదేవి

క్రీస్తు పూర్వం 4 వ శతాబ్దంలో కౌటిల్యుడు తన అర్థ శాస్త్రంలో వృక్ష వైద్యమూ వ్యవసాయము మొదలైన విషయాలు చెప్పడం చిత్రమైన విషయం. ఆ విధంగానే గోవుల గురించి, గుఱ్ఱముల గురించి ఏనుగుల గురించి వాటి పోషణ, మొదలైనవెన్నో తెలియజేశాడు.

వ్యవసాయాధికారిని సీతాధ్యక్షుడంటారు. ( అంటే ఇప్పటి వ్యవసాయ మంత్రి వంటివాడు ) ఇతడు వృక్షాయుర్వేదమును తెలిసినవాడు, వ్యవసాయమును స్వయంగా పర్యవేక్షించే ప్రధానాధికారి అన్నమాట.

వృక్ష శాస్త్రములో నిపుణులైన వారి సహాయంతో సకాలమున ఆయా ధాన్యములు, పుష్పములు, కాయలు, పళ్ళు, కూరలు, దుంపకూరలు, ద్రాక్ష మొదలైన తీగ జాతి పళ్ళు పండించేటప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలను

తీసుకుంటాడు. విత్తనాలను, పత్తిగింజలను సేకరించుతాడు.

ఈనాటి వలెనే ఆనాడు కూడా చేలు బలంగా వుండేందుకు పంటకు వినాశకరమైన క్రిములను సంహరించడానికి ప్రతిక్రియలున్నాయి. అందు వల్లనే సీతాధ్యక్షన కుండవలసిన అర్హతలలో వృక్షాయుర్వేదము ముఖ్యలక్షణముగా కనబడుతోంది.

ఆయా పంటలకు అనువైన క్షేత్రములను బాగా పరిశీలించి, చాలామార్లు దున్నించి, విత్తనములను "దాసులు" (శూద్రులు) చే నాటించాలి. కార్మికులు, దండప్రతికర్తలు, అనే పనివారి చేత నాటించేవారు. దున్నేందుకు కావలసిన పరికరాలు, యెద్దులు మొదలైనవి సమకూర్చుకోవడంలోగాని, వడ్రంగులు, మేదరులు, తాళ్ళు పేనేవాళ్ళ వల్లగాని ఆలస్యం జరగకుండా జాగ్రత్త పడాలి. ఇందులో ప్రాల్గొనే యెవరివల్లనైనా ఆలస్యం జరిగితే పంట తగ్గవచ్చు. ఆ నష్టం యెంతో అంతా వాళ్ళపై దండం (జుల్మానా) విధించుతారు.

తెరిపి లేకుండా కుండపోతగా వర్షించేవానలు మూడు; బిందువులుగా వర్షించేది యెనభై:

సూర్యరశ్మితో కూడి వర్షించేది అరవై. వర్షపాతము సమము, సితము.

గాలిని, సూర్యరశ్మిని సమభాగముగా విభాగము చేస్తూ పిడుకలు యెండడానికి మూడు వ్యవధులను కల్పిస్తూ వర్షములు పడితే సస్యవృద్ధి తప్పకుండా జరుగుతుంది.

విత్తనములు నాటేటప్పుడు బంగారం కలిపిన నీటితో పిడికిలితో విత్తనములను ముంచి

"ప్రజాపతియు, వర్షదేవత అయిన కాశ్యపునకు నమస్కారము. ఈ బీజములందు, నా ధాన్యములందు దేవత సీత వర్థిల్లుగాత" అంటూ చల్లాలి.

ఫలించిన సస్యములను, తక్కిన ఫలితములను సకాలములో ఆప్రదేశము నుండి తీసుకువెళ్ళిపోవాలి. బాగా వ్యవసాయం తెలిసినవాడు అంటే ఆ విషయంలో పండితుడు క్షేత్రంలోనిది ఏదీ చిడిచిపెట్టకూడదు.

ధాన్యపు కుప్పలను మండలాకారమైన కళ్ళపు టంచుల దగ్గర చేర్చాలి. ఆ సమయంలో పనివాళ్ళవద్ద నిప్పు వుండకూడదు. నీళ్ళు సమృద్ధిగా దగ్గర పెట్టుకోవాలి.

ఏడాదీ కష్టించి పండించిన పంటకు అగ్నిప్రమాదం సంభవించకుండా వుండేందుకు జాగ్రత్తలన్నమాట అవి.

ఈ విధంగా వ్రాయడం ప్రారంభిస్తే అంతు అంటూ వుండదు. ఆ గ్రంథం చదువుతుంటే అప్పుడు కలిగిన భావాలతో వ్రాశాను

పైన చెప్పిన విషయాలు ఏనాటికీ అనుసరణీయాలు. ★

## పెలికాన్ పక్షులు

(78వ పేజీ తరువాయి)

రావటానికి సుమారు 60-70 రోజులు పడుతుంది. అప్పటి వరకు తల్లితండ్రులే పోషిస్తాయి. సగం జీర్ణమైన ఆహారాన్ని పిల్లలకు అందిస్తాయి. పిల్లపెలికాన్స్ తమ ముక్కును తల్లి నోటిలోకి చొప్పించి ఆహారాన్ని అందుకుంటాయి. ఎదిగిన పిల్లలు చేపలుపట్టే పద్ధతిని నేర్చుకుంటాయి. ఆ తరువాత అవి తిరిగి తమ స్వస్థానానికి వెళ్ళిపోతాయి.

మన రాష్ట్రానికి వచ్చే ఈ పెలికాన్స్ సంఖ్య గణనీయంగా తగ్గిపోయింది. ఒకప్పుడు వేల సంఖ్యలో వచ్చే ఈ పక్షులు నేడు అరుదుగా కన్పిస్తున్నాయి. ఇందుకు కారణాలు అనేకం. ఆహారం కోసం పెలికాన్స్‌ని పట్టుకోవటం, తమకు పోటీగా చేపలు పడుతున్నాయని జాలరులు ఈ పక్షుల్ని చంపెయ్యటం, పెలికాన్స్ గూటిని నిర్మించుకునే తాటిచెట్లసంఖ్య తగ్గిపోవటం, ఆధునిక వ్యవసాయ పద్ధతుల్లో క్రిమి సంహారక మందులు ఉపయోగించటం. కాని మన ఒక్క రాష్ట్రంలోనే కాక ప్రపంచ వ్యాప్తంగా కూడ పెలికాన్స్ కష్టాలు ఎదుర్కొంటున్నాయి. అతిత్వరలో ఈ "కొల్లేటి కొంగలు" విలుప్తమై పోతాయేమోనని శాస్త్రజ్ఞులు ఆందోళన చెందుతున్నారు. ★

# పుస్తకసమీక్ష

## సాహిత్యం – విమర్శ

శ్రీ వడలి మందేశ్వరరావు

వెల : పదహారు రూపాయలు

ప్రతులకు : శ్రీమతి వి. సీతారత్నం

17-1-391/35, సుబ్రహ్మణ్యనగర్, సైదాబాదు కాలనీ సమీపంలో, హైదరాబాదు-500 659

విభిన్న అంశాలపై వేరు వేరు సందర్భాలలో వేరు వేరు పత్రికలలో ప్రచురింప బడిన వ్యాసాలు ఒకటో రెండో వ్యాసాలను చేర్చి, సమదర్శిని ప్రచురణ సంస్థ దీనిని వెలువరించింది. సాహిత్యం ఉందా, విమర్శ ఉందా అని ప్రశ్నిస్తూనే సమీక్షకుడు శ్రీ వడలి మందేశ్వరరావు విమర్శకు ఇందులో అగ్ర తాంబూలం ఇచ్చాడు. ఆ తరువాత నున్న రెండు భాగాలు సాహిత్యం, జ్ఞాపకాలు అను శీర్షికలతో నున్నవి. 'విమర్శనా పాటవం అంతర్లీనంగా లేని రచయిత సాహిత్య స్రష్ట కాలేడు' అని సమీక్షకుడు ఖచ్చితంగా నమ్మాడు కనుకనే విమర్శకు ప్రథమస్థానమిచ్చాడు. వ్యాఖ్యాత పని పదచ్ఛేదము, ప్రతిపదార్థ వివరణమే కాదు, ప్రతి పద్యంలోని రసౌదర్యాన్ని ఆవిష్కరించడమని తెలిసినవాడు కావటం వల్ల, 'సాహిత్యం' అనే రెండో భాగంలో ఆ బాధ్యతను ఆయన విజయవంతంగా నిర్వహించ గల్గాడు.

సమీక్షకుడు వృత్తి రీత్యా ఆంగ్లోపన్యాసకునిగా పని చేయటం వల్లా, ఆంగ్ల సాహిత్యం పట్ల చక్కని అవగాహన ఉండటం వల్ల, విభిన్న సందర్భాలలో ఆంగ్ల రచయితలను, ఆంగ్ల విమర్శకులను ఆయన చక్కగా ఉదహరించి నిరూపించ గల్గాడు. అంతమాత్రాన తెలుగు సాహిత్యంలో ఆయన ప్రవేశం అంతంత మాత్రంగా ఉందని అర్థం కాదు. విభిన్న తెలుగు కావ్యాలనూ, అందలి పాత్రలనూ, పద్యాలనూ, ఉదహరించిన తీరు, ఆయన తెలుగు భాషా పరిజ్ఞానాన్ని కూడా చాటి చెప్తుంది. కవిత్వంలో అంతర్లీనంగా ఉండే శిల్పాన్ని ఆయన వేరు చేసి చూపగల్గాడంటే అది నిజంగా విశేషమే! ఆంగ్ల కవిత్వంలోని ఛందో రీతులను, అందులోని సులువునూ, బరువునూ, తద్వారా అప్పుడప్పుడు కలిగే విసువునూ, అలాగే తెలుగు ఛందో రీతినీ, అందులోని సౌలభ్యాన్ని ఈయన హృద్యంగా నిరూపించగల్గాడు. నన్నయ సీస పద్యానికి, మిల్టను బ్లాంకువెర్సుకూ, శ్రీనాథుని పద్యానికీ, డ్రైడన్, పోప్‌ల పొయిట్రీకి పోల్చి చూపడానికి కావలసిన అవగాహన, అధికారం ఆ సమీక్షకునిలో పుష్కలంగా ఉన్నాయి. చెప్పిన తీరు శాస్త్రబద్ధంగా ఉన్నది. విషయం తర్కానికి లోబడి ఉన్నది. 'క్లాసిక్ – రొమాంటిక్' వ్యాసం సమీక్షకుని ప్రతిభకు, పాండిత్యానికీ మచ్చు తునక. ఏ ఒక పద్ధతికీ లొంగిపోక తనదైన ఆలోచనను ఆచరణలో చూపగల్గడం ఈ సమీక్షకుని ప్రత్యేకత.

పెద్దనగారి వరూధినీ కలభాషిణులను చూసి ఆయనెంత ముగ్ధుడయ్యాడో, కృష్ణశాస్త్రిగారి ధనుర్దాసునీ, గుహునీ, మల్హణుని చూసి అంతగానూ మురిపట పడ్డాడు. షేక్స్పియర్ ఫాల్‌స్టాఫ్‌కూ, గురజాడ అసిరిగాడికీ పోలికలు చూపగలిగాడంటే, సమీక్షకుడెంతటి అధ్యయన శీలి అన్నది బోధపడుతుంది.

సమీక్షకుని ఒక మంచి రచయితగా నిలబెట్టి చూపేవి మూడో భాగంలోని 'జ్ఞాపకాలు'. విశ్వనాథతోనూ, కృష్ణశాస్త్రితోనూ, శ్రీశ్రీ తోనూ, వ్యక్తిగత పరిచయం ఉండుటయే గాక, వారి గుండె చప్పుడును కూడా దగ్గరగా సమీక్షకుడు వినగలిగినందున, 'జ్ఞాపకాలు' మనసు పొరలలో నిలిచేలా ఉన్నాయ్. పాశ్చాత్య సంగీత విద్వాంసుడు బెథోవన్‌కూ, కృష్ణశాస్త్రికీ పోలికలను చూపుతూ, తెలుగు ఉపన్యాసానికి వరవడి పెట్టిన కృష్ణశాస్త్రికి మూగతనం వచ్చిందని వాపోతూ, "ఇది ఎవరి దురదృష్టం? ఆయనదా దేశానిదా?" అని అంటున్నప్పుడు పాఠకుని కళ్ళు చెమ్మగిల్లక మానవు.

తెలుగులో ఎన్నో విమర్శలు వచ్చాయ్. అయితే ఈ పుస్తకం ఒక ప్రత్యేక పద్ధతిలో ఉన్నది. నిర్దుష్టంగా, నిర్మొహమాటంగా, నిజాయితీతో ఉన్నది. సమీక్షకుని అవగాహననూ, అధ్యయన శీలతనూ, అభివ్యంజనా వైభవాన్నీ నిరూపించేది! అందుకని, ప్రతి ఒక్కరూ తప్పక చదువదగ్గది! చదివి తీరవల్సింది!

– డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు

# భారతీయ సంస్కృతి - స్త్రీ ప్రశంస

భారతీయ సంస్కృతిలో స్త్రీకి సముచితమైన స్థానము లేదని ఒక ఆక్షేపమును తఱచుగా వినుచున్నాము. సంస్కృత వాఙ్మయమును పరిశీలించుచో ఆ ఆక్షేపము సత్యము కాదనిపించుచున్నది.

భాగవతుల కుటుంబశాస్త్రి

దైవీ మీమాంసా సూత్రములలో—"ప్రకృతిత్వాన్నార్యాః పూజనమభ్యుదయాయ" ప్రకృతి స్వరూపిణి యగుటచే స్త్రీ పూజనము అభ్యుదయ హేతువు" అని యున్నది. "యా దేవీ సర్వభూతేషు నారీ రూపేణ దృశ్యతే, తస్యై దేవ్యై నమో నమః"—ఏ దేవి అన్ని భూతములలోను స్త్రీ రూపమున నున్నదో ఆ దేవికి నమస్కారము-అని సప్తశతీ గీతలో నున్నది— "యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః"-ఎచట స్త్రీలు పూజింపబడుదురో అచట దేవతలు క్రీడించు చుందురు-అని స్మృతి వచనము వున్నది. "స్త్రీ పురుషునిలో అర్ధ భాగము" అని వేద వచనము ఉన్నది. అర్ధనారీశ్వరుని స్వరూపము ఈ భావమునే సూచించును. "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షో ముఖాంగేషుయే" అను పద్య వాక్యమున నున్నట్లు, బ్రహ్మదేవుడు సరస్వతిని ముఖమున ధరించినాడు. విష్ణువు లక్ష్మిని వక్షస్థలమున ధరించినాడు. శివుడు పార్వతిని తన శరీరార్ధ భాగములో నుంచుకొనినాడు. ఇట్లుంచుట వారి యందు గౌరవమును చూపుటకే యని తెలియవలెను. వారిని నిర్బంధించుటకే యీ పని చేసినారని వ్యాఖ్యానించు వారికి నమస్కారము. "ఆయే చైవ వ్యయే చైనామ్ నియోజయేత్" ఇంటికి సంబంధించిన ఆదాయము, వ్యయములను, ఈ లెక్కలను ఆమెకు అప్పగింపవలెను అని స్మృతి కర్తలు అనినారు. "గృహిణీ గృహ ముచ్యతే"—"స్త్రియః శ్రియశ్చ పూజ్యాః" ఇల్లాలే ఇల్లు; స్త్రీలను, లక్ష్మిని పూజింపవలెను. "సఖా సప్తపదా భవ" "ఏడడుగులువేసి సఖివి కమ్ము" అని, వివాహ కాలమున వరుడు చెప్పును. "ధర్మార్థ కామములలో నిన్ను అతిక్రమించి వెళ్లను" అని వరుడు ప్రతిజ్ఞ చేయును. 'సమ్రాజ్ఞీశ్వశురేభవ" మొదలైన మన్త్రములనందు, నీవు అత్తమామలకు మఱదులకు, సమ్రాజ్ఞిగా నుండుము అని వధువును సంబోధించుచున్నాడు వరుడు.—వేద వాఙ్మయములో బ్రహ్మవాదినులు, అగు స్త్రీలున్నారు. ఉపాధ్యాయ వృత్తిని చేపట్టిన వారున్నారు. వేద పఠనమునకు మాత్రము వారికి అర్హత లేదనినారు. ఒకప్పుడు అదియును ఉన్నది. ద్విజాతులలో గూడ పురుషులకు అందఱకు వేదపఠనార్హత లేదు. స్త్రీ శూద్ర ద్విజబంధూనామ్—ద్విజాధములు శ్రుతిని వినగూడదు. ఆ నియమము, నేడు మనకు సులభముగ నర్థం కాకపోవచ్చును—ప్రస్తుతము అది చర్చనీయము గాదు. -"పితృభిః భ్రాతృభిశ్చైతాః పతిభిః దేవరైస్తథా । పూజ్యాః భూషయితవ్యాశ్చ బహు కల్యాణమీప్సుభిః"—తండ్రులు, సోదరులు, భర్తలు బావలు, మఱదులు-వీరందఱును ఆమెను పూజింపవలెను-అలంకరింపవలెను" అనినారు—దేవీ పురాణాదులను పరిశీలించుచో, స్త్రీనింద చేయువారు, అధోగతి పాలగుదురని యున్నది. అగుచో "న, స్త్రీ, స్వాతంత్ర్య మర్హతి" అని ఎందుకు అనినారు? ఆమెకు తండ్రి, భర్త, కుమారుడు బాల్య యౌవన వార్ధకములయందు రక్షణ కల్పింపవలయుననియే ఆ వాక్యమునకు తాత్పర్యము. రక్షణలేని స్త్రీలు ఏకాన్తముగా వెళ్ళుచున్న వారికి, కలుగు దురవస్థను చూచుచునేయున్నాము. స్త్రీలు పతి దేవతలుగా నుండవలెనన్న మాట నిజమే. స్త్రీని పూజింపుడని పురుషు

లకు చెప్పినవారే, భర్తను దైవముగా చూడుమని స్త్రీలకు చెప్పినారు. పురుషులకు "ఆచార్యుని, దైవతముగా చూడుడు" అని "పితృదేవోభవ", "మాతృదేవోభవ" అని వేదమే ఆదేశించినది. అభ్యుదయ నిఃశ్రేయసములను పొందుటకు; ఒక క్రమశిక్షణ పురుషులకు, స్త్రీలకును అవసరమే. తల్లితండ్రులు గురువు, భర్త-స్థానములలో నున్నపుడు వీరు శిక్షకులు. భార్య, శిష్యుడు, స్థానములలో వీరు ఒకరికి లోబడి యుండవలసినవారే. దీని భావము గంభీరము. స్త్రీని నింద చేసిన ఘట్టములు లేకపోలేదు. అవి సర్వ సామాన్యమైనవి. అవి వైరాగ్యము నుపదేశించునపుడు, శీల సంరక్షణము నుపదేశించునపుడు చెప్పిన వాక్యములు. స్త్రీల కుపదేశించునపుడు, "పురుషుల విషయము గూడ జాగ్రత్తగ నుండుడు" అని హెచ్చరిక చేసినట్లే గుర్తింపవలెను. గుణహీన స్త్రీ పురుషుల విషయమున నవి వర్తించును. ఇటువంటివి పాశ్చాత్య వాఙ్మయములో లేకపోలేదు. "Frailty thy name is woman" (Shakespere) "of all the plagues with which the world is curst, of every ill, a woman is the worst" (Lord Landsdowne):

సంస్కృత భాషలోనే స్త్రీ లింగ శబ్దాలకు సమాసములలో ప్రాధాన్యమున్నది. ఉ. సీతారాములు, పార్వతీ పరమేశ్వరులు, రాధాకృష్ణులు అంటాము. రామ కథలు అనము. ఇది సామాన్య వ్యవహారము. స్త్రీ ప్రశంసా వాక్యము లింకను ఎన్నియో యున్నవి. వానిని అన్నిటిని ఉదాహరింపను. వరాహమిహిరుని బృహత్ సంహిత యందున్న కొన్ని ప్రశంసా వాక్యములను మాత్ర మిచట నిచ్చుచున్నాను.

" యేవ్యతింగనానామ్ ప్రవదన్తి దోషాన్
వైరాగ్య మార్గేణ గుణాన్ విహాయ
తే దుర్జనా మే మనసో వితర్కః
సద్భావ వాక్యాని న నామ తేషామ్."

అర్థము : స్త్రీలలో నున్న గుణములను వదలి, వైరాగ్య మార్గముతో, వారి దోషములనే ఎత్తి చూపువారు దుర్జనులనియు, వారి మాటలు అసత్యము లనియు, మంచి భావముతో చెప్పినవి కావనియు, నా అభిప్రాయము.



" ప్రబ్రూత సత్యం కతరోంగనానామ్,
దోషోస్తి యో నాచరితో మనుష్యైః ।
ధార్ష్ట్యేన పుంభిః ప్రమదాః నిరస్తాః ।
గుణాధికాస్తా మనునాత్ర చోక్తమ్ "

అర్థము : పురుషులు చేయని ఏ దోషమును స్త్రీలు చేసినారో చెప్పండి ? ( పురుషులలోను దుష్టులున్నారు. అట్లే స్త్రీలలోను దుష్టులుండవచ్చును )—పురుషులు సిగ్గువిడిచి, ధార్ష్ట్యముతో, స్త్రీలను నిరసించారు. పురుషుల కంటె స్త్రీలే, సద్గుణములలో అధికులు. మనువు ఈ విషయములో ఇటనినాడు.

" సోమస్తాసామదాచ్ఛౌచం గంధర్వః శిక్షితాంగిరమ్
పావకః సర్వమేధ్యత్వమ్ తస్మాన్నిష్కసమాః
స్త్రియః "

అర్థము : చంద్రుడు వారికి పవిత్రతను ( కాన్తిని ) గంధర్వుడు వినుట కింపైన వాక్కును, అగ్ని, అన్ని అవస్థలయందును పవిత్రత్వమును ఇచ్చినారు. అందుచే స్త్రీలు కంఠమునందు మనసు దరించు రత్నహారముతో సమానమైనవారు. ఎప్పుడు పవిత్రమైనవారు.

" జాయావా స్యాజ్జనిత్రీవా సంభవః స్త్రీకృతోనృణామ్
హే కృతఘ్నాః తయోః నిందాం కుర్వతాం వః
కుతః సుఖమ్ "

అర్థము : భార్య కావచ్చు, తల్లి కావచ్చును. పుట్టుక, యనునది మనుష్యులకు స్త్రీల వలననే కలుగుచున్నది. ఓ కృతఘ్నులారా ! నవమాసములు మోసి, కష్టపడి. గర్భరక్షచేసి, జన్మనిచ్చిన ఆ తల్లిని, భార్యను ఎందుకు నిందిస్తారు ? మీ కిక సుఖమెట్లు కలుగును ?

" స్త్రియః పవిత్రమతులం నైతా దుష్యన్తి కర్హిచిత్
మాసిమాసి రజోహ్యాసాం దుష్కృతాన్యపకర్షతి "

అర్థము : స్త్రీలు చాల పవిత్రులు-వారు ఎప్పుడును దోషయుక్తులుగారు. నెల నెలకు వారి రజస్సు వారి పాపములను పోగొట్టును.

" బ్రాహ్మణాః పాదతో మేధ్యాః
గావో మేధ్యాశ్చ పృష్ఠతః
అజాశ్వాః ముఖతో మేధ్యాః
స్త్రియో మేధ్యాస్తు సర్వతః "

అర్థము : బ్రాహ్మణుల పాదములు పవిత్రములు. ఆవు పృష్ఠము పవిత్రము. మేక, గుఱ్ఱముల ముఖము పవిత్రము. స్త్రీలు అంతటను పవిత్రలే.

" దంపత్యోః వ్యుత్క్రమే దోషః సమః శాస్త్రే
ప్రతిష్ఠితః
సరా న తమ వేక్షన్తే తేనాత్ర వరమంగనాః "

అర్థము : దంపతులలో ఎవరు వ్యభిచారము చేసినను, వారికి వచ్చు దోషము సమానమే అని శాస్త్రము చెప్పు

చున్నది. పురుషులు ఈ విషయమును లెక్కచేయుట లేదు. స్త్రీలే ఈ విషయములో మెఱుగుగ నున్నారు.

" స్త్రీ రత్నము " అని వ్యవహారమున్నది. రత్నమును నడివీధిలో పారవేయము. స్త్రీల శీలము చెడుచో వంశమంతయు చెడిపోవును. అందున స్త్రీల విషయము ఎక్కువ హెచ్చరిక చేసినారు.

" బహిర్లోమ్నాతు షణ్మాసాన్ వేష్టితః ఖర చర్మణా
దారాతిక్రమణే భిక్షాం దేహీత్యుక్త్వా విశుధ్యతి "

అర్థము : వ్యభిచరించినవాడు, బాగుగా ప్రకాశించుచున్న వెంట్రుకలు గల గాడిద చర్మమును ధరించి, " భిక్షాం దేహి అని, ప్రతిదినము ఏడు ఇండ్లలో బిచ్చము ఎత్తుకొని తినవలయును. ఇట్లు ఆరు మాసములు చేసినచో పరిశుద్ధుడగును. " అని ఆపస్తంబ మహర్షి యనినారు.

" పురుషులు వార్ధకమున అశక్తత వలన కామ భోగములనుండి విరమించుచున్నారు. స్త్రీ లన్ననో యౌవనమునందును, ఇంద్రియ నిగ్రహముతో శీలమును పాటించుచున్నారు. అందుచే స్త్రీలే పురుషుల కంటె గొప్పవారు. "—( " దోషములేని, పతితగాని స్త్రీని యువతిని, ఎవడు వదలిపెట్టునో వాడు ఏడు జన్మలు స్త్రీగా పుట్టి వైధవ్యము ననుభవించును " అని పరాశరుడు చెప్పినాడు. ) ఇట్లు వరాహమిహిరాచార్యులు, స్త్రీలను ఇంకను ఎన్నియో విధముల ప్రశంసించి, వారిని నిందించు పురుషులను నిందించినారు. విస్తర భీతిచే వానిని వ్రాయుటలేదు.

వివాహము చేయునపుడు " కన్యాం కనక సంపన్నామ్, సర్వాభరణ భూషితామ్ " అను శ్లోకము ననుసరించి, స్త్రీకి సువర్ణ రూపమున ద్రవ్యము నీయవలయును. మితాక్షరి న్యాయమున స్త్రీలకు ఆస్తిలో అధికారమున్నది అనుచున్నారు. ఈ విషయము వందలి బాగోగులు ప్రత్యేక చర్చనీయాంశములు. " స్త్రీ ధనము " నకు ప్రత్యేకత యున్నది—ఇట్లున్నను, నేటి పురుషులు, స్త్రీలను వేధించుచున్నారు. అనుచో, అది సంస్కారహీనుల దోషము. భారతీయ సంస్కృతి లోపము గాదు, అని తెలియవలెను. భారతీయ సంస్కృతిని గుఱించి విద్యార్థులకు బోధన చేయకుండుటయే దీనికి కారణము—

★

# దానకర్ణుడు

మహాభారత యుద్ధంలో 17 వ రోజు సమాప్తమైంది. కర్ణుడు యుద్ధభూమిలో పడిపోయినందుకు పాండవుల శిబిరంలో ఆనందోత్సాహాలు చెలరేగుతున్నాయి. కాని విచారంతో "నిజమైన దాత ఈ భూమిని నేడు వదిలి పోతున్నాడు" అనిన శ్రీకృష్ణుని పలుకులు విన్న అర్జునునకు మాత్రం తన ప్రత్యర్థిని పొగడుతున్నందుకు కోపం వస్తుంది. అప్పుడు శ్రీకృష్ణుడు "ధనంజయా! ఇది యదార్థం. రా! నా వెంట. దానకర్ణుడింకా చావలేదు. ఆయన దానశీలం ఆఖరుసారి దూరాన వుండి చూడు" అని అంటాడు.

కన్నుపొడుచుకున్నా కనపడని కాళరాత్రి అది. యుద్ధభూమి నక్కల రాజ్యంగా మారింది. ఎక్కడ చూచినా విరిగిపోయిన అస్త్రాలు, ముంగ ముళ్ళలాంటి బాణాలు, శవాలకుప్పలు, కుప్పలుగా కూలిపోయిన రథాలు. రక్తసిక్తమైన ఆ యుద్ధభూమి కుంకుమ వర్ణంతో మహా భీకరంగా వుంటుంది. అర్జునుని తీసుకొని కొద్దిదూరంలో వుంచి శ్రీకృష్ణుడు బ్రాహ్మణ వేషం ధరించి "కర్ణా! దానకర్ణా!" ఎక్కడున్నావయ్యా! అని బిగ్గరగా అరవడమారంభించాడు.

అప్పుడు కర్ణుడు అతి కష్టంమీద పోతున్న శక్తిని కేంద్రీకరించుకొని తలపైకెత్తి "ఆ! ఇక్కడ, ఇక్కడనే వున్నాను. ఎవరు పిలుస్తున్నారు నన్ను? ఎవరది? ఏం కావాలి?" అని అడుగుతాడు. అప్పుడు బ్రాహ్మణ వేషంలోనున్న శ్రీకృష్ణుడు కర్ణుని సమీపించి "నేను మీ పేరు ప్రతిష్ఠలు విని గంపెడంత ఆశతో వచ్చాను. నాకు కొద్ది బంగారం కావాలి" అని అంటాడు. అప్పుడు కర్ణుడు "మీరు నా ఇంటికి వెళ్ళండి. అక్కడ నా భార్య మీకు కావాల్సినదంతా యిస్తుంది" అని అంటాడు.

అప్పుడు ఆ బ్రాహ్మణుడు "నాకు కావాల్సిన కొద్ది బంగారం కోసం అంత దూరం వెళ్లాలా! నాకు ఓపిక లేదు. ఇస్తే మీరే యివ్వండి. లేకపోతే లేదని చెప్పండి నా దోవన నేను వెళ్లుతాను" అని కోపంగా అంటాడు. అప్పుడు కర్ణుడు తన దంతానికి ఉన్న బంగారాన్ని చూపించి తీసుకోమంటాడు. బ్రాహ్మణుడు కోపంతో "సజీవంగా ఉన్న మనిషి దంతం ఊడబెరకమని చెప్పుటకు సిగ్గయినా లేదా?" అని అంటాడు. కర్ణుడికి తోచక అటూ యిటూ చూస్తాడు. కొద్ది దూరంలో ఒక రాయి కనిపిస్తుంది. అతి కష్టం మీద తన శరీరాన్ని ఈడ్చుకుంటూ వెళ్ళి ఆరాయి మీద తన ముఖాన్ని కొట్టుకుంటాడు. ముఖం పచ్చడై పళ్ళూడి క్రింద పడుతాయి. బంగారపు తొడుగువున్న ఆ పళ్ళను తీసుకొనమని ప్రాధేయపడుతాడు. "ఛీ రక్తంతో తడిసిన అపవిత్రమైన పండ్లను స్వీకరిస్తానా?" అని ఆ బ్రాహ్మణుడు కోపంతో హుంకరిస్తాడు. అప్పుడు కర్ణుడు ఖడ్గంతో ఆ పళ్ళను కొట్టి బంగారాన్ని వేరుజేసి స్వీకరించమంటాడు. ఆ బ్రాహ్మణుడు మలినమైన బంగారాన్ని స్వీకరించ నిరాకరిస్తాడు. కర్ణుడు అతి కష్టంమీద బాణాలను చేత తీసుకొని శిరస్సు సహాయంతో విల్లు నెక్కుపెట్టి వారుణాస్త్రంతో జలమును సృష్టించి బంగారాన్ని కడిగి వినయంతో బ్రాహ్మణుని చేతిలో పెట్టి స్వీకరించమని అర్థిస్తాడు.

అప్పుడు ఆ బ్రాహ్మణుడు సంభ్రమాశ్చర్యాలతో తన నిజస్వరూపాన్ని చూపించి "వరం కోరుకో వీరుడా!" అని అంటాడు. కర్ణుడు ఆనంద బాష్పాలతో తడబడుతూ "త్రిభువనేశుడు నా దేహ త్యాగ సమయంలో నాముందున్నాడు. అంతకన్నా కోరేదేముంది?" అని అంటాడు. దూరం నుంచి చూస్తున్న అర్జునుడు తలవంచుకుంటాడు.

సూర్యుడు ఎంత వద్దని బలవంతం చేస్తున్నప్పటికి తన శక్తికి మూలమైన కవచ కుండలాలను సునాయాసంగా ఇంద్రునికి దానం చేసిన త్యాగశీలి. సత్యమే తన ఊపిరిగా భావించి, పరోపకారమే తన జీవిత పరమావధిగా ఎంచి, తన సర్వస్వాన్ని సమర్పించిన త్యాగధనుడు 'దానకర్ణుడు'. అందుకోసమనే దానం ప్రసక్తి వచ్చినప్పుడల్లా కర్ణుని పేరు రావడం అతి సహజమైపోయింది. ★

# మంచిని పెంచే మార్గమేమిటి?

భగవాన్ శ్రీ సత్యసాయి జన్మదినోత్సవ వేడుకలు ఈ మధ్య జరిగినై – పుట్టపర్తిలో. దేశ విదేశాల నుంచి 5,6 లక్షలమంది భక్తులు ఆ వేడుకలను చూడవచ్చారు. దేశమంతటా గల సాయి భక్తులు ఆరు లక్షల రూపాయల నిధిని సమీకరించి, ఆ చెక్కును శ్రీ సత్యసాయికి సమర్పించారు – జన్మదిన కానుకగా.

శ్రీ సాయి దానిని స్వీకరించ నిరాకరించారు. ఆ నిధిని ఆ యా ప్రదేశాల వాళ్ళనే తిరిగి తీసుకుపొమ్మన్నారు.

ఈ సంఘటన వెనుకొక గంభీరమైన వాస్తవమున్నది. శ్రీ సత్యసాయి భక్తులలో గూడా మంచివారు చెడ్డవారు ఉన్నారు. సిగరెట్టు, బీడి, త్రాగుడు వంటి వ్యసనాలకు బానిసలైన తన భక్తులను ఉద్ధరించ దలచి భగవాన్ ఒక పథకాన్ని సూచించారు. ఇట్టి అలవాట్లు ఉన్నవారు, వాటిని మానుకొని, తద్వారా వారు నిల్వచేసే సొమ్మును శ్రీ సాయి ట్రస్టులకు సమర్పించమని వారు భక్తులను ఆదేశించారు.

సత్యసాయి అంటే సాక్షాత్తు భగవానుడేననేది సాయి భక్తుల విశ్వాసం. భగవానుడే ఆదేశించగా, తామేమి చేయాలి ? సిగరెట్లు బ్రాందీలు వారికి భగవంతునికన్న మిన్నగా తోచినట్లున్నాయి. వాటిని మానకుండా, పదీ, వందా సాయిట్రస్టు నిధికి నెలవారీగా సమర్పించి, ఇహ పరాల మెరుగులను రెండింటినీ ( Best of both the worlds ) కొట్టేయాలని మరో పథక మెత్తారు – సాయి భక్త బృందంవారు.

తన పథకాన్ని వమ్ము చేసిన ఈ పై ఎత్తును శ్రీసత్య సాయి గుర్తించారు. నిధిని తిరస్కరించారు.

అదీ కథ. ఒక చెడు అలవాటు మానవుని ఎంత బలంగా అణగద్రొక్కి పారేస్తుందో చెప్పడానికి ఇదొక చక్కటి ఉదాహరణ కథ.

నేనే భగవంతుడ్ని – అంటారు శ్రీ సత్యసాయి. సాయి భక్తులు దానిని నమ్ముతారు. అంటే ఆ భగవానుడే స్వయంగా చెప్పినా, వారు తమ దురలవాట్లను మానుకొనలేక పోయినారన్నమాట. అసలు భగవానుడే దివి నుంచి దిగివచ్చి చెప్పినా భూమిజులు తమ దురలవాట్లను నిగ్రహించుకోలేరన్నమాట.

మరైతే ఏమిటి మార్గం ? వ్యసనాలకు బానిసలై, తాము చెడి, తమ వారిని చెరిచి, మానవ కల్యాణాన్ని వినాశనం చేస్తున్న ఈ మానవ జాతి ఇట్లా ఆక్రోశించ వలసినదేనా ?

## యువతావాణి

ఆర్.యస్.కే.మూర్తి

అంతేననిపిస్తుంది – లోకం తీరు గమనిస్తుంటే.

కొంతమంది యువతీ యువకులు – సినిమాల హీరోలు వారికి ఆరాధ్య దైవాలుగా ఉంటారు. ఈ మధ్య బందరులో ఒక థియేటరులో 'గుండమ్మ కథ' ప్రదర్శించ బడుతున్నది. యన్. టి. ఆర్. పోస్టర్లకు వారి భక్తులు పెద్ద దండలను తెచ్చి వేశారు – ఒక రోజున. మరునటి రోజుకల్లా ఎ. ఎన్. ఆర్ పోస్టర్లనిండా అంతే పెద్ద దండలు తెచ్చి వేశారు – ఎ. ఎన్. ఆర్. భక్తులు.

ఇట్లా పోటా పోటీలుగా తమ ఆరాధ్య దైవాలను కొలిచే ఈ భక్త వరేణ్యులు ఆయా హీరోలలో ఉన్న మంచి అలవాట్లను ఒక్కదానినైనా నేర్చుకుంటారా ?

300 పైగా చిత్రాలలో నటించిన ఎన్. టి. ఆర్. సిగరెట్లు కాల్చరు. బ్రాందీ విస్కీలు పుచ్చుకోరు. పైసా

దుర్వ్యయం చేయరు. నేటికి కూడా తెల్లవారు ఝామునే లేచి బస్కీలు, దండీలు తీసి, స్నానం చేసి, పూజచేసుకుని ఐదు గంటలకల్లా అల్పాహారం సేవిస్తారు.

ఎన్. టి. ఆర్. పదవిలోకి వచ్చిన కొత్తలో వీరి ఈ వేకువ అలవాట్లను గురించి బోలెడన్ని కథలు ప్రచారంలో వుండేవి. ముఖ్యమంత్రిని స్వయంగా కలవవలసిన ప్రభుత్వ సెక్రటరీలు, రాష్ట్రాధికారులు వేకువ 5 గంటలకు రావాలి. హైదరాబాదు నవాబుల నగరం కదా ! ఎనిమిదయితేగానీ ఆ నగరం షరాబులు నిద్ర లేవరు. ఐదింటికి ఫైళ్ళు చంకనెట్టుకుని ముఖ్యమంత్రి యింటికి వెళ్ళవలసి వచ్చిన ఉద్యోగుల బాధలు గాధలుగా అప్పట్లో చెప్పుకునేవారు.

మరో వింతకథ కూడ అప్పట్లో విన్పిస్తుండేది. ఒక ప్రతిపక్ష పార్టీ అధ్యక్షుని యన్. టి. ఆర్. బ్రేక్‌ఫాస్ట్‌కు ఆహ్వానించారుట. "పదింటికి రమ్మన్నారా?" అని అడిగారట ఆయన ఫోన్‌లో. ఎన్.టి.ఆర్. నవ్వేసి "పదింటికా? నేను రమ్మన్నది లంచ్‌కి కాదండీ బాబూ ! బ్రేక్‌ఫాస్ట్‌కి. ఐదింటికి దయచేయండి" అన్నారుట నాటకీయంగా. అధ్యక్షుల వారికి 69 అంకె 96 గా కన్పించి వుంటుంది. వారికి ఒకటో, పదో బారులున్నాయి, హైదరాబాద్‌లో. అవి మూసేది ఉదయం మూడింటికి – యన్. టి. ఆర్. నిద్ర లేచేవేళకి. ఆటు తర్వాత వసూళ్లు వగైరాలు చూసుకుని వారు రోజూ నిద్రకు ఉపక్రమించేదే ఐదు గంటలకు. ఆ టైముకల్లా ఉప్మా ఇడ్లీలు తినడానికి రమ్మంటే, పాపం, ఆ అధ్యక్షులవారు ఏం చేస్తారు ?

ఇవన్నీ పూర్తిగా కథలు కావు. ఎన్. టి. ఆర్. అలవాట్లకు సంబంధించినంతవరకు ఇవి పచ్చి వాస్తవాలు. 'అల్లుడు దిద్దిన మామ' గా ఇప్పుడు ఎన్. టి. ఆర్. మనకు ప్రేమాస్పదుడు కాకపోవచ్చు — అదీ ముఖ్యమంత్రిగా. కానీ వ్యక్తిగా ఆయన ఒక క్రమశిక్షణకు తమను తాము లోను చేసుకున్నవారు.

అయ్యగారి అభిమాన సంఘాలవారిలో సిగరెట్లు కాల్చని వారు, బ్రాందీలు ముట్టనివాళ్ళు ఎంతమంది ఉంటారు ? అసలంటూ ఉంటారా — ఎవరైనా ? ఉదయం 4 గంటలకు నిద్ర లేచి, తమ రాజును అనుసరించగలరా వీరిలో ఏ ఒక్కరైనా ?

ఎన్. టి. ఆర్. ను వారు అనుకరించలేరు. ఆయన ధరించిన పిచ్చి పాత్రల వెకిలి వేషాలు వీరు అనుకరిస్తుంటారు.

పాత్రలు — కథకుని సృష్టి. నటీ నటుల వ్యక్తిత్వాలు భగవంతుని సృష్టి. భగవంతుని సృష్టి అభిమాన సంఘాలవారికి అక్కరలేదు. దౌర్భాగ్యులైన కథకుల సృష్టి మీదనే వీరి మోజు.

సినీ పత్రికా విలేఖరులతో కలసి ఒకసారి అన్నపూర్ణా స్టూడియోకి వెళ్ళాము. 'రాముడు కాదు కృష్ణుడు' — దాసరి సినిమా షూటింగు. రావుగోపాలరావు ఆఫీసుకి జయసుధ స్కర్టు అదీ వేసుకుని వెళ్ళే దృశ్యం చిత్రీకరిస్తున్నారారోజున. జయసుధ స్కర్టు అదీ వేసుకుని కూర్చునివుంది. ఆ డ్రస్సులో కూర్చుని విలేఖరులతో మాట్లాడటానికి ఆమె ఎంత ఇబ్బంది పడిందో ? ఎంత మర్యాదగా మాట్లాడిందో ?

ఆ ముగ్ధత్వం, స్నిగ్ధత్వం మన యువతీ యువకులకు పట్టవు. ఆమెచేత కథకులు, దర్శకులు చేయించే పిచ్చి వేషాలే వారికి కావాలి.

జయమాలిని నృత్య సన్నివేశం చిత్రీకరణ చూశా మొకసారి. రెండు మూడు పీలికలు ఒంటిన చుట్టుకుని నృత్యం చేయాలి. ఆమె సెట్టు మీదికి ఎట్లా వచ్చిందో



తెలుసా ? వళ్ళంతా పెద్ద శాలువా కప్పుకొని వచ్చింది. ఆ నృత్యం Bit ఒక్క నిముషం చేసేసి, మళ్ళీ శాలువా కప్పుకొని వెళ్ళిపోయింది—uneasy గా పత్రికా విలేఖరుల పలకరింపులకు నమస్కారం పెడుతూ. అట్లాంటి జయమాలిని మన యువకులకు ఒక పెద్ద సెక్స్ సింబల్.

అంతమాత్రాన జయసుధ, జయమాలినిల జీవితాలు కడిగిన ముత్యాలవంటివవనిగాని, ఎన్. టి. ఆర్. ఒక యోగిపుంగవుడనిగాని చెప్పడం మన ఉద్దేశ్యం కాదు. వీరు మానవమాత్రులు, మంచి చెడుల సమ్మిశ్రితాలు. వారిని దేవుళ్ళుగా చూసేవారు వారిలోని మంచిని ఎందుకు చూడరు ? చెడునే ఎందుకు అనుసరణీయంగా తీసుకుంటారు ?

ఎందుకంటే మనిషి 'కర్మ' అది.

చెడు మనిషిని తేలికగా ఆకర్షిస్తుంది. త్వరగా వదిలిపెట్టదు. మంచి తేలికగా అలవడదు. తేలికగా మంచిని కోల్పోతాడు—మానవుడు.

సాయి భక్తులు కొంతమేరకు మంచిని నేర్చుకుంటారు. ఏ కొంతో మాత్రమే ఆ మంచిని వారు తమ స్వంతం

చేసుకొనగల్గుతారు. అట్లాగే ఇతర సామాజిక సంస్థల వారు.

అందుకే చెడును బాహాటంగా ప్రదర్శించకూడదన్నారు—మన పెద్దలు. భోజనం, నిద్ర, మైధునం, హింస, చంపడం, చాపడం వంటివి నాటక ప్రదర్శనలో కూడ నిషిద్ధమన్నారు—మన మహర్షులు.

కానీ నేడు చెడు విశృంఖలంగా దర్శింపచేయబడుతున్నది. సినిమాలలో....కాలేజీలలో....రోడ్లమీద....ఎక్కడబడితే అక్కడ.

ఇది జాతికి శ్రేయోదాయకం కాదు.

చెడు వుండనే వుంటుంది. తప్పదు, కానీ దానిని మెచ్చుకొనే వాతావరణం వుండకూడదు. దానినొక ఘనకార్యంగా దర్శింపచేయకూడదు. ఆఖరికి సినిమాలు, నాటకాలలో కూడ.

'ప్రతిఘటన' సినిమా చూశారు కదా! అందులో కల్లా మంచి సన్నివేశం ఏది? అంటే—వెంటనే చెప్పేసారు—యూన్సీ కాళీని గొడ్డలితో నరకటమని,

కానీ దానంతటి ముదనష్టపు సన్నివేశం అదే! యూన్సీ కథలో కాళీ విలన్ కానేకాదు. కాశయ్యే ఆ సినిమాలో విలన్. ఒక కాళీని యూన్సీ చంపితే, మరునాటికి మరో కాళీకి కాశయ్య పట్టాభిషేకం చేయిస్తాడు - హైకమిటీవారి అభినందనలతో.

అంచేత నరకటమంటూ వస్తే నరకవలసింది — కాళీని కాదు, కాశయ్యను. ఆయన వెన్ను కాచే హైకమిటీని. కాదని, కాళీలను నరకమనటం —కాశయ్యల వెన్ను కాయటమే అవుతుంది. కాళీలను ఎదుర్కొనవలసింది యూన్సీలు కాదు పోలీసులు, పోలీసులు విఫలమైతే నరకవలసింది పోలీసులను-కాళీలను కాదు. కుక్కను పెంచిన రాజు తానే మొరగకూడదు. అసలు నరకటం దేనికీ పరిష్కారం కానేకాదు. మనది ప్రజాస్వామిక దేశం. ఇది మనం వద్దనుకునేవరకు—మన కథల్లో. సినిమాల్లో చూపించే పరిష్కారాలు ప్రజాస్వామికంగానే వుండాలికానీ, ప్రజా విద్రోహకరంగా వుండకూడదు, కాశయ్యలను, కాళీలను ప్రజలు శిక్షించవలసింది గండ్రగొడ్డళ్ళతో కాదు, వోటు ముక్కతో. అంబేద్కర్ చెప్పారు—మంచి చేస్తున్నామంటూ కూడ అప్రజాస్వామిక పద్ధతులను అనుసరించరాదని.

వోట్లను ప్రజలు సరిగా వినియోగించుకోనిస్తారా? బూత్‌ల దురాక్రమణ వంటివి వుండవా? అంటే సమాధానం తేలికగా చెప్పవచ్చు.

బూత్‌ల దురాక్రమణ వంటివి చేయించకనేనా 1977 ఎన్నికలలో ఇందిరా కాంగ్రెస్ ఓడిపోయింది? ఆంధ్ర ప్రదేశ్‌లో కాశీల సాయం లేకనేనా—83 లో—ఇందిరా పార్టీ వోడించబడింది?

ప్రజలు ఒక పార్టీని ఓడించాలని అనుకున్నా, గెలిపించాలని అనుకున్నా—అప్పుడీ దుర్మార్గాలు, దురాగతాలు ఎన్నికల ఫలితాలను మార్చలేవు, ఒకటీ అరా నియోజక వర్గాల్లో తప్ప ( 77 లో సంఘ్యాలలో జరిగినట్లు ). కాబట్టి మనదేశంలో వోటు ఇంకా బలంగానే వినియోగించబడుతున్నది.

ఒకవేళ వినియోగించబడకపోయినా సరే, కథలలో, కల్పనల్లో, ఆదర్శవంతంగా, అది బలమైన ప్రజా ఆయుధంగానే చిత్రించబడాలి—వాస్తవానికి విరుద్ధమైనా సరే.

ఝాన్సీ కాళీని నరకటం వాస్తవానికి దగ్గరైన సన్నివేశమేనా ? అట్లా ఆమె నరుకుతుంటే, కాళీ సైన్యం ఊరికే వుంటారా ? పారిపోతారా ?

ఎట్లాగూ అవాస్తవికంగానే ముగింపు చెప్తున్నపుడు, అది ఆదర్శవంతంగానే చెప్పడం మంచిది కదా !

అట్లా చెప్తే ' ప్రతిఘటన ' సినిమా వారికి పైసలు రావు. ' విజేత ' చిత్రం ముగింపు ఎంతో ఆదర్శవంతమైనది. ఆ చిత్రం pick up అయ్యేటప్పటికి కృత్యాదావస్థ అయింది. ప్రతిఘటన అట్లా కాదు గదా—instant success. క్షణిక విజయం.

చెడు క్షణంలో సక్సెసు అవుతున్నది.

అట్లా కానీయ కూడదు.

అందుకు ఒక మార్గం-

మంచిని ప్రముఖంగా దర్శింపచేయడం. 'ప్రతిఘటన' చిత్రంలో చాల మంచి దృశ్యం-'దుర్యోధన దుశ్శాసన....' అన్న పాట చిత్రీకరణ దృశ్యం. ఆ దృశ్యాని చూచి, కాలేజీలలో ఆడపిల్లలను ఏడిపించే మూకలు సిగ్గుపడుతున్నారు. తల్లి ఇచ్చిన ' తెల్లటి రక్తం ' తాగి పెరిగిన తమ శరీరాలు ' తల్లులను ' అవమానించడానికి ఉపయోగపడుతున్నవని సిగ్గిలిపోయిన ' కాళీ శిష్యులు ' ఈ కలానికి తటస్థపడ్డారు. ' చనుకట్టు ' అంటే ఏమిటన్న కీచక విద్యార్థుల ప్రశ్నకు “ ఇంటికి వెళ్ళి మీ అమ్మను అడగండి—చెప్పమనో, చూపించమనో ” అన్న దృశ్యం కీచకులకు చెంపదెబ్బ.

అయితేనేమిటి ప్రయోజనం ? ఆ పాట ద్వారా ఆమె విద్యార్థులలో తెచ్చిన మార్పు చివరివరకు కొనసాగించబడలేదు. ఆ విద్యార్థుల శక్తితో ఆమె ( కాళీని కాదు ) కాశయ్యను నిర్వీర్యం చేసినట్లు చూపించి వున్నట్లయితే ' ప్రతిఘటన ' మంచి చిత్రం అయి వుండేది—దండిగా పైసలు వచ్చినా రాకపోయినా, నిర్మాతల పైసల కక్కుర్తి దర్శకునికి ' ప్రజా నాట్యమండలి, కమ్యూనిష్టు పార్టీలు , ఇచ్చిన చైతన్యం ' ప్రతిఘటన ' ను మరో 'అగ్గిరాజు'గా మార్చినై. ' ఫార్ములా ' చిత్రమైపోయిందది—మాదాల

అందరిదీ ఏదో కక్కుర్తి.

మద్యపాన నిషేధం పెడితే, బార్లకు, హోటళ్ళకు విశృంఖలంగా లైసెన్సులు ఇవ్వకపోతే, ప్రభుత్వాలే నడవవని, జేబులు నిండవని ప్రభుత్వాలు నడిపేవారి కక్కుర్తి.

గొడ్డళ్ళతో నరికించకపోతే, బాక్సాఫీసు గల్లంతు అవుతుందని కోటీశ్వరులయిన చిత్ర నిర్మాతల భయం. డొనేషన్లు తీసుకుని, అనర్హులకు సీట్లు అమ్మకపోతే తమ బ్రతుకులు ఏం కావాలి అని కాలేజీలు నడిపేవారి కక్కుర్తి. పొగ త్రాగటం హానికరమన్న హెచ్చరిక చేస్తూనే జాకీషరాఫ్‌తో ఫలానా సిగిరెట్లు కాల్చడం ఎంత మంచిదో చెప్పించేవారి కక్కుర్తి చెప్పనే అక్కరలేదు.

ఇట్లా వ్యక్తి స్వార్థంతో సామాజిక న్యాయం నాశనం చేయబడ్తున్న కాలం మనది.

ఇట్టి కాలంలో పుట్టి పెరుగుతున్న చిన్నారుల భవిష్యత్తు ఏం కానున్నది ? వీరంతా మత్తు మందుల బానిసలుగా, మాఫియా గ్యాంగులుగా తయారు కావలసిందేనా ?

డాక్యుమెంటరీలలో పొగ త్రాగటంవల్ల భయంకరమైన క్యాన్సరు వస్తుందని చూపిస్తే, అదేదో సరదాగా చూసేసి, ఇంటర్వెలులో సిగిరెట్లు, బీడీలకు ఎగబడే ఆత్మహత్యాపరులుగానే వీరు రూపొందవలసినదేనా ?

భగవాన్‌లు భాగవతోత్తములు కూడ దీనిని నివారించలేరా ?

ఎట్లా, ఈ Slide down ఆపబడటం ?

ఒక్కటే మార్గం.

నేటి యువతీ యువకులే మరొక పది సంవత్సరాల తమ ముందుజీవితాన్ని ఊహించుకోవాలి. మరో పదేళ్ళ తరువాత నేనే మవుతాను ? ?

ఈ ప్రశ్న ప్రతి యువతి, యువకుడు నేడు వేసుకోవాలి.

వేసుకుని తమని తాము ఒక క్రమశిక్షణకు లోను చేసుకోవాలి. నిత్య తపస్సుగా మంచిని నేర్పే సామాజిక సంస్థ లున్నాయి—మన దేశంలో. వాటి నీడకు చేరాలి—యువత.

నిత్య తపస్సుగా మంచిని తమలో నింపుకోవాలి—

ఇదీ నేటి యువతావాణి పిలుపు—

★

## జీవితం

జీవితం జోకులా తీసికొంటే
కేకులా కరిగిపోతుంది —
జీవనం సీరియస్‌గా భావిస్తే
క్షణక్షణం ఎదురు దెబ్బలే;
జీవన రాగం శృతి పలికితే
ఆనందపు నందన వనంలో
అలవోకగా పయనించవచ్చు—
అపశృతు లెదురైతే మాత్రం
పూరేకులు ఎదురు తిరిగి
శూలాలై ముళ్ళవుతాయి.

— ముదిగొండ

# నిద్రని మరచిన మనిషి

**1952** దాకా ఇనెస్ ఫెర్నాండేజ్ అనే యువతి అందరిలా రోజుకి ఎనిమిది గంటల దాకా హాయిగా నిద్రపోయేది. కాని 52 లో ఓ రాత్రి గట్టిగా ఆవలించింది.

అంతే.

ఆ రాత్రి నిద్రపోలేదు. అలా ఆవలిస్తుండగా ఆమె మెదడులో ఏదో అయ్యి వింత భావనకి లోనయింది. ఆ తర్వాత ఆవిడ మళ్ళీ నిద్రకి నోచుకోలేదు. నిద్ర పోలేదు.

ఇప్పుడావిడ వయసు 58. స్పెయిన్‌లోని ఓ చిన్న గ్రామంలో నివాసం. స్పెయిన్‌లోని ప్రఖ్యాత న్యూరో సర్జన్ డా. పాబ్లోస్ అబ్రిల్ అనే ఆయన ఆవిడను పరీక్షించాడు. శరీరానికి విశ్రాంతికోసం, నిద్రకి ఆయత్తం చేసే ఆవిడ మెదడులోని ఓ భాగం ఎందుకో దెబ్బ తినడంతో ఆవిడకు నిద్ర పట్టదని కనుగొన్నాడు. ఆవిడ రోగానికి ఇంతదాకా చికిత్స లేదు. ఆరునెలలు ప్రయత్నం చేసి ఆ డాక్టర్ విఫలమయ్యాడు.

ఆయన మెడికల్ మేగజైన్స్‌లో ఆమెను గురించి చాలా వ్యాసాలు వ్రాశాడు. అలాంటి కేసు తాము కూడా చూసామనే డాక్టర్ ఎవరూ ఇంతవరకూ రాలేదుట. అంటే ఆ రకం వింతరోగం ఆవిడ కొక్కరికే వుందన్నమాట.

## మనకు తెలియని ప్రపంచం

### మల్లాది వెంకటకృష్ణమూర్తి

నిద్ర లేకపోవడంవల్ల ఆవిడకు ఎలాంటి అనారోగ్యం కలుగలేదు. ఆవిడ శరీరము నిద్రపోయే ఇతరుల శరీరాలలాగ ఆరోగ్యంగా వున్నది. అయితే ప్రతి రాత్రి ఆవిడకు ఒక పరీక్ష. ప్రపంచమంతా హాయిగా నిద్ర పోతుంటే, ఆవిడ మాత్రం మెలకువగా వుండటం దుర్లభంగా వుంటుంది. ముఖ్యంగా నిద్రలోని సుఖం ఆమెకు తెలుసు కాబట్టి.

ఉదయం చిన్న పిల్లలతో కాలక్షేపం చేస్తుంది. పొలంలో పనులు చేయడానికి వెళ్ళేవాళ్ళు తమ చిన్న పిల్లలను ఆమె సంరక్షణలో వుంచి వెళ్ళుతారు.

ఆవిడ భర్త బ్రతికివుండగా రాత్రంతా ఆయనను చూస్తూ గడిపేది. ఆయన మరణానంతరం ఇప్పుడు ఆవిడకి నిద్రలేమి చాలా బాధగా వున్నది.

సాధ్యమైనంత త్వరలో మరణిస్తే బాగుండునని కోరుకుంటోంది నిద్ర ఎలా వుంటుందీ మరచిపోయిన ఆ ముసలావిడ. ★

# గడ్డి తినేవాళ్ళా - అడ్డుకునే వాళ్ళా

గడ్డి తినటం జంతువుల లక్షణం అంటారు. కాని మనుషులే జంతువులకన్నా ఎక్కువ గడ్డి తిని వుంటారనేది నా దృఢమైన నమ్మకం. కాకపోతే ఈ వ్యవస్థలో ఎవడు గడ్డి తింటున్నాడో, ఎవడు తినడో తెలుసుకోవటం చాలా కష్టం. ఎక్కడో ఒకరో ఇద్దరో గడ్డి తినని వాళ్ళుంటారు. వాళ్లెవరో తెలుకోనివ్వరు ఈ గడ్డి తినేవాళ్ళు. తమ మురికి చొక్కాలే తెల్లగా వున్నాయని అనిపించాలంటే ఎదుటివాళ్ళ చొక్కాల మీద ఎక్కువ మురికి చల్లుతుండాలి. అదీ రాజకీయం.

## కలియుగరాజకీయాలు

రావి రంగారావు

"వాడు గడ్డి తింటున్నాడని
మొన్న
వీడన్నాడు,
నిన్న
వీడే
ఆ గడ్డి చెంత కూర్చున్నాడు,
ఇదే మంటే
గడ్డికి
కాపలా కూర్చున్నా నన్నాడు,
వీడే
ఈ రోజు
స్వయంగా గడ్డి తింటున్నాడు,
కళ్ళారా చూచి ప్రశ్నిస్తే
ప్రతివాడూ గడ్డి తినే కారణం
పరిశోధిస్తున్నా నన్నాడు
అలా వెళ్ళి
ఇలా తిరిగి వచ్చేసరికి
వీడి ముందు
అసలు గడ్డి జాడే కనిపించలేదు"

"మరి ఇంత మోసమా! నిన్నటిదాకా గడ్డి తినే వాళ్ళను గురించి ఉపన్యాసాలు దంచావు. ఈ రోజు అవకాశం వచ్చేసరికి నీవే ఆ గడ్డి తింటున్నావా!" అని అడిగాను ఆ పెద్దమనిషిని. ఆయనేమన్నాడో తెలుసా! "ఇంత చిన్నచిన్న విషయాలు పట్టించుకోవటం అల్పుల లక్షణం బాబూ! నువ్వు గొప్పవాడివి కాదలుచుకుంటే నాకంటే ఎక్కువ గడ్డి తినే వాళ్ళను ఆపగలిగితే ఆపు." అంటూ నన్ను ఎగతాళి చేశాడు - ఆ పెద్దమనిషి స్వార్థంతో అలా అన్నా అందులో కొంత సత్యం లేక పోలేదు. నా మిత్రుడొకడు గమ్మత్తయిన వాడున్నాడు.

"మంత్రిగారికి
ఓ నోట్లకట్ట
భక్తితో నివేదించుకుంటాడు,
అధికారి గారికి
ఓ పచ్చనోటు
మర్యాదగా సమర్పించుకుంటాడు,

గుమాస్తాగారికి
ఓ పది రూపాయలు
గుట్టుగా ఇచ్చేసుకుంటాడు ...
ఆపెండరు పాపం
అర్ధ రూపాయి అడిగేసరికి
అగ్రహోదగ్రుడై పోయి
అవినీతి చట్టం క్రింద
అరెస్టు చేయించాడు ...
పెద్ద పులులకు నమస్కరిస్తూ వాడు
కుక్కపిల్లల్ని కొడుతున్నాడు
బాణాలు సంధించటానికి అసమర్థుడు
దంటుపుల్లల్ని విరిచేయక
ఏం చేస్తాడు ?"

గడ్డి తినే లక్షణాన్ని జాతీయం చేస్తే బాగుంటుందని ఆ మధ్య ఓ రచయిత అన్నాడు కాని ఇది ఏనాడో జాతీయమైపోయిన సంగతి పాపం ఆయనకు తెలియదు.

"గడ్డి తినేవాణ్ణి గూరి
తొందరపడి ఫిర్యాదు చేయకు !
పై వాడొచ్చి
అసలు గడ్డే ఎత్తుకు పోతాడు !!!"

ఇదీ స్థితి .. పైనించి క్రిందికి బలిసిపోయిన ఈ గడ్డి తినేవాళ్ళను చూస్తూ ఊరుకోవలసిందేనా ! కంపు కొడుతున్న ఈ వ్యవస్థను ఎవడూ అదిలించలేడా !

"రొచ్చులో
పొర్లాడి పొర్లాడి పొర్లాడి



రోడ్డు కెక్కింది
ఈ జంతువు,
ప్రతివాడికీ భయమే
పైన బడి కుమ్ముతుందేమోనని
తోక విసిరికొడుతుందేమోనని "

అది తోక విదిలిస్తే ఆ బురదంతా వచ్చి తమ తెల్లచొక్కాలు పాడవుతాయని సమర్థులు కూడా వెనకడుగు వేస్తున్నారు. ఈ దుస్థితి తొలిగే విషయం గురించి మనుషులైన వాళ్ళు ఆలోచించాల్సిందే కాని జంతువులు ఎలాగూ ఆలోచించవు కదా.

****

# పోప్‌ను రాష్ట్రపతి ఆహ్వానించడం న్యాయ విరుద్ధం

## ఉడిపి ధర్మ సంసద్ మహాసమ్మేళనం విజ్ఞప్తి

ధర్మమే ప్రాణంగా గల భారతదేశానికి అధిపతియైన రాష్ట్రపతి కేథలిక్ చర్చి మతగురువుకు రాజకీయాహ్వానం అందించడం అత్యంత శోచనీయం. రోమ్‌లోని వాటికన్ బస్తీకి ప్రశాసకుడైన కారణాన భారత రాష్ట్రపతి, రాజ్యాధినేతగా పోప్‌ను ఆహ్వానించారని ఒక ప్రచారమున్నది. పోప్ రాజ్యాధికారంలో కేవలం వందమంది అంగరక్షకులైన సైనికులు మాత్రమున్నారు. రాజ్యాధినేతగా ఆహ్వానించారనే వాదనలో ఏమాత్రం వాస్తవం లేదు. అసలు ఈ ఆహ్వానమునకు ముఖ్యకారణం ఆయన కేథలిక్ మత గురువు కావడమే. క్రైస్తవులను సంతృప్తి పరచడానికోసం కేంద్రప్రభుత్వం చేసే ప్రయత్నంలో యిది ఒక భాగం. కానీ ఈవిషయం మాత్రం దాచబడుతున్నది. రాజకీయ స్థాయిలో గత 38 సంవత్సరాలలో భారతీయ ధర్మాచార్యులెవరికీ లభించని స్వాగతం ఒక పరకీయ మతగురువుకు అందించడం, పరోక్షంగా యావత్ హిందూసమాజాన్ని అవమానించడమే అవుతుంది. పోప్‌ని ఒక రాజకీయ ప్రశాసకుని హోదాలో ఆహ్వానించి యుంటే ఆయన కార్యక్రమాలు రాజనీతికి మాత్రమే పరిమితము కావాలని ధర్మసంసద్ భావిస్తున్నది. అటుల కాదనే విషయం జగద్విదితమే. పోప్ తనంతట తానుగా ఒక మతాధిపతిగా భారత దేశాన్ని సందర్శించడంలో ఎవరికీ ఎట్టి అభ్యంతరం వుండదు. ప్రభుత్వ ఆహ్వానంమీద వచ్చి మతప్రచారం చేయడం సముచితం కాదని మా అభిప్రాయం. కనుక మతప్రచారానికి వస్తున్న పోప్‌కు రాజకీయ ఆహ్వానంను రద్దుచేయడం శ్రేయస్కరం, సముచితమూ అని ధర్మ సంసద్ భావిస్తున్నది. ఉడిపిలో జరిగిన ఈ మహాసమ్మేళనమునకు స్వామి చిన్మయానంద అధ్యక్షత వహించారు. ★

## చిరస్మరణీయులు

# డా॥ బూర్గుల రామకృష్ణరావుగారు

కీర్తిశేషులు డాక్టర్ బూర్గుల రామకృష్ణరావు గారు, గాంధీమహాత్ముని అడుగజాడల్లో, దేశస్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని, నిజాంగారి నిరంకుశ పరిపాలన నుండి, రాష్ట్ర ప్రజల దాస్యవిముక్తికి పోరాడిన యోధుడు.

హైద్రాబాద్ స్టేట్, భారత ప్రభుత్వములో విలీనమైన తరువాత మొదటిసారి జరిగిన సాధారణ ఎన్నికల అనంతరం ప్రజలచేత, ఎన్నుకోబడ్డ, మొదటి ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల.

అసెంబ్లీలో స్టేట్ కాంగ్రెసుకు నాయకుడై కేవలం ఏడుగురు మెంబర్ల మెజారిటీతో చాకచక్యముగా, ప్రభుత్వమును నడిపిన రాజకీయ చతురుడు. తరువాత ఫజల్ అలీ కమిటీ సిఫార్సును అనుసరించి, ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం యేర్పాటుకు వీలు ఉన్నప్పటికీ, ప్రత్యేక తెలంగాణా కావాలని కోరే, కొందరు నాయకులను వ్యతిరేకించి ఆంధ్రులందరి ఐకమత్యము శ్రేయోదాయకమన్న విశాల భావముతో విశాలాంధ్ర అనగా నేటి ఆంధ్రప్రదేశ్ స్టేట్ స్థాపనకు ఉద్యమించిన వారిలో ముఖ్యులు. కాగా ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుండి విడిపోయి, ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పాటుకు స్వర్గీయ పొట్టి శ్రీరాములుగారి త్యాగం ముఖ్యకారణమైనట్లే, తెలంగాణా విశాలాంధ్రలో లీనమై ఆంధ్రప్రదేశ్ యేర్పడుటకు బూర్గులవారి మేధా సంపన్నమైన రాజకీయ నాయకత్వము ముఖ్య కారణము. అప్పుడు ఆయన త్యాగబుద్ధి రాజకీయ చతురత ప్రదర్శించనిచో యిప్పటి ఆంధ్రప్రదేశ్ స్టేటు కాకపోవచ్చునేమో ?

రామకృష్ణారావుగారు తెలంగాణాలోని మహబూబ్ నగర్ జిల్లా బూర్గుల గ్రామవాసి. 13 మార్చి 1899 లో జన్మించి బాల్యమును, విద్యాభ్యాసమును గ్రామములోనే జరిపారు. హైదరాబాదులో నిజాం కాలేజిలో కొంత కాలము చదివి తరువాత పూనాలో పట్టభద్రులై బొంబాయిలో లా డిగ్రీని సంపాయించినారు. హైదరాబాదులో న్యాయవాది వృత్తిలో ఉండగానే ఎక్కువగా సాంఘిక సంస్థలలో ముఖ్య కార్యకర్తగా పాల్గొన్నారు.

ఆర్. వి. మధుసూదనరావు IAS [Retd.]

ఆనాటి నిజాం ప్రభుత్వం రాజకీయ ఉద్యమాలకు అవకాశం ఇవ్వనందున వీరు సాంఘిక సేవా భావములు గల మేధావులైన, దేశభక్త వామన్‌నాయక్, పండిత కేశవరావు, మాడపాటి హనుమంతరావు, మందుముల నర్సింగరావు, కొండా వెంకటరంగారెడ్డి, సురవరం ప్రతాపరెడ్డి, బాబర్ అలీ మిర్జా, ఫజల్‌రహమాన్, డా॥ లతీఫ్ సయ్యత్, గార్లతో కలిసి అంజుమన్ తరక్కీ హైదరాబాద్ "స్వదేశీలీగు" "నిజాం ప్రజల సంఘం" మొదలగు ప్రజా సంస్థల్లో ముఖ్యపాత్ర వహించినారు. 1925 లో జరిగిన కాకినాడ కాంగ్రెసులో పాల్గొని, అప్పటి కాంగ్రెసు అధ్యక్షుడయిన మౌలానా మహమ్మదు అలీగారి యొక్క ఉర్దూ ఉపన్యాసమును, అప్పటికప్పుడే తెలుగులో అనువదించి ప్రజలను ఆశ్చర్యచకితులను చేసిరి. అప్పటి నుండి శ్రీమతి సరోజినీనాయుడుగారి ద్వారా, కాంగ్రెసు అగ్ర నాయకులతో పరిచయమేర్పరచుకొని హైదరాబాదు స్టేటు కాంగ్రెసు నాయకులలో ప్రముఖులై ఎన్నో సాంఘిక, వైజ్ఞానిక, సారస్వత సంస్థలలో ముఖ్య పాత్రను, అధ్యక్షతను వహించారు. బూర్గులవారి రాజకీయ దురంధరత్వమును, దేశ నాయకత్వమును గమనించిన శ్రీ నిజాం ప్రభువు ఆయనకు మంత్రి పదవిని ఆఫర్ చేసినను నిరాకరించిన త్యాగమూర్తి.

1948 సెప్టెంబర్‌లో పోలీసు యాక్షను జరిగి, జె. యన్. చౌంద్రి గవర్నరుగా మిలటరీ ప్రభుత్వము ఏర్పడినది. మిలటరీ ప్రభుత్వ పాలనలో చాలా అడ్మినిస్ట్రేటివ్ రీఫార్మ్స్ జరిగినవి. ఆ సంస్కరణలలో యెక్కువ భాగము రామకృష్ణారావుగారి ముఖ్యమంత్రిత్వములో అమలు జరిగినవి. అప్పుడు జరిగిన జాగీర్ అబాలిషన్ మొదలయిన సంస్కరణలలో వారి పరిపాలనా శక్తి సామర్థ్యములను చూసి ఆ యా శాఖల అధికారులెందరో హర్షించినారు. ఎంత కఠిన సమస్య వచ్చినప్పటికీ-దానిని క్షుణ్ణంగా పరిశీలించి దానిని సునాయాసముగా పరిష్కరించేవారు. అప్పటి శాసనసభలో ప్రభుత్వ యంత్రాంగములో తెలుగువారు, మహమ్మదీయులు, మహారాష్ట్రీలు, కన్నడీయులుండేవారు. రామకృష్ణారావుగారు ప్రాంతీయ భాషలన్నిటిలోనూ అనర్గళంగా మాట్లాడుతూ, అన్ని ప్రాంతాల ప్రజల ఆత్మీయత, వారి అభిమానాన్ని చూరగొన్నారు. ముఖ్యమంత్రి పదవి నిర్వహణలో ఎవరి మనసు నొవ్వకుండా, ప్రవర్తిస్తూ, ప్రభుత్వ యంత్రాంగమును ప్రజారంజకముగా నడిపినారు.

ఇది నాకు బాగా జ్ఞాపకమున్న విషయము. ఒకసారి వీరి మీద అపోజిషన్‌లో ఉన్న పి. డి. యఫ్. పార్టీవారు నో కాన్ఫిడెన్సు మోషన్ తెచ్చారు. అప్పటి ప్రతిపక్ష నాయకుడు కామ్రేడ్ సి. డి. దేశ్‌పాండె గొప్ప వక్తగా పేరుగల వాడు. రామకృష్ణారావు ప్రభుత్వము మీద అనేకమైన నిందారోపణములు చేస్తూ, సాగిపోయిన ఆయన ఉపన్యాసధోరణికి సభ్యులు, కాంగ్రెసు మంత్రులు కలవరపడి కృంగిపోతూంటే బూర్గులవారు మాత్రము నిశ్చింతగా ప్రతిపక్షనాయకుని నిందారోపణములను కాగితంపై నోట్ చేసుకుంటూ కూర్చుని, ఆరోపణలు పూర్తయిన తరువాత సభాధ్యక్షునికి నమస్కరించి తన దాదాపు 6 గంటల సుదీర్ఘ ఉపన్యాసములో ప్రతిపక్షాల ఆరోపణల నన్నిటిని ( తునాతునకలుగా ) ఖండించినారు. తదనంతరం స్పీకరు నిర్వహించిన ఓటింగులో ప్రతిపక్షాలు ప్రతిపా

దించిన విశ్వాసరాహిత్య తీర్మానము వీగిపోయింది. ఇది బూర్గులవారి ప్రతిభకు రాజకీయ చతురతకు గీటురాయి అని ఆనాటి సభ్యులు ప్రశంసించినారు.

మరొకసారి, విశాలాంధ్రము యేర్పడవలెనా లేదా అన్న చర్చలో ఎందరో సభ్యులు వ్యతిరేక భావాలను వ్యక్తపరచినప్పటికి, విషయ పరిశీలనాత్మకమైన, సుదీర్ఘ ఉపన్యాసముతో, సభ్యుల సుముఖతను చూరగొని, శాసనసభలో విశాలాంధ్ర స్థాపనకు తీర్మానమును ఆమోదింపచేశారు. భారత దేశంలో మరే ఇతర ప్రాంతములలో అమలులోలేని భూ సంస్కరణములను ప్రవేశపెట్టి కమ్యూనిస్టు ఉద్యమాలను నిర్వీర్యము చేసినారు.

తాను స్వయముగా ఒక చిన్న జాగీర్దార్ అయినప్పటికి జాగీర్ అబాలిషన్ కార్యక్రమాలను చిత్తశుద్ధితో, ఉత్సాహముతోను నిరాటంకముగా నిర్వహించినారు. హైదరాబాదు స్టేటులో అధిక సంఖ్యాకులైన ముస్లిం జాగీర్దారీలు కూడా వీరి కార్యక్రమాలకు అడ్డుతగులకుండా ఆమోదించినారు. ఇది వారి రాజకీయ సంస్కారమునకు ఉదాహరణము.

సుమారు ఏడు శతాబ్దాలు నిరంకుశంగా సాగిన మహమ్మదీయుల పరిపాలనకు స్వస్తి చెప్పి నిజాం రాజ్యమును ప్రజారాజ్యంగా రూపొందించి, దేశనాయకులయిన పండిట్ నెహ్రూ, సర్దార్ పటేల్, మొదలయిన వారి అభీష్టానుసారముగా హైదరాబాదును తీర్చి దిద్దిన బూర్గులవారి ప్రజ్ఞావిశేషం అసాధారణము.

శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు రచయిత. కవి. గొప్ప వక్త. తెలుగు, ఉర్దూ, పారశీకము, సంస్కృతము మొదలైన భాషలలో వారి రచనలు ముద్రితములైనవి. పారశీక వాఙ్మయ చరిత్ర తెలుగులోనికి అనువదించినట్లే సంస్కృత కావ్యములను, పండితరాయలు శ్రీ ఆదిశంకరులు మొదలైన వారి రచనలను తెనిగించినారు. అట్టి బహు భాషా వక్త, ప్రజాసేవకుడు, రాజకీయ దురంధరుడు అయిన శ్రీ బూర్గులవారు ఆంధ్రులందరికీ చిరస్మరణీయులు. ★

# యోగాసనములు

దివాకర్ల వెంకటేశ్వర్లు

ఆరోగ్యమే మహా భాగ్యము అను నానుడి ఏనాటి కైనా నగ్న సత్యము. అనారోగ్య పీడితుడు తన కుటుంబమునకే కాక, సంఘానికి, దేశానికి పెద్ద బరువు అనుటలో సందేహములేదు. జీవితములో ఏదైనా సంపాదించవచ్చునేమోగాని పోయిన ఆరోగ్యమును సంపాదించుట దుర్లభము.

వ్యాయామములో కెల్ల యోగాసనములు అగ్రస్థానము ఆక్రమించుచున్నవి. ఆసనములు పూర్వము ఋషులు ఆచరించి మంచి ఆరోగ్యము పొంది అకాల మృత్యువు నుంచి తప్పించుకొనిరి. కాని నేటి మానవుడు వీటిని నిర్లక్ష్యముచేసి అనారోగ్య పీడితుడై అకాల మరణమునకు గురవుచున్నాడు. మరియు వ్యాయామము ఆచరించుటకు కాలము సరిపోవుటలేదని తనని తాను మోసగించుకొనుచున్నాడు. కాని ఈమధ్య యోగాసనములపై మరల రేడియోలోను, వివిధ పత్రికలలోను ప్రసంగములు, వ్యాసములు వచ్చుట గమనార్హము. యోగాసనముల ద్వారా మంచి ఆరోగ్యాన్ని, నిర్మలమైన మనస్సును పొంది తద్వారా దీర్ఘాయువు పొందుటకు అవకాశము కలదు. కొంతమందిలో ఆసనములనగా శీర్షాసనము వంటివని, అవి చేయుట కష్టసాధ్యమని, వాటిని ముక్కు మూసుకుని ధ్యానము చేయు యోగులకని అపప్రథ కలదు. కాని నిజానికి శీర్షాసనము ఆసనములలో ఒకటి మాత్రమే. ఇది కాక చాలా ఆసనములు కలవు. ఆసనములు ఏ వయస్సు వారైనను, స్త్రీ పురుషులైనను వేయవచ్చును. ప్రొద్దున్న వేయుట శ్రేష్ఠము. కుదరనివారు సాయంత్రమైనను వేయవచ్చును. కాని ముఖ్యముగా పాటించవలసినదేమనగా ఆసనములు వేయునపుడు కడుపులో ఏ విధమయిన ఆహార ముండరాదు. అప్పుడే ఆసనముల వలన సంపూర్ణ ఫలితములు కలుగును. ఆసనములు ప్రతిదినము వేయలేనివారు వారమునకు 5 రోజులు వేసిన చాలునని, ఎంతవరకు వేయగలిగితే అంతవరకు వేయవచ్చునని, పరిపూర్ణత రాలేదని నిరాశ చెందనవసరము లేదని, రోజులో 15 నిముషములు దానికి కేటాయించిన మంచి ఆరోగ్యము పొందవచ్చునని నిపుణుల అభిప్రాయము. ఎండాకాలములో కన్న చలికాలములో ఎక్కువకాలం వినియోగించవచ్చును.

ఆసనముల వలన శరీరములోని ప్రతి అవయవమునకు రక్త ప్రసరణ సక్రమముగా జరిగి, అవి గట్టిపడి అనేక భయంకరమయిన వ్యాధులను దరిచేరనీయవు. అందువలన ఆసనములు వ్యాధులను నిర్మూలించుటయేకాక, వ్యాధులు రాకుండా కాపాడును.

ఆసనములలో ముఖ్యమయినవి శీర్షాసనము, సర్వాంగాసనము, మయూరాసనము, త్రికోణాసనము, భుజంగాసనము, శలభాసనము, ధనురాసనము, పశ్చిమోత్తాసనము, సూర్య నమస్కారాసనము, అర్ధమత్స్యేంద్రాసనము, హాలాసనము, పాద హస్తాసనము మొదలగునవి. శీర్షాసనము వలన జ్ఞాపకశక్తి పెరుగుటకు, సర్వాంగాసనము సర్వ వ్యాధులు హరించుటకు, హాలాసనము, శలభాసనము, భుజంగాసనము జఠర వ్యాధులు నివారించుటకు మరియు మలబద్ధకము పోగొట్టుటకు, అర్ధమత్స్యేంద్రాసనము నడుము నొప్పి మొదలగు వ్యాధులు పోగొట్టుకొనుటకు, పశ్చిమోత్తాసనము శీఘ్ర స్ఖలనములు నివారించుటకు, శవాసనము రక్తపోటు మొదలగు వ్యాధులు నిర్మూలించుటకు మిక్కిలిగా వాడుకలో నున్నవి. ప్రాణాయామము కూడా యిందులో భాగమే. దీనివలన కలుగు సత్ఫలితములు యింత అని చెప్పుటకు వీలులేదు. ఏకాగ్రతకు, నరముల శక్తికి, కుండలిని శక్తి పెంచుట కుపయోగించును. మరియు దీనివలన ముఖ వర్చస్సు, చురుకుతనము, ధైర్యము కలుగును.

ప్రతి వాచకములోను విధిగా ఆసనములపై వ్యాసములు ప్రచురించి, ప్రతి పాఠశాలయందు NCC మాదిరిగా ఆసనములు కూడా విధిగా బోధించిన ప్రజలు చక్కటి ఆరోగ్యము పొంది దేశమునకు మంచి పౌరులుగా సేవ చేయ వీలు కలుగును. ఇది మేధావులు, రాజకీయ వేత్తలు, తప్పక ఆలోచించవలసిన సూచన. సర్వేజనా స్సుఖినోభవంతు. ★

**"కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన**
**మా కర్మఫలహేతుర్భూర్మాతే సఙ్గోఽస్త్వకర్మణి"**

"నీకు కర్మను చేయుటయందే అధికారము కలదు. కర్మ ఫలములందెప్పుడునూ నీ కధికారము లేదు. కావున నీవు కర్మ ఫలములకు కారణమైనవాడవు కాకుము. అట్లని కర్మలు చేయకుండుట యందు నీకు ఆసక్తి కలుగకుండు గాక !"

# శ్రీకృష్ణవాణి

## - కొమరగిరి

శ్రీ కృష్ణభగవానుడు అర్జునునికి చక్కటి సలహా యిచ్చాడు. అంటే ఒక్క అర్జునుని మాత్రమే దృష్టిలో పెట్టుకుని ఈ సలహా మాత్రం యివ్వలేదు. భావితరాల వారందరి మనోప్రవృత్తులను ఎలా వుంటాయో దూర దృష్టితో కనిపెట్టి శ్రీ కృష్ణపరమాత్మ ఈ అమూల్యమైన సలహాను యిచ్చి వుంటారు. "Do Your Duty Sincerely" అని ఏనాడో శ్రీకృష్ణుడు హెచ్చరించాడు. రానురాను సమాజంలో చాలామంది తమవంతు పని తాము చేయడం లేదు. ఎవరి కర్తవ్యాన్ని వారు నిర్వర్తించడం లేదు. హక్కులకోసం పోరాడుతున్నారే గాని, బాధ్యతలను గుర్తించడం లేదు. పని చేసేవారు కూడా స్వార్థంతోనే చేస్తున్నారు. ఏదో ఒక ఫలితాన్ని ఆకాంక్షించే చేస్తున్నారు అసలు పని చేసేవారే కరువై పోతున్నారు. సోమరితనం ప్రబలుతున్నది. దేశ ఆర్థిక పరిస్థితి అస్తవ్యస్తంగా తయారవుతున్నది. ఇదీ ఈనాటి పరిస్థితి.

ఇటువంటి దుస్థితి భవిష్యతులో ఏర్పడుతుందని శ్రీకృష్ణపరమాత్మ ఏనాడో ఊహించాడు. రానున్న సమాజమును దృష్టిలో పెట్టుకుని అర్జునునికి చక్కని గీత బోధ చేసాడు. కర్మ చేయటం మాత్రమే ప్రతివాని కర్తవ్యం. ఫలితమును మాత్రం ఆశించరాదు. ఫలిత మాశించి కర్మను చేయరాదు. అసలు ఏ పనీ చేయ కుండా ముక్కు మూసుకొని కూర్చోరాదు. సమాజంలో జీవించేటప్పుడు ఏదో ఒక పని చేయక తప్పదు. ఆ పని మంచిపని అయి వుండాలి. నిష్కామ బుద్ధితో చేయాలి. స్వార్థరహితంగా చేయాలి. పట్టుదలతో చేయాలి. నిర్దుష్టంగా చేయాలి. అటుల చేసినయెడల భగవదనుగ్రహం కూడా దానంతట అదే లభిస్తుంది.

ఏదో ఒక ఫలితాన్ని ఆశించి, స్వార్థంతో పనిచేసే వారికి ఒకవేళ తాత్కాలికంగా లాభం చేకూరుతే చేకూర వచ్చును గాని శాశ్వతమైన ఫలితాలు మాత్రం చేకూరవు. ఇటువంటి స్వార్థపరులను భగవంతుడు మెచ్చడు.

అకర్మణ్యత్వము అనగా ఏ పనిని చేయకుండుటను అసలే భగవంతుడు ప్రోత్సహించడు. అకర్మణ్యత్వము వలన సోమరితనం ప్రబలుతుంది. సోమరితనం వలన తన కుటుంబమునకే గాక దేశ భవిష్యత్తుకు కూడా విఘాతం కలుగుతుంది. కనుక సోమరితనాన్ని దరికి చేరనీయ రాదు.

కనుక ఎవరికి నిర్దేశించబడిన పనిని వారు నిష్కామ బుద్ధితో చేయాలి. అర్జునుడు క్షత్రియుడు. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ క్షాత్ర ధర్మము. అటువంటి అర్జునుడు హృదయ దౌర్బల్యానికి లోనై గాండీవమును క్రింద పెట్టి, క్షత్రియ ధర్మమునకు విరుద్ధంగా చేతకాని మాటలు, చవట కబుర్లు చెప్పడం మొదలుపెట్టగా, శ్రీకృష్ణుడు ఆనాడు అర్జునునికి కర్తవ్యాన్ని ప్రబోధించాడు. కార్యోన్ముఖుని గావించాడు. కనుక ప్రతి ఒక్కరూ తాను చేయవలసిన పనిని ఎట్టి ఫలాపేక్ష లేకుండా చేయాలి. అది పదిమందికీ ఉపయోగపడే పనియై వుండాలి.

కోరికతో కర్మను చేయరాదు. అట్లని కర్మనే చేయ కుండా వుండరాదు. నీకు నిర్దేశించబడిన పనిని నిష్కామ బుద్ధితో చేయటమే నీ కర్తవ్యం —

★



# జ్యోతిషవాణి

నిర్వహణ : దైవజ్ఞరత్న, వాస్తుజ్యోతిష విద్వాన్
**కవితా కామేశ్వరశర్మ**
అవనిగడ్డ - 521 121

**డి. వి. ఆర్. సి. రాయ్** — చంద్రాల

**ప్రశ్న :** నేను గవర్నమెంటు ఉద్యోగం చేయగలనా ? ఎంతకాలము పట్టును ఉద్యోగము రావటానికి ?

**సమా :** సమ్మకం తక్కువగా వుంది. రావడమంటూ వుంటే గతంలోనే వచ్చి వుండేది.

**ప్రశ్న :** నాకు పుత్ర సంతానం వుండునా ? సంతానం ఎంతమంది ?

**సమా :** ఒక్క పుత్ర సంతానం బహుశా వుంటుంది. స్త్రీ సంతానం యిర్వురు వరకు అవకాశం వుంది. (జీవించు వారు) మూడవది అనుమానం.

**N. B. :** మీరు పంపిన జాతకం యధావకాశంగా చూచి మీకు జాబు వ్రాస్తాను. పుత్ర భావం జాతకరీత్యా ప్రశ్న కాల రీత్యా కూడా దోషంగా వుంది మరి. జ్యోతిష్కులకు పరీక్షగా వుంది.

**సి. యస్. మూర్తి** — హైదరాబాదు

**ప్రశ్న :** నా ప్రస్తుత బాధలకు కారణమేమిటి ?

**సమా :** మీ జాతక రీత్యా దోషం కనిపించదు. కాగా జన్మ రాశిలో ఏల్నాటి శని దీని ప్రభావము. జపాలు చేయించారు గనుక దోషము కొంత తగును.

**ప్రశ్న :** చర రాశి గత కేతువు శుభుడు గదా ! కేత్వంతరము దోషమగునా (శు × కే)

**సమా :** చర రాశి గత కేతువు శుభుడనుట సామాన్య వచనం. అంతర్దశానాధుని ఫలములు ఆలోచించునపుడు మహా దశానాధునితో గల సంబంధమును ఆలోచించాలి. మహా దశా అంతర్దశానాధులకు గల షష్ఠాష్టమ దోషం వలన కేతు భుక్తి మంచిది కాకపోవును.

**జి. వెంకటేశ్వరరావు** — నంగేగడ్డ

**ప్రశ్న :** నా జాతకములో మంచి అభివృద్ధి వుంటుందా ?

**సమా :** ఎంతో కొంత వుంటుంది. పెద్దగా వుండకపోవును. రాజయోగములు లేవు. అన్న వస్త్రములకు లోటు వుండదు.

**ఘంటసాల సత్యనారాయణ వరప్రసాద్** — ఏలూరు

**ప్రశ్న :** జాతకం పంపుచున్నాను. అనుకున్న పనులు అగుటలేదు కొంత కాలంగా. మంచిరోజు లెప్పుడు వచ్చును ?

**సమా :** ఏలినాటి శని వెళ్ళింది మొన్ననే గదా ! ఇప్పుడిప్పుడే ఉషోరేఖలు ప్రారంభము. క్రమశః మంచి కల్గును. గురుదశ సామాన్యమైనదే. అయినా నిరుత్సాహం అనవసరం. శివుని ఆరాధించండి.

ప్రశ్న : మా కుమార్తెకు విద్య ఎంతవరకు వస్తుంది ?
సమా : కాలేజి ఎడ్యుకేషన్ వుండకపోవచ్చును.

కె. శ్రీనివాస్ విజయవాడ

ప్రశ్న : నా జాతకంలో గురు దశ. ఏలా వుంటుంది ?
సమా : గురు దశ మంచిది. యోగ దశ అయితే స్వభుక్తి అన్గా గురు దశలో గురు భుక్తి గదా ! ఈ Period సామాన్యము. శని భుక్తి నుంచి యోగారంభ కాలము. ఏల్నాటి శని వెళ్ళనున్నది. చివరి ఖండంలో వుంది. పూర్తిగా వెళ్ళలేదు.

యస్. మురళీకృష్ణ కాకినాడ

ప్రశ్న : రాశి ఫలాలు ఎంతవరకు కరెక్టు- నా రాశి మేషం.

సమా : జాతకం ముఖ్యం. రాశి ఫలాలు అందరకూ సరిపోవు. కారణం జాతకంలోని గుణదోషాల వల్ల. పేరు ఒకటే అయినా నామ రాశి ఫలాలు జన్మ రాశి ఫలాల కంటె తక్కువగా సరిపోవును. అనగా ఒకే పేరు గల వారైనా ఒకే ఫలాలుండకపోవును. ఇది జన్మ రాశి ఒకటే అయిన యిర్వురకు కొన్ని ఫలాలు అయినా సరిపోయే అవకాశం వుంది. ఉదా : యిర్వురు వ్యక్తుల నే నెరుగుదును. ఒకరు చనిపోయారు. ఒకరు యోగ వంతులై జీవించి యున్నారు. యిర్వురూ ఒకే పేరు గలవారు. జన్మరాశి వలన యీలాటి తేడాలు స్వల్పంగా వుండును. గనుక నామ రాశి ఫలాలు కంటె జన్మ రాశి ఫలాలు 50% అయినా సరిపోగలవని అనుకొంటాను. మేష రాశి చెప్పదగిన మంచి వుండదు. ప్రతిబంధకములు జాస్తి. జాతకంలో శుభ ఫలాలున్న వాటిని కొంత తగ్గించును.

కె. గోవిందస్వామి కాకినాడ

ప్రశ్న : సింహలగ్నం—లగ్నంలో శుక్ర కుజులు— దీని ఫలమేమిటి ?

సమా : ఏ జాతక మందైనా పై కలయిక కాముక లక్షణము. పురుషులకు ప్రవర్తన దోషం కలుగవచ్చు. స్త్రీలకు యీ దోషం వుండదు. కాముక లక్షణములుండి శారీరక సుఖము ఎక్కువగా కోరునదై ( భర్తతోనే ) వుంటుంది. యోగ విషయంగా కొందరు యీ లగ్నంకి యీ గ్రహాల కలయిక ( 9 + 10 ) అయినా యోగ ప్రదము కాదంటారు. యోగ ప్రదమని చెప్పు శాస్త్రాధారం కూడా వుంది. కుంభలగ్నంకి కూడా వీరి కలయిక యిట్టిదే.

ప్రశ్న : నా జాతకంలో లగ్నాధిపతి భాగ్యంలో ఉన్నాడు గదా ! ఆ దశ యోగించలేదేమిటి ? ( మకరలగ్నం )
సమా : లగ్నాధిపతి భాగ్యంలో స్థితి దోషంలేదు గాని యోగమని ఎక్కడున్నది కేంద్రాధిపతి కోణంలో— కోణాధిపతి కేంద్రంలో యోగం—సహజంగా కోణ స్థితి కంటె కేంద్ర స్థితి లగ్నాధిపతికి బలం-కేంద్రం పైష్ణవ శక్తి. కొన్ని లగ్నములకు మాత్రమే లగ్నాధిపతి భాగ్యం యోగ లక్షణం రెండవ ఆధిపత్యం వలన. ★

## జ్యోతిష వాణి

పేరు..............................................

చిరునామా ..........................................

..........................................

జనన తేది..............దశాంశము..................

లేఖ వ్రాయు సమయం............తేది..................

గమనిక : 1. జాతక చక్రము ఉన్నవారు పంపవలెను.
2. ప్రతివారు రెండు ప్రశ్నలకు మించి పంపరాదు.
3. శ్రీవాణి పత్రికలో యిచ్చిన ఈ కూపన్‌ను జతపరచవలెను.

వేదవ్యాస జోస్యం

# న్యూయార్క్ నగరం నేలమట్టమవుతుంది

ఈ సంవత్సరం నవంబరు 27 నుంచి వచ్చే సంవత్సరం మే నెల వరకు దర్శనమిచ్చే హేలీ తోకచుక్క వల్ల నాయకులకు ప్రమాదం సంభవించవచ్చునని డా॥ ఎక్కిరాల వేదవ్యాస ఇటీవల ఐక్యరాజ్యసమితి 40 వ వార్షికోత్సవ సాంస్కృతిక సదస్సు "మస్టిక్స్" విభాగంలో మాట్లాడుతూ హెచ్చరించారు.

రానున్న 20 సంవత్సరాలలో ప్రపంచంలో మూడవ వంతు మానవ జాతి నశించిపోతుందని కూడా ఆయన అన్నారు. డా॥ వేదవ్యాస గత మూడునెలలుగా అమెరికాలో పర్యటిస్తూ వేదములు, యోగవిద్యలు, సంస్కృతం, జ్యోతిషం, సైన్సు పరిశోధనలపై అనేక ప్రసంగాలు చేసారు. "వేదికయూనివర్శిటీ" స్థాపన సందర్భంగా వేదవ్యాసను అమెరికాకు ఆహ్వానించారు.

వేదవ్యాస తమ ప్రసంగంలో ప్రపంచభవిష్యత్తును గురించి ప్రాచీన మహర్షులు తాళపత్ర గ్రంథాలలో, వీర బ్రహ్మేంద్రస్వామి 'కాలజ్ఞానం' లో వ్రాసిన మాటలు చెప్పి అనేకమందిని ఆశ్చర్యంలో ముంచెత్తారు. 1998 లోగా అణు యుద్ధం సంభవించి భూకంపాల వల్ల న్యూయార్క్ నగరం నేలమట్టమయిపోతుందని ఆయన "భవిష్య పురాణం" నుంచి ఉదహరిస్తూ చెప్పారు.

1998 సంవత్సరం మే 10 వ తేదీన ఉత్తర, దక్షిణ ధృవాలు తలక్రిందులౌతాయని, 2000 వ సంవత్సరం మే 5 వ తేదీన అమావాస్యనాడు గ్రహ సంక్షోభం ఏర్పడి అమెరికా, జపాన్, ఈజిప్టు, టర్కీ, చైనా దేశాలలో జల ప్రళయం సంభవిస్తుందని, జార్జియారాష్ట్రం సముద్రంలో కలిసి పోతుందని డా॥ వేదవ్యాస తెలిపారు.

విష్ణువు పదవ అవతారమైన కల్కి 1962 ఫిబ్రవరి 5 వ తేదీన జన్మించాడని హిమాలయాలకు ఉత్తరంగా కారకోరం పర్వతాల నడుమ "శంబళ" గ్రామంలో టిబెట్, గోబీ ఎడారి సమీపంలోని ఆశ్రమంలో పెరుగుతున్నాడని ఆయన చెప్పారు.

అణు యుద్ధాలతో, సైనిక విన్యాసాలతో సాధించలేని విశ్వశాంతిని, మానసిక యోగ శాస్త్రాల సహాయంతో సాధించాలని డా॥ వేదవ్యాస హితవు చెప్పారు.

('ప్రపంచ శాంతి' - వారపత్రిక 15-11-85)

---

# షాబాను కేసులో సుప్రీంకోర్టు తీర్పు సమంజసమే

షాబాను కేసులో సుప్రీం కోర్టు తీర్పు పట్ల "ముస్లిం ప్రజల తీవ్ర నిరసన" తెలుపుతూ అఖిల భారత ముస్లిం వ్యక్తిగత చట్టం బోర్డు ప్రధానమంత్రికి వినతి పత్రం సమర్పించింది. రాజ్యాంగంలోని 25 వ సూత్రం ముస్లింలకు ఇచ్చిన మత స్వేచ్ఛను ఆ తీర్పు ఉల్లంఘిస్తున్నదని బోర్డు వాదిస్తున్నది. ఉమ్మడి పౌర చట్టం కావాలని 44 వ సూత్రం ఇస్తున్న ఆదేశం జాతీయ సమైక్యతకు భంగకరమని వాదిస్తున్నది. జనతా పార్టీ కార్యదర్శి సయ్యద్ షహబుద్దీన్‌తో సహా ముస్లిం మేధావులు ఈ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నట్లు కనిపిస్తున్నది. సుప్రీం కోర్టు "షరియత్" ను ఉల్లంఘించిందని ఆరోపిస్తూ ఆందోళన ప్రారంభమైంది.

**రామ్ జెత్మలాని**

ఆ ఆరోపణ పూర్తిగా నిరాధారమైనది. ఇస్లాం మతానికి, మహమ్మద్ ప్రవక్త బోధనలకూ పెడర్థాలు తీసే ఆరోపణ అది. జాతీయ సమైక్యతకు వినాశకరమైన ఆరోపణ అది. మత సామరస్యాన్నీ, సమాజ సువ్యవస్థనూ కూలద్రోయమని ప్రత్యక్షంగా రెచ్చగొట్టే ఆరోపణ అది. ఈ వివాదాన్ని మొగ్గలోనే త్రుంచివేయాలి.

మహమ్మద్ అహ్మద్‌ఖాన్ అనే వ్యక్తి తన భార్య షాబానుతో 43 సంవత్సరాలు కాపురం చేశాడు. వారికి ఐదుగురు పిల్లలు కలిగారు. ఆ తర్వాత సరైన కారణం లేకుండా అతడు ఆమెను ఇంటి నుంచి వెళ్ళగొట్టాడు. మూడు సంవత్సరాల తర్వాత, నిస్సహాయురాలైన ఆ స్త్రీ కోర్టుకు వెళ్ళింది. నెలకు రూ. 500 లను భరణం ఇవ్వమని కోరింది. ఏక పక్షంగా మూడుసార్లు 'తలాక్' అని ఆ భర్త విడాకులు ఇచ్చాడు. కోర్టులో రూ. 3,000/-లు కట్టాడు. ఇస్లాం ప్రకారం మరో పైసా అయినా కట్టనక్కరలేదని వాదించాడు. కష్టాలలో వున్న ఆ స్త్రీకి నెలకు దాదాపు రూ. 200/- లు ఇవ్వాలని సుప్రీం కోర్టు తీర్పు చెప్పింది. ఈ తీర్పులోని న్యాయం మెచ్చుకోదగినది. అయినా అందులో ఇస్లాంకు ఘోర ప్రమాదం వున్నదని ముస్లిం మత గురువులు, ఒక సెక్యులర్ రాజకీయ పార్టీ కార్యదర్శి భావిస్తున్నారు. ఎక్కడో ఏదో లోపం వున్నది.

తాను ఒక హిందూ రిపబ్లిక్ కాకూడదనీ, సెక్యులర్ రాజ్యాంగం ప్రకారం నడవాలనీ ఇండియా నిర్ణయించి నప్పుడు ముస్లిం నాయకులు దాన్ని మెచ్చుకున్నారు. ఆ రాజ్యాంగానికి కట్టుబడి వుంటామని వాగ్దానం చేశారు. ఇప్పుడు ఆందోళన జరిపేవారు ఆ రాజ్యాంగంలోని ఒక సూత్రం ఆధారంగా వాదిస్తున్నారు. రాజ్యాంగంలోని 25 వ సూత్రం అంతరాత్మ స్వేచ్ఛకు హామీ ఇస్తున్నది నిజమే. మతాన్ని అవలంబించడానికీ, ఆచరించడానికీ, ప్రచారం చేయడానికి హక్కు కూడా ఇస్తున్నది. ఆ సూత్రం మతంలో అంతర్భాగాలు అయిన పూజా విధానాలకూ, వ్రతాలకూ, ఆచారాలకూ రక్షణ కల్పిస్తున్నది.

అయితే, అనేక మతాలు వున్న సమాజంలో ప్రజల సువ్యవస్థకుగాని, ప్రజారోగ్యానికిగాని, ఉదారమైన నైతికతకు గాని విరుద్ధంగా వుండే మతాచారాలను అణచి వేసేందుకుగాని, మార్చేందుకుగాని సెక్యులర్ ప్రభుత్వానికి పూర్తి హక్కు వుండాలి. ఆ సూత్రం ఇచ్చే హక్కు తిరుగులేనిది కాదు. పై మూడు విషయాలలో శాసనసభ నిర్ణయానికి అది లోబడి వుండాలని స్పష్టంగా పేర్కొన్నారు. కొన్ని ఆర్థిక సంబంధాలకు మత ప్రమేయం వున్నప్పటికీ, వాటిని క్రమబద్ధంచేసే అధికారం శాసనసభకు ఉన్నదని ఆ సూత్రం స్పష్టంగా గుర్తిస్తున్నది. ప్రతి మతమూ కాలాన్నిబట్టి, పరిస్థితినిబట్టి రూపొంది

తుందనే సిద్ధాంతం ఆ సూత్రానికి ఆధారం. విజ్ఞానం కొత్త వెలుగులు ప్రసరింపజేసినా, పరిసరాలలో కీలకమైన మార్పు వచ్చినా—మతాచారాలు మారవలసిన అవసరం ఏర్పడుతుంది.

ఆ విధంగా మన సెక్యులర్ శాసనసభలు చట్టరీత్యా హిందూ మతాచారాలను మార్చాయి కూడా. దేశంలోని అధిక సంఖ్యాకుల మతాచారాలలోనే ఇలా మార్పులు చేసినపుడు—సెక్యులర్ ప్రభుత్వం తమ మతం జోలికి రాకూడదని కొద్దిమంది ముస్లిం మేధావులు వాదించడం అర్థరహితం. ఒక ఇస్లామిక్ రిపబ్లిక్‌లో అలాంటి వాదం గుర్తింపు పొందవచ్చునేమో కాని, సెక్యులర్ రాజ్య వ్యవస్థలో అది హాస్యాస్పదమే అవుతుంది.

క్రిమినల్ కోడ్‌లోని భరణం ఇవ్వాలనే నిబంధన తిరుగుబోతుతనాన్నీ, అవినీతినీ నివారించడానికి ఉద్దేశించినది. తిండికి గడవని స్త్రీ దొంగతనం చేయవచ్చు, గతిలేని పరిస్థితిలో శరీరాన్ని అమ్ముకోవచ్చు. ఆ పరిస్థితి రాకుండా చూడవలసిన బాధ్యత మాజీ భర్తమీద మోపడం న్యాయం. అతనికి ఆ స్తోమత వుంటేనే, ప్రజల సువ్యవస్థకూ, నీతికీ సంబంధించిన నిబంధన ఇది. ముస్లింల వ్యక్తిగత చట్టానికి విరుద్ధంగా వున్నా, అది చెల్లుతుంది. నిజానికి అలాంటి వైరుధ్యం ఏదీ లేదు. ఆ బోర్డు, సయ్యద్ షహబుద్దీన్ భావిస్తున్న దానికన్న షరియత్ చట్టం మరింత న్యాయంగా, మరింత ఉదారంగా వుంది.

"ఇద్దత్" సమయంలో మాత్రమే భరణం ఇవ్వాలని షరియత్ చెపుతున్నదని రుజువుచేస్తే చాలదు. ఆ తర్వాత కూడా భరణం ఇవ్వడం ఇస్లాంకు వ్యతిరేకమని రుజువు చేయాలి.

ఒక ఉదాహరణ: గోవధను నిషేధించే శాసనాన్ని కొందరు ముస్లింలు సవాలు చేశారు. ఇది కుర్బాన్

పండుగలో ముస్లింలు గొర్రెను కాని, ఒంటెను కాని, ఆవును కాని బలి ఇవ్వవచ్చుననీ, ఒక ఆవునే బలి ఇవ్వాలని ఇస్లాంలో లేదని, కనుక ఆ శాసనం 25 వ రాజ్యాంగ సూత్రం హామీ ఇస్తున్న హక్కుకు భంగకరం కాదనీ సుప్రీం కోర్టు తీర్పు ఇచ్చింది.

విడాకులు ఇవ్వడం అనేది అనుమతించబడిన చర్యలు అన్నింటిలో అత్యంత గర్హనీయమైనదని మహమ్మద్ ప్రవక్త పరిగణించినట్లు ఖురాన్ చెపుతున్నది. దానిని అరికట్టే చర్య ఆయన బోధనలకు అనుగుణమే అవుతుంది. ఈ సూత్రం ఆధారంగా పెక్కు ముస్లిం దేశాలు "ఇద్దత్" సమయంలో భరణంతో పాటు మరికొంత ఆర్థిక సహాయం ఇవ్వవలసిన బాధ్యతను గుర్తించాయి.

సిరియాలో 1953 నాటి వ్యక్తిగత హోదా చట్టంలోని 117 వ సెక్షన్ ప్రకారం ఒక వ్యక్తి తగు కారణం లేకుండా తన భార్యకు విడాకులు ఇచ్చినట్లు స్పష్టమయితే 'ఇద్దత్' సమయంలో భరణం కాక, సంవత్సరం పాటు భరణం ఇవ్వాలి. మొరాకోలో 1958 నాటి చట్టంలోని 60 వ సెక్షన్ ప్రకారం — విడాకులు ఇచ్చే భర్త తన స్తోమతను బట్టి, ఆమె స్థితిని బట్టి భార్యకు బహుమతి (ముతా) ఇవ్వాలి. సింగపూర్‌లో 1968 నాటి ముస్లిం చట్టం అమలు శాసనంలోని 52/2 వ సెక్షన్ ప్రకారం — విడాకులకు భార్యా భర్తలలో ఒకరి అంగీకారం మాత్రమే ఉన్న సందర్భాలలో కోర్టు భార్యకు ముస్లిం చట్టం ప్రకారం "ముతా" (బహుమతి) ఇవ్వవచ్చు — సెలంగోర్, కెలంటాస్, ట్రెంగ్‌గను, పహంగ్, మలక్కా, నెగ్రి సెంబిలన్, కెడా పెర్లిస్, బ్రూనీలలో కూడా ఇలాంటి నిబంధన అమలులో ఉంది.

ట్యునీసియాలో 1956 నాటి చట్టంలోని 31 వ సెక్షన్ ప్రకారం — భర్త విడాకులు కోరితే భార్యకు ఎంత నష్ట పరిహారం ఇవ్వాలో కోర్టు నిర్ణయించాలి. ఇరాన్ 1975 నాటి కుటుంబ రక్షణ చట్టం ప్రకారం — వివాహ సంబంధమైన నేరం ఆధారంగా కోర్టు విడాకులు మంజూరు చేసిన సందర్భంలోనూ, నేరం చేయని వ్యక్తికి మళ్ళీ పెళ్ళి చేసుకొనేవరకు కాని, వారిద్దరిలో ఎవరి ఆర్థిక పరిస్థితి అయినా మారే వరకు గాని నేరం చేసిన వ్యక్తి భరణం ఇవ్వాలి.

మహమ్మదు ప్రవక్త తన అనుచరులలో జ్ఞాన తృష్ణని నిర్మాణం చేశారు. ఆయన సాధించిన మహత్తర విజయం అది. ఆయన ఇలా అన్నారు. "జ్ఞానంకోసం ఇల్లు వదలి వెళ్ళే వ్యక్తి దేవుని మార్గంలోకి పయనిస్తాడు .... అమర వీరుని రక్తం కన్న పండితుని సిరా మరింత పవిత్రమైనది." ఒక్క బాగ్దాద్ నగరంలోనే ఆనాడు 36 గ్రంథాలయాలు ఉండేవి. ఒక ముస్లిం మత గురువు రాజప్రసాదంలో వచ్చి నివసించమనే ఆహ్వానాన్ని తిరస్కరించారు. ఆయన గ్రంథాలయాన్ని

రవాణా చేయడానికి 400 ఒంటెలు అవసరం అవుతాయి. కనుక, ఇస్లాం వైభవ శిఖరాలలో అందుకున్న రోజులు అవి. ముస్లిం ప్రజలను విద్యకూ, విజ్ఞానానికీ దూరం చేసిన ముస్లిం నాయకత్వపు పొరపాటు ఫలితమే ముస్లింయి పతనం కావడం.

ఇండియాలోని ముస్లింలు 44 వ సూత్రంతో సహా భారత రాజ్యాంగంలోని నిర్దేశిక సూత్రాలకు విధేయులై ఉండాలి. 1976 లో రాజ్యాంగంలో 51 – ఎ సూత్రం చేర్చారు. రాజ్యాంగానికి కట్టుబడి ఉండడం, దాని ఆదర్శాలను వ్యవస్థలను గౌరవించడం, శాస్త్రీయ దృక్పథాన్ని మానవతా వాదాన్నీ, ప్రతి విషయాన్ని వివేచన చేసే దృష్టినీ, సంస్కరణ దృక్పథాన్ని పెంపొందించుకోవడం—ఇవన్నీ ప్రతి పౌరునికీ విధులు, ఆ సూత్రం ప్రకారం. ఇది ప్రాథమిక కర్తవ్యం. కనుక, లౌకికము కాని పారలౌకికంకాని అయిన ఇతర కర్తవ్యాలను మించిన కర్తవ్యం ఇది.

అయితే, రాజ్యాంగం అమలులోనికి వచ్చిన తర్వాత వచ్చిన ప్రభుత్వాలు దేశ పరిపాలనకు మవులికమైన ఒక కర్తవ్యాన్ని విస్మరించాయి. అల్ప సంఖ్యాకుల వోట్లు సంపాదించాలనే లౌ ప త్ర య ం లో అధికార పార్టీ ఆ రాజ్యాంగ నిర్దేశాన్ని త్రోసిరాజని నిచ్చింది.

చీఫ్ జస్టిస్ ద్వారా సుప్రీం కోర్టు రాజ్యాంగ ధర్మాసనం ఇలా ప్రకటించింది. " మన రాజ్యాంగంలోని 44 వ సూత్రం కాగితాల మీదనే మిగిలిపోవడం కూడా విచారకరం....ఉమ్మడి పౌర చట్టాన్ని రూపొందించడానికి చర్యలు కనపడవు. తమ వ్యక్తిగత చట్టంలో సంస్కరణలు తేవడానికి చొరవ తీసుకోవడం ముస్లింల వంతు అనే అభిప్రాయం వ్యాపించినట్లు కనపడుతున్నది. పరస్పర విరుద్ధమైన సిద్ధాంతాలకు అనుగుణమైన చట్టాలకు విభిన్నమైన విధేయతలను తొలగించడం ద్వారా జాతీయ సమైక్యతను సాధించడంలో ఉమ్మడి పౌర చట్టం దోహదం చేస్తుంది. ఈ విషయంలో చొరవ తీసుకోవడానికి ఏ వర్గమూ ముందుకు రాకపోవచ్చు. పౌరులందరికీ

> " వినయమనే పీఠం మీద మనం దైవాన్నారాధించాలి. ఆ ధ్యాత్మి క ం గా వినయం భక్తి కంటె ఎక్కువ విలువైంది. అయితే చాలా వాటిల్లో భక్తి వినయానికో మెట్టు వంటిదని రుజువు చేసింది. "
>
> – అవతార్ మెహెర్ బాబా

ఉమ్మడి చట్టాన్ని అమలు చేయవలసిన బాధ్యతను ప్రభుత్వానికి అప్పగించారు. దానికి ఆ అధికారం వున్నదనడంలో సందేహం లేదు....వివిధ మతాల వారిని ఒకే వేదికమీదకు తేవడంలో వున్న ఇబ్బందులను మేము గుర్తిస్తున్నాము. అయితే, రాజ్యాంగానికి అర్థం వుండాలంటే అందుకు ప్రారంభం జరగాలి. సంస్కర్త పాత్రను కోర్టులు వహించాలి....అయితే, వ్యక్తిగత చట్టాల మధ్య వున్న అంతరాలను తొలగించడానికి కోర్టులు ఒక్కొక్కటిగా తీసుకునే చర్యలు ఉమ్మడి పౌర చట్టం స్థానాన్ని వహించజాలవు. కేసు తర్వాత కేసులో న్యాయం చెప్పడం కన్న అందరికీ న్యాయం చెప్పడం మరింత సంతృప్తికరమైన పద్ధతి. "

చివరగా, డాక్టర్ తహిర్ మహమూద్ చేసిన పిల్లిమొగ్గ విషయం ప్రస్తావించాలి. " ముస్లిం పర్సనల్‌లా " అనే గ్రంథంలో ఆయన ఉమ్మడి పౌర చట్టం అమలు జరగాలనే కోర్కెను తాను ఎన్నడూ బలపరచలేదనీ, ఒకే పౌర చట్టం అనేదే అవసరం అయితే, " షరియత్ " చట్టాన్ని మాత్రమే జాతి అంతకూ వర్తింపజేయాలనీ ఆయన ఇప్పుడు చెపుతున్నారు. 1985 సెప్టెంబర్ నాటి " ముస్లిం ఇండియా " పత్రికలో డాక్టర్ తహిం మహమూద్ రాజ్యాంగాన్నీ, దాని సెక్యులరిజంను ఆ రెంటికీ వెన్నుపోటు పొడవడానికి వాడుతున్నారు. భారతదేశంలో ఇస్లాంకూ, భారతీయ ముస్లింలకూ పట్టిన విషాద స్థితికి ఆయన ప్రతీకగా నిలుస్తున్నారు. ★

పొదిలి డిస్ట్రిక్టు మున్సబువారి కోర్టులో

O. S. No. 158/81 E P 33/85

జవ్వాజి లక్ష్మీసుబ్బయ్యశెట్టి—వాది

And

బాసా విమల్లారెడ్డి—ప్రతివాద్లు

ఈనెంబరు తాలూకు ప్రతివాది ఆస్తులు క్రింద వివరించిన షెడ్యూలు దాఖలా వివరములు గలవి 29-1-1986 వ తేదీన కోర్టువారి ఎదుట బహిరంగముగా వేలం వేయబడును. పాటదారులు వచ్చి పాడుకొనవచ్చును.

వే లం షె డ్యూ లు

1. ప్రకాశం జిల్లా పొదిలి తాలూకా తర్లుపాడు గ్రామంలో నెం. 377 పట్టా R. S. No. 368/3 లోని Ac. 3-10 సెంట్లు లేక 1-25 హెక్టార్సు హద్దులు.

తూ—వెన్నా నాగిరెడ్డి & వెంకటరెడ్డి etc.

ఉ — తుమ్మలచెరువు రాస్తా

కె. అంకిరెడ్డి

యేరువ మల్లారెడ్డి

వాది విలువ రు. 1200/-

అమీనా విలువ రు. 1800/-

2. డిటో గ్రామంలోని R. S. 456 నెంబరులో Ac. 8-20 సెంట్లు లేక 3. 312 హెక్టార్లు.

తూ —వీరభద్రుస్వామి మాన్యం etc.

ద — సంగా పాపయ్య etc.

ప — పిన్నిక పెద పుల్లయ్య etc.

ఉ — దొండ్లేటి రామయ్య etc.

వాది విలువ రు. 1600/-

అమీనా విలువ రు. 4800/-

3. డిటో గ్రామంలో R. S. 346/3 లో Ac. 0-77 సెంట్లు లేక 0-311 హెక్టార్లు.

తూ— చెరువు కట్ట

ద — కొలిగట్ల పెద్ద కొండయ్య etc.

ప — వెన్నా వెంకయ్యగారి కుమార్డు చిన సుబ్బారెడ్డి

ఉ — వెన్నా రామిరెడ్డి etc.

వాది విలువ రు. 800/-

అమీనా విలువ రు. 600/-

4. డిటో గ్రామంలోని R. S. 354/14 లో Ac. 0-28 సెంట్లు లేక 0-113 హెక్టార్లు హద్దులు.

తూ— చెరువు కట్ట

ద — కొలగట్ల పోతిరెడ్డి

ప — కొలగట కాశిరెడి etc.

ఉ — యేరువ సుబ్బారెడ్డి etc.

వాది విలువ రు. 300/-

అమీనా విలువ రు. 600/-

5. డిటో గ్రామంలోని R. S. 148/9 Ac. 0-96 సెంట్లు లేక 0-387 హెక్టార్లు హద్దులు.

తూ— గోను వెంకట్రామయ్య

ద — పావళ్ళ వీరభద్రుడు

ప — దగ్గుపాటి రాజయ్య

ఉ — చేతుల కోటయ్య

వాది విలువ రు. 1000/-

అమీనా విలువ రు. 2000/-

6. డిటో గ్రామంలోని R. S. No. 135/1 లో Ac. 3-29 లేక 1-329 హెకారు హదులు.

తూ.— కశ్చెట్టి సూర్యనారాయణ

ద — దొండ్లేటి వీరారెడ్డి

ప — పోతిరెడ్డి అంకయ్య

ఉ — కవిగిరి పెద్ద మునలయ్య

వాది విలువ రు. 600/-

అమీనా విలువ రు. 2000/-

వేలం — 29-1-1986

దత్తలూరు శ్రీరామమూర్తి B. A., B. L.

D. H. R. అడ్వకేటు

# "వాగ్గేయకార రత్న" హరి నాగభూషణంగారు

**- భావరాజు నరసింహారావు**

" . . . మూర్తి సౌమ్యతయు బాహుల దీర్ఘతయుం బటుత్వ తత్వజ్ఞతయున్ గతి స్ఫుర దుదాత్తతయుం .... " అన్న తిక్కన గారి అర్జునుణ్ణి గురించిన పద్యం నాగభూషణంగారికి చక్కగా వర్తిస్తుంది. ఉన్నతమైన విగ్రహమూ, ఎత్తుకు తగిన పుష్టిగల దేహమూ, దీర్ఘమైన బాహువులూ, కోటేరువంటి నాసికా; చెవులకు స్వర్ణ తాపిత రుద్రాక్షలూ, విశాల వక్షంమీద మునగాల రాజాగారు బహూకరించిన బంగారు తొడవుతో వున్న రుద్రాక్షమాలా, కుంకుమ బొట్టుతో బ్రహ్మ వర్చస్సు వెలార్చే విశాలమైన ముఖమూ - ఇవీ హరి నాగభూషణంగారి బాహ్య మూర్తికి చిహ్నాలు. తరతరాలుగా వస్తున్న సనాతన ధర్మ దీక్ష, అరమరికలు లేని అమాయక హృదయము, సాక్షాత్తు ఆదిశంకరులే త్యాగరాజుగా అవతరించారన్న నమ్మకంతో పెంచుకొన్న శ్రీ త్యాగరాజస్వామి మీది గౌరవము, " రామా నినే నమ్మినాను ! నిజముగ సీతా రామ నినే నమ్మినాను " అన్న శ్రీరామచంద్రుని మీద అకలంక భక్తి - ఇవన్నీ నాగభూషణంగారిలో సమపాళ్ళుగా దాగి ఉండేవి.

నాగభూషణంగారు బి. ఏ. పట్టభద్రులు. ఫస్టు గ్రేడు ప్లీడరు పట్టాకూడా పొందారు. వృత్తివల్ల వకీలు ; ప్రవృత్తివల్ల నాదబ్రహ్మోపాసకులు. అంతేకాదు, శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, శిష్టా నరసింహశాస్త్రిగారల వంటి మహా పండితులకు శిష్యుడై సంస్కృతంలోనూ, తెలుగులోనూ అనేక కృతులనూ, శతకాలనూ వ్రాసి సంగీతంలోనూ, సాహిత్యంలోనూ కూడా సమాన ప్రతిభను గడించిన వాగ్గేయకార రత్నం. త్యాగరాజ చరిత్ర, శంకర విజయం, పాదుకా పట్టాభిషేకం మొదలైన హరికథలను రచించి భక్త జనాహ్లాదకరంగా గానం చేసిన



భక్తవరేణ్యుడు. పండిత పరిచర్య చేసి వేదాంత భాష్య శాంతితో పాటు భగవద్గీతలోని కొన్ని అధ్యాయాలకు వ్యాఖ్యానం వ్రాసిన గోష్ఠీపరుడు. ఇన్ని శక్తులూ, సుగుణాలూ ఒకే చోట కేంద్రీకృతం కావడం చాలా అరుదు.

అసలు హరివారి వంశానికే సంగీత ప్రపంచంలో ఒక విశిష్టస్థానం ఉన్నది. త్యాగరాజులవారి గురువు శొంఠి వెంకట రమణయ్యగారని చరిత్ర చెబుతున్నది. ఆ రమణయ్యగారి గురువు హరి రామయ్యగారని విఖ్యాత విమర్శకులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు విశదీకరించారు. రామయ్యగారు కృష్ణాజిల్లావారు. మహా విద్వాంసులు. ఆయన ఒక పెళ్ళి పందిరిలో కచేరీ చేస్తూ, అగ్నిసంబంధమైన రాగాన్ని మైమరచి తన్మయత్వంతో ఆలాపన చేస్తూండగా అగ్ని ప్రజ్వరిల్లి, పెళ్ళి పందిరి అగ్నికి ఆహుతి అయిపోయింది. శుభ సమయంలో ఇలాంటి అవాంతరం జరగటం అందరికీ కష్టం కలిగించింది. ఆ కారణంగా రామయ్యగారికి ఆంధ్రదేశంలో ఉండటం

కష్టమై, మైసూరుకి తరలి వెళ్ళారు. అక్కడ ఒక రోజున సంధ్యావందనం ముగించుకుని ఒక తోటలో విశ్రాంతి తీసుకుంటూండగా ఇద్దరు రాకుమార్తెలు భయంతో పరుగెత్తుకుంటూ రామయ్యగారు కూర్చున్న చోటుకి వచ్చారు. వాళ్ళను తరుముకుంటూ వస్తున్న నాగుపాముని చూసి, రామయ్యగారు వెంటనే "పున్నాగవరాళి" రాగం ఆలపించారు. పాము పడగ విప్పి ఆడింది. అలా కొంత సేపు దానిని ఆడించి, చివరకు "గరుడధ్వని" రాగం పాడారు. అప్పుడు పాము వెళ్ళిపోయింది. ఈ విషయం అంతా ఆ రాచకుమార్తెలు తమ తండ్రిగారైన మహారాజా వారికి చెప్పారు. మహారాజా మహా విద్వాంసుడైన రామయ్యగారిని తమ ఆస్థాన విద్వాంసులుగా నియమించి జీవితాంతము ఎంతో గౌరవించారు. ఆ తర్వాత శొంఠి వెంకట రమణయ్యగారు ఆయనకు శిష్యులైనారు.

నాగభూషణంగారి తాతగారు అచ్యుత రామయ్యగారు కూడా మహా విద్వాంసుడు. ఆంధ్రదేశం రెడ్ల పాలనలో ఉండగా రెడ్ల ఆస్థాన విద్వాంసులుగా ఆయన రాణించారు. ఆయన కుమారుడు నరసింహంగారు కూడా గొప్ప సంగీత విద్వాంసుడు. నరసింహంగారు త్యాగరాజుగారి ప్రశిష్యులైన పట్నం సుబ్రహ్మణ్య అయ్యరుగారి ప్రియశిష్యుడు. ఆయన కుమారుడే మన నాగభూషణంగారు.

కృష్ణాజిల్లా, దివి తాలూకా హరిపురంలో 1884 సంవత్సరం డిసెంబరు 24 తేదీన నాగభూషణంగారు జన్మించారు. తండ్రి నరసింహంగారు శిష్యులకు చెప్పే సంగీత పాఠాలను శ్రవణమాత్రం చేతనే గ్రహించి ఏడేళ్ల ప్రాయం రాక పూర్వమే పిళ్లారి గీతాలు, ఘనరాగ గీతాలు, చిన్న చిన్న గేయాలు స్వర యుక్తంగా పాడటమే కాకుండా ఫిడేలు వాయించడంలో కూడా సామర్థ్యం సంపాయించారు నాగభూషణంగారు.

ఇంగ్లీషు చదువుకి నాగభూషణంగారు బందరు చేరారు. చురుకైన విద్యార్థి కావడం చేత మొదటినుంచీ ఫ్రీ స్కాలర్ షిప్‌తో నోబుల్ కాలేజిలో బి. ఏ. పరీక్ష పాసయ్యారు. తరువాత ఫస్ట్‌గ్రేడ్ ప్లీడరు పరీక్షకు మద్రాసు వెళ్ళారు. ఆ కాలంలో తిరుక్కోడి కావల్ కృష్ణయ్యర్, తిరుచునాపల్లి గోవిందస్వామి పిళ్లెగార్లు దక్షిణ దేశంలో మహా ప్రతిభావంతులైన వయొలిన్ విద్వాంసులు. వాళ్ళను తన పరోక్ష గురువులుగా ఎన్నుకుని వాద్య సంగీత సాధన చేశారు నాగభూషణంగారు. కోనేరి రాజపురం వైద్యనాథ అయ్యరు ఆనాడు సుప్రసిద్ధ గాయక శిఖామణి. ఆయనను కూడా తన గాత్ర సాధనకు పరోక్ష గురువుగా నాగభూషణంగారు ఎన్నుకున్నారు. లా కాలేజిలో చదివిన కాలంలోనే దక్షిణ దేశంలోని ప్రధాన పట్టణాలలో జంత్రగాత్ర

కచేరీలు చేసి రసజ్ఞుల వల్లా, గాయకోత్తములచేతా ప్రశంసలందుకున్నారు.

మద్రాసు నగరంలో 1912 లో నాగభూషణంగారికి గొప్ప సన్మానం జరిగింది. సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు తచ్చూరు సింగరాచార్యులుగారు నాగభూషణంగారికి బంగారు తోడా తొడిగి గౌరవించారు. అంత గౌరవం ఆంధ్ర గాయకులకు ఆ నగరంలో అంతకు పూర్వం జరగలేదంటారు.

ఆనాటి మదరాసు రాష్ట్ర రసజ్ఞశేఖరుల పక్షాన విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావుగారు అధ్యక్షులుగా ఆహ్వాన సంఘం ఏర్పడి, 1932 సంవత్సరంలో నాగభూషణంగారికి ఘనమైన సన్మానం బందరులో జరిగింది. ఆ సభకు ప్రొఫెసర్ పి. సాంబమూర్తి, శ్రీమాన్ ఎన్. విజయరాఘవన్ అయ్యంగార్, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు, కాశీ కృష్ణాచార్యులుగారు మొదలైన పెద్దలు విద్వాంసులు, మహా కవులు, రసజ్ఞులు ఎంతోమంది విచ్చేశారు. పైగరు వరదాచార్యులుగారు ప్రతిపాదించిన "వాగ్గేయకారరత్న" అనే బిరుదును నాగభూషణంగారికి ప్రదానం చేసి గౌరవించారు. నాగభూషణంగారికి శ్రీరాముడు ఇష్టదైవం; త్యాగరాజు సద్గురువు. అంచేత వారి ఇరువురి మూర్తులతో కూడిన బంగారు పతకం చేయించి "శ్రీరామ స్వర్ణ నవరత్నమాల" అన్న పతక సహిత మాలను నాగభూషణంగారికి బహూకరించారు.

తిరువయ్యారులో శ్రీ త్యాగరాజస్వామి ఆరాధనోత్సవాలు చూసి ప్రభావితుడై త్యాగరాజ ఆరాధనోత్సవాలను తన యింట, స్వంత ఖర్చుమీద, అన్నిరకాల యిబ్బందులనూ సహిస్తూ, దాదాపు పాతికేళ్ల అతి వైభవంగా జరిపారు నాగభూషణంగారు. భక్త పోతన, త్యాగరాజుల వలె నాగభూషణంగారిని కూడా సరస్వతి అనుగ్రహించింది. లక్ష్మీదేవి కటాక్షం మాత్రం లభించలేదని ఈ సందర్భంలో మనం గమనించాలి. ఆంధ్రదేశంలో త్యాగరాజ ఆరాధనోత్సవాలను ప్రప్రథమంగా ప్రారంభించిన కీర్తి నాగభూషణంగారిదే నంటారు విజ్ఞులు.



సంగీతం కళ కాదు; అది ఒక మహా తపస్సు అని నమ్మిన నాదోపాసకులు నాగభూషణంగారు. తన అభిప్రాయాలను వ్యక్తం చేస్తూ అనేక పత్రికలలో వ్యాసాలు వ్రాశారు. "Is Music a Science or Art?" "The Idealism and Philosophy of Thyagaraja", "Karnatak Music" అనే వ్యాసాలు మా 'Triveni' వ్రాశారు.

'వయొలిన్' అనే ఆంగ్ల పదానికి "వాయులీనము" అనే తెలుగు మాటను సృష్టించి, దానిని ప్రచారం లోనికి తెచ్చినవారు నాగభూషణంగారు. నాగభూషణంగారికి పూర్వం ఆంధ్రదేశంలో జంత్ర గాత్రాలకు పేరు పొందినవారు పాపట్ల కాంతయ్యగారు, గరికపర్తి కోటయ్య దేవరగారు, గొర్తి లక్ష్మీనారాయణగారు. అయితే ఆంధ్రదేశపు ఎల్లలు దాటి దక్షిణ దేశంలో కీర్తి, పతాకను నిలబెట్టిన ప్రతిష్ఠ నాగభూషణంగారికే దక్కింది. నాటికీ నేటికీ ఆయనన




Phone : 221

# Lor'ven Bar & Restaurant

**Bandar Road, CHALLAPALLI – 521 126**

Krishna Dist., A. P.



రుచికరమైన చైనీస్ వంటకాలకు మా ప్రత్యేకత.

ప్రొప్రయిటర్ :

వీరమాచనేని పట్టాభి సీతారామయ్య

మించిన జంత్ర గాత్రజ్ఞులు దక్షిణ దేశంలో లేరనడం సత్య దూరం కాదు.

నాగభూషణంగారి సంగీత సాధన ఒకమహా తపస్సు. ఆయన సంగీత కచేరీ ఒక రమ్య చిత్రం, ఒక అపురూప రూపకల్పన. పరిపరివిధాల తన ఆరాధ్యదైవాన్ని, శ్రీరామ చంద్రమూర్తిని, అనేక కృతులలో కీర్తించి, ఆ దైవం తనను కటాక్షించాడనే తృప్తితో, అనుభూతితో తాదాత్మ్యం పొంది ఆనంద బాష్పాలు రాల్చేవారు. రసజ్ఞులైన శ్రోతలు కూడా తమ్మె తాము మరచి గాంధర్వ లోకంలో విహరించి, తమకు కూడా ఆ శ్రీరామచంద్ర మూర్తి లీలగా గోచరిస్తున్నట్లు భావించి, పులకించి ఆనంద బాష్పాలు వర్షించేవాళ్ళు.

సంగీత కచేరీలలో సామాన్యంగా గాయకులందరూ సరిగమ లతోనే స్వరం వేయడం సంప్రదాయం. అయితే నాగభూషణంగారు ఆ సంప్రదాయాన్ని అనుసరిస్తూనే భక్తి తన్మయత్వంలో సరిగమలతో పాటు రామ నామాలతో కూడా స్వరం వేసి భక్తి ముక్తి ప్రదాయకమైన శ్రీరామ నామాన్ని జపించేవారు. ఇది నిజంగా అనూహ్యమైన విషయం, నాగభూషణంగారికే అది చెల్లింది.

సభికులలో విద్వాంసులుంటే నాగభూషణగారు పొంగి పోయేవారు. " .... మూపులు మూడగున్ రిపుచమూపుల గన్నపుడే కిరీటికిన్ .... " అని విజయ విలాసంలో పార్థుణ్ణి గురించి చేమకూర వేంకటకవి చెప్పింది నాగ భూషణంగారి యెడ బాగా వర్తిస్తుంది. పూచి శ్రీనివాస అయ్యంగార్ గొప్ప విద్వాంసులు. " విరుబోణి .... " వర్ణం అతి దురితంగా పాడి ఒప్పించడం ఆయన ప్రత్యేకత. ఆయన కచేరీకి ఇరవై ఏళ్ళ వయసు గల నాగభూ షణంగారిని వయొలిన్ వాయించడానికి ఏర్పాటు చేశారు. చేతగాని కుర్రవాణ్ణి కూచోబెట్టి తన కచేరీ పాడుచేయడానికి కార్యకర్తలు పూనుకున్నారని అయ్యంగార్ భావించారు. తన పోకడను గమనించి, తనను నీడలా అనుసరించి వాయించిన నాగభూషణంగారిని సభానంతరం కౌగిలించుకొని ఎంతో అభినందించారు అయ్యంగార్.



నాగభూషణంగారు భాష్యాంతం అధ్యయనం చేసినారు. అంచేతనే త్యాగరాజ కీర్తనలలోని భావాలకు అనుగుణంగా భగవద్గీతలో నుంచీ, ఉపనిషత్తులలో నుంచీ, కాళిదాసాది మహా కవుల కావ్యాలలో నుంచీ శ్లోకాలను ఎన్నుకుని, వాటిని త్యాగరాజ కృతులతో మిళితం చేసి శ్రోతలకు అందించేవారు. ఇది అనితర సాధ్యమైన పని. నాగ భూషణంగారికి పూర్వం గాని, ఆయన తరవాత గాని ఇలా శ్రోతలను అలరించిన గాయకులు లేరు.

మునగాల రాజాగారి ఆస్థానంలో " త్యాగరాజు " హరికథను నాగభూషణంగారు ఉదయం 7-30 గంటల నుంచి రాత్రి 9-30 గంటల వరకు ఏకధాటీని చెప్పారన్నా, నాగభూషణంగారు తన యింట జరిపే శ్రీ త్యాగరాజ ఆరాధనోత్సవాలలో కాంభోజిరాగం కచేరీ 9-30 గంటల నుంచి తెల్లవారి 5 గంటల వరకు చేశారన్నా ఈనాటి సుకుమార్ర ఆంధ్ర రసజ్ఞులు నమ్మరేమో !

అన్నట్లు, నాగభూషణంగారు యౌవనంలో నాటకాలలో వేషాలు కూడా వేసేవారు. "చిత్రనళీయం" లో బాహుక పాత్ర నిర్వహించేవారు. హరిశ్చంద్ర వేషం బాగా వేసేవారు. అయితే ఒకసారి ఆ నాటకంలో లోహితాస్యుడు చనిపోయినప్పుడు పద్యాలు ఎంతో బాగా పాడి ప్రేక్షకుల "వహ్వా" లను పొందిన వారంరోజులకు తన కుమారుడు మరణించగా, ఆ వేషానికే గాక నాటకాలకి కూడా అంతటితో స్వస్తి చెప్పారు. ఆ రోజులలో నాగభూషణంగారికి వెలమ వీరులవలె మంచి మీసాలు కూడా ఉండేవి !

నాగభూషణంగారికి దేశంలో ఎంతోమంది స్నేహితులూ, అభిమానులూ, ఆప్తులూ ఉండేవాళ్ళు. అయితే ఆయన లౌకికం బొత్తుగా తెలియని అమాయకులు కనుక సన్నిహితులతో కూడా ఎప్పుడు, ఎందుకు స్నేహం విడిపోతుందో తెలిసేది కాదు. ఆయన అమాయకత్వం ఎలాంటిదంటే – ఒకసారి కోర్టులో ఆయన వాదిస్తున్నారు, క్రాస్ ఎగ్జామినేషన్ చేయడంలో కొన్ని అనవసరపు ప్రశ్నలు వేసినట్లు మునసబుగారు భావించి, "నాగభూషణంగారూ, కాలం వ్యర్థం చేయకుండా పని త్వరగా ముగించండి" అని అన్నారు. అంతే. ఇహ ఆ కేసులో వాదించనని నాగభూషణంగారు భీష్మించారు. వాదన ఆపేశారు. పాపం, మునసబుగారే నొచ్చుకుని – నాగభూషణంగారి తత్త్వం తెలిసినవాడు కనుక - ఆయనను ప్రతిమాలగా అప్పుడు నాగభూషణంగారు మిగతా కేసు వాదించారు.

మూడు దశాబ్దాలకు పైగా దక్షిణ దేశంలో సంగీత దిగ్విజయ యాత్ర సాగించి, సంస్కృతాంధ్రాలలో "త్యాగయోగం" అనే ముద్రతో అనేక కీర్తనలు రచించి, గానం చేసి పండిత పామరుల మెప్పును పుష్కలంగా ఆర్జించిన మహా విద్వాంసుడు నాగభూషణంగారు 1941 లో పక్షవాత వ్యాధికి గురి అయ్యారు. అంత బలవంతమైన వ్యాధికి ఆ సింహబలుణ్ణి లొంగదీసుకోడానికి పద్దెనిమిదేళ్ళు పట్టింది. ఆ వైదికోత్తముడు, ఆ మహా

> "ఉన్నత స్థాయిలో వున్నవారు నీతివంతులై వుంటే, నైతికత సమాజంలో అట్టడుగున వున్నవారికి ప్రవహిస్తుంది; ఫలితంగా అందరికి సౌశీల్యం ఏర్పడుతుంది. శీలాన్ని క్రిందనుంచి పైకి నిర్మించలేము; శీలాన్ని ఎప్పుడూ పైనుండి నిర్మించుకు రావాలి."
>
> - శ్రీ గురూజీ గోళ్వాల్కర్

తపస్సంపన్నుడు, ఆ శ్రీరామ భక్తుడు జీవితంలో త్యాగయ్యగారివలె తురీయాశ్రమ స్వీకారం చేసి శ్రీరామానంద భారతీ యతీంద్రులై, చివరి గడియ వరకూ శ్రీరామనామ జపం చేస్తూ ప్రాణోత్క్రమణం చేసి మోక్షాన్ని పొందారు – 1959 సంవత్సరం సెప్టెంబరు ఏడవతేదీన.

"సంగీతజ్ఞానము భక్తి వినా సన్మార్గము గలదె మనసా" అని త్యాగయ్యగారు సెలవిచ్చారు. నాగభూషణంగారి గానానికి ఈ సిద్ధి లభించింది. భక్తి రూపాన్ని సంతరించుకున్న వారి గాన కళ ఉత్తమమైనది. తాను పరమ దైవతంగా ఎంచుకున్న త్యాగరాజు అడుగుజాడల్లో "నిధి చాల సుఖమా ! రాముని సన్నిధిసేవ సుఖమా ! నిజముగ బల్కు మనసా" అన్న మాటలలోని రహస్యాన్ని అర్థం చేసుకుని, అలా ఆచరించి, తరించిన ధన్యులు నాగభూషణంగారు.

చెళ్ళపిళ్ళ మహాకవి చెప్పినట్లు —

"త్యాగరాజ పదాంభోజ రాగి యితడు
అగమాంతాంగనా మణీ భోగి యితడు
వాగగోచరాత్మానంద భాగి యితడు
అగ మెరుగని మేటి విరాగి యితడు." ★

# రంజనిమాల

సంకలనం

డా॥ వి. ఫణీంద్రుడు

* ఆధారములు *

అక్బర్, నిస్సార్, పద్మిని, భారతి, రాజన్న, లింగాంబ, కళ్యాణుడు, కొండరాజు, తారామతి, మేడాంబిక, రంగకవి, అమర్‌నాథ్, అంబరాయలు, కటకరాజు, కాటమరాజు, జగ్గన్నరాజు, భాస్కరకవి, రాయన మంత్రి, రంగనాథము, తిమ్మనామాత్యుడు, నర్మదాశంకర్, రాజారామారావు, అంబజయదేవుడు, ఉదయ మార్తాండవర్మ, బలివాడ కాంతారావు, తెనాలి రామలింగకవి, దేశాయి నరసింగరావు, కాకతి గణపతి దేవుడు : వీరిని ఈ ఆధారములతో అమర్చి రంజనిమాలని పూరించండి.



## అడ్డము

1. రుద్రమదేవి పాలన అంగీకరించని సామంతరాజు
6. తిరువాన్కూర్ పరిపాలించిన రాజు
8. రాజుగారి సోదరుడు అనిపిస్తుంది
9. మంత్రి కాని సేనాని
10. రాజైన కవి
11. మొగల్ చక్రవర్తి
12. ఓరుగల్లు పాలించిన రాజు
14. కాని సార్, అతను క్రికెట్ ఆటగాడు
15. ప్రప్రథమముగ మద్రాస్ న్యాయాధిపతి
16. గోల్కొండ యందు నివసించిన వనిత
21. వికట కవి
23. నవలా రచయిత
24. రాజ తరంగిణి రచించిన కాశ్మీర్ బ్రాహ్మణుడు

## నిలువు

1. కొండపల్లి దుర్గమును జయించిన ఒరిస్సా రాజు
2. వాసిరెడ్డి వెంకటాద్రిగారి తండ్రి
3. రాయమూర్ సంస్థానాధిపతి
4. రామ రాయల కొడుకు
5. స్వాతంత్ర్య సిద్ధిని అభిలషించిన వనిత
7. బుద్ధుని భార్య
10. సాహిత్య మాసపత్రిక
11. తండ్రి కొడుకు లిద్దరు క్రికెట్ ఆటగాళ్ళు
12. ఎఱ్ఱగడ్డపాటి అధీశ్వరుడు
13. అద్దంలో ఆమె అందం ఆనందించాడు
15. కస్తూరి ఇంటిపేరు గల కవి
17. కృష్ణదేవరాయని మంత్రి
18. గద్వాల సంస్థానాధిపతి
19. విజయాదిత్య మహారాజుని అంటిపెట్టుకొన్న వ్యక్తి
20. కామనృపుని తల్లి
22. లింగాపురమును కట్టించిన వనిత